శ్రీ మమ్మట రచిత

# కావ్యప్రకాశము



మహోపాధ్యాయ, దర్శనాచార్య
లాక్షణిక శిరోమణి, సాహిత్యవిద్యాభాషాప్రవీణ

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ

విరచిత "విమర్శనీ" వ్యాఖ్యానసహితము



వెల: రూపాయి ముప్పావలా. ౧-౧౨-౦

ప్రథమ ముద్రణము 1953

## ఉ ప హా రః

"వావిళ్ళాన్వయ వేంకటేశ్వర సుధీ ధీదేవతా ప్రోదిత
స్వాంతేనాత్తరసాధికార మహసా శ్రీస్పందభాజా మయా
సాహిత్యాధ్వని సారభారతగవీ సంక్లిష్ట భాగ్యోన్నతిః
నేయం కావ్యప్రకాశ భావపదవీ సూచ్యార్థసారీకృతా"

"వావిళ్ళాన్వయరాకేందో! వేంకటేశ్వరధీవర !!
ఆత్మానందాయ తే భూయాత్ ఉపహారో విమర్శనీ"

శ్రీ కైలాస ముద్రణాలయము
గుంటూరు

శ్రీ

ఆశీః

# అభిప్రాయ నివేదనము

శ్రీమాన్ పరవస్తు వేంకట రామానుజస్వామిగారు, యం. ఏ.,
అధ్యక్షులు :
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయము : తిరుపతి

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ గారు తాము రచియించిన కావ్యప్రకాశాంధ్రవ్యాఖ్యను గూర్చి నా యభిప్రాయమును దెలుపఁగోరిరి. కార్యవ్యగ్రతచే నూపిరిఁ బీల్చుటకయిన నవకాశము లేని నాకు, ముచ్చటగ మూఁడు వాక్యములతో నభిప్రాయమును దెలుపుటయే యుక్తమయినను, గ్రంథగౌరవము వ్యాఖ్యాత్రనురాగము నట్లు చేయనీయక క్రింది శబ్దవిస్తరమునకు సహకారు లయినవి.

శ్రీ శర్మగారు నాకుఁ జిరపరిచితులు. నేను విజయనగరమున శ్రీ మహారాజ సంస్కృతకళాశాల కధ్యక్షుఁడుగ నుండిన సమయమున వీరా కళాశాలలోనే విద్యాభ్యాసముఁ జేసిరి. నాఁటి నుండి నేఁటివరకు వీరి వృత్తము నాకు విదితప్రాయమే. మహామహోపాధ్యాయ "తాతా సుబ్బరాయశాస్త్రి" మొదలగు సుప్రసిద్ధ విద్వాంసుల కడ వీరు సాహిత్య దర్పనము నధ్యయనముఁ జేసిరి. పిదప సతము విద్యావ్యసనులయి బహుశాస్త్రపారజ్ఞులగుటయే కాక సాహిత్యతత్త్వమును సమగ్రముగ నెఱిఁగిన వారిలో నొకరుగఁ బరిగణింప నర్హతను సంపాదించిరి. తమ విద్య కధీతిబోధాచరణ ప్రచారణము లను నాల్గు దశలను గలిగించి వన్నె కెక్కిరి. వీరి పాండిత్యమును వీరి గ్రంథములే నాకన్న నధికముగ విశదీకరింపఁ గలవు, గాన

నా యంశమున విస్తృతి యనావశ్యకము. విద్యార్థిదశ నుండియు వీరి విషయమున నాకుఁ గల శుభకామన సార్థక మయినందుల కెంతయు సంతసము గలుగుచున్నది.

శ్రీ మాధవరామశర్మ గారిదివఱకే "రసగంగాధరము" "ప్రతాపరుద్రీయము" అను ప్రసిద్ధాలంకారగ్రంథముల నాంధ్రీకరించి యాంధ్రసహృదయలోకము యొక్క మన్ననల నందుకొన్నారు. ఇటీవలనే "ధ్వనిసారము" అను కృతిని ధ్వన్యాలోక తత్త్వబోధకముగా సంస్కృతాంధ్రములలోఁ బ్రకటించి ప్రశస్తి నొందియున్నారు.

ప్రకృతము 'కావ్యప్రకాశ'మునకుఁ గూడ నాంధ్రవ్యాఖ్యను రచించి యాంధ్రపాఠకలోకము యొక్క నిరీక్షణమును సఫలము గావించినారు. ఈ విధముగ నలంకారగ్రంథములలో నుత్తమములు, నేఁటి పఠనపాఠన వ్యవహారమున సర్వత్ర లబ్ధప్రతిష్ఠములు నగు నాలుగు గ్రంథములు శ్రీ శర్మగారి కృషి వలన నాంధ్రములయి యాంధ్రాభ్యుదయమున మరియొక ఘట్టమును సాధించినవి.

కావ్యప్రకాశ మలంకార మహాభాష్య మను బిరుదమును సంపాదించిన గ్రంథరాజము. శైలీగత మయిన సౌలభ్యము, అర్థగాంభీర్యము, యుక్తిదార్ఢ్యము, సిద్ధాంతప్రతిపాదకత్వము మొదలగు ననితరసాధారణము అయిన గుణములను గలిగి పాతంజల మహాభాష్యమునకు సాటి యగుచున్నందున దీని కిట్టి యశస్సు చేకూరి యుండవచ్చును. కాఁబట్టియే "ప్రతిగృహం కావ్యప్రకాశస్య టీకా" వెలసినది. నాఁడు కావ్యప్రకాశముఁ జదువని వారు, నద్దానికి గచ్ఛద్వ్యాఖ్యనేని వ్రాయని వారును నాలంకారిక వ్యవహారయోగ్యులే కాకుండిరన్న వేరుగ నీగ్రంథము యొక్క గుణముల నుగ్గడింప వలయునా? ఇట్టి యుద్గ్రంథ మాంధ్రీకరింపఁ బడుట సర్వథా ముదావహము. నేనెరిగి యున్నంతవరకు శ్రీశర్మగారే కావ్యప్రకాశాంధ్ర వ్యాఖ్యాతలకు మార్గదర్శకు లేమో యని కూడ భావించుచున్నాను.

దేశభాషలను సర్వతోముఖముగఁ బెంపొందింపవలయు నను శంశము, అంకురితత్వ పల్లవితత్వ కుసుమితత్వావస్థలను దాటి నేఁటికి ఫలితత్వావస్థలోఁ బడిన దన వచ్చును. దినమున కొక నూతనగ్రంథముగాఁ బెక్కురీతులలో వివిధవిషయప్రధానములగు గ్రంథములు దేశభాషలలో వెలయుచుండు టయే యిందుఁ దార్కాణము. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను నానుడికి విషయమయిన యాంధ్రము కూడ దినదినాభివృద్ధిలో వెనుకంజ వేయుచుండుట లేదు.

ఎంత జరిగినను సంస్కృతవాఙ్మయభాండాగారము లోని వెల లేని రత్నముల నేరి యలంకరించినఁ గాని యే దేశభాషాయోష కయినను సమగ్రాలంకారము సిద్ధించినట్లు కానేరదని నా తలంపు. అందును సంస్కృతముతో నతిసంబంధము కల యాంధ్రవాణీ నారీమణి విషయము వేరుగఁ జెప్పనక్కఱ లేదు కదా!

ఈదృశతాత్పర్యముల తోనే పలువురు పండితు లిప్పటికి వ్యాకరణ న్యాయాదిగ్రంథముల నల్పముగను, నలంకారగ్రంథముల నధికముగను నాంధ్రమున వెలయించిరి. కీ॥ శే॥ మహామహోపాధ్యాయ వేరి లక్ష్మీనారాయణ శాస్త్రులు గారి "ఆంధ్రీకృత న్యాయకుసుమాంజలి బ్రహ్మశ్రీ అప్పల్ల జోగన్న శాస్త్రులు గారి "కౌముదీ శరదాగమము" బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి ఆంధ్రధ్వన్యాలోకము మొదలగు గ్రంథముల నీ సందర్భమున నుదాహరింప నగును.

అలంకార గ్రంథముల నాంధ్రీకరించిన వారిలో శ్రీ మాధవరామశర్మగారికి బ్రముఖస్థానము నీయదగుననుటకు విప్రతిపత్తి యుండఁగూడదు.

ఇంకొకమాట; కావ్యనాటకాదుల విషయమున నాంధ్రీకరణ పద్ధతు లెట్లున్నను నంత బాధలేదు కాని శాస్త్ర

గ్రంథముల విషయమున మాత్రము ప్రతిపదాంధ్రీకరణ పద్ధతిని పూర్తిగా విడిచి యధ్యాపనరీతికిఁ గడు సన్నిహితమగునట్లు విపుల వ్యాఖ్యను వ్రాయుపద్ధతియే సర్వోత్తమమని, బహూపయుక్తమనియు నా యభిసంధి. ఈ పద్ధతినే శ్రీశర్మగారు కావ్యప్రకాశమున నవలంబించుట నాకుఁ జాల సంతసమును గలిగించినది.

శ్రీశర్మగారి పరిష్కృత వ్యాఖ్యాగుణములను బెద్దగ నభివర్ణింప నావశ్యకత లేదు. వానిని సహృదయు లనుభవమువలననె పూర్తిగ గ్రహింపఁ జాలుదురు. ఆక్లిష్టమైన శైలి, గూఢార్థవైశద్యము, అన్యూనానతిరిక్తత, మొదలగు గుణములను గలిగి, రసికజన మనోభిరామమై వ్యాఖ్య యొప్పుచున్నదనినఁ జాలును. ఇయ్యది కావ్యప్రకాశాధ్యేతలకు నధ్యాపకులకును దప్పక హస్తావలంబము కాఁగలదని నా దృఢవిశ్వాసము.

శ్రీ మాధవ రామ శర్మ గారి కతోఽధికముగ వివిధ సంస్కృత గ్రంథముల నాంధ్రమున వెలయించుటకు వలసిన శక్త్యుత్సాహాది సకల పరికరములను శ్రీనివాసుడు ప్రసాదించుఁగాక! యని యాశీర్వదించుచున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుడు
ప॥ వేం॥ రామానుజస్వామి
అధ్యక్షుడు
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయము.

తిరుపతి
12—3—53.

# సూచిక

౧. కవిభారతీ స్తుతి, కావ్యవిలక్షణత, బ్రహ్మసృష్టి, కవిసృష్టి, కావ్యప్రయోజనము, వేదరీతి, పురాణరీతి, కావ్యరీతి, హృదయదర్పణ భావము, తత్పరిశీలనము, కావ్యోపదేశము, కవి సహృదయులు, కావ్య కారణము, శక్తి, నిపుణత, అభ్యాసము, ప్రతిభాముఖ్యత, కావ్యలక్షణము, కావ్యభేదములు, ఉత్తమకావ్యము, మధ్యమకావ్యము, అధమకావ్యము, శబ్దచిత్రము – అర్థచిత్రము. ౧—౩౭.

౨. శబ్దార్థస్వరూపము, శబ్దవిభాగము, అర్థవిభాగము, తాత్పర్యార్థము, అభిహితాన్వయవాదిమతము, అన్వితాభిధానవాదిమతము, వాచ్యము వ్యంజకము, లక్ష్యము వ్యంజకము, వ్యంగ్యము వ్యంజకము, వాచక స్వరూపము, సంకేతితార్థభేదములు, జాత్యాదిమతము, వ్యక్తిశక్తివాదము, వ్యక్తిశక్తి ఖండనము, ఉపాధి సంకేతము, ఉపాధి విభాగము, జాతి, గుణము, క్రియ, యదృచ్ఛ, పరమాణుత్వము జాతి, జాతి మతము, తార్కికమతము, సౌగతులమతము, అభిధావ్యాపారము. ౩౮—౬౨.

లక్షణ, సంబంధపంచకము, లక్షణాభేదములు, ఉపాదాన లక్షణ, మీమాంసకమతము, మీమాంసకమతసమీక్ష, ముకులభట్టమతము, ముకుల మతవిమర్శ, లక్షణ లక్షణ, గౌణీశుద్ధాభేదములు, ముకుల మతము, తత్ఖండనము, సారోపాసాధ్యవసానికాభేదములు, సారోపము, సాధ్యవసానిక గౌణశుద్ధ సంజ్ఞలు. ౬౩–౭౬.

గౌణార్థనిర్ణయము, ప్రథమమతము, ద్వితీయమతము, మూడవపక్షము, కుమారిల భట్టమతము, సాదృశ్యేతరసంబంధములు, గౌణిలోని ప్రయోజనము, శుద్ధలోని ప్రయోజనము. ఇతర సంబంధములు, తాదర్థ్యము, స్వస్వామిభావము, అవయవావయవిభావము, తాత్కార్మ్యము. ౭౭–౮౫.

# శ్రీ మమ్మటాచార్య కృత

# కావ్యప్రకాశము

గ్రంథారంభే విఘ్నవిఘాతాయ సముచితేష్టదేవతాం గ్రంథకృత్పరామృశతి.

నియతికృతనియమరహితాం హ్లాదైకమయీమనన్యపరతంత్రాం
నవరసరుచిరాం నిర్మితిమాదధతీ భారతీ కవేర్జయతి. ౧

నియతిశక్త్యా నియతరూపా సుఖదుఃఖమోహస్వభావా పరమాణ్వాద్యుపాదానకర్మాదిసహకారికారణపరతంత్రా షడ్రసా, న చ హృద్యైవ తైః, తాదృశీ బ్రహ్మణో నిర్మితిః = నిర్మాణం. ఏతద్విలక్షణా తు కవి వాఙ్నిర్మితిః అత ఏవ జయతి. జయత్యర్థేన చ నమస్కార ఆక్షిప్యత ఇతి, తాం ప్రత్యస్మి ప్రణత ఇతి లభ్యతే.

## ఆంధ్ర వ్యాఖ్యానము

## శ్రీర్జయతు

హృదయం వ్యాప్య తిష్ఠంతీం శ్రీదేవీం భావయామ్యహం
శ్రీప్రకాశాత్మతా సిద్ధిః యయేయం సిద్ధిమేష్యతి.
ధ్యాయామ్యహమనన్యాత్మా శ్రీదేవీం స్పందరూపిణీం
కావ్యప్రకాశకలనా యయేయం సిద్ధిమేష్యతి.

భారతీయు లంతట మంగళము నాచరింతురు. అది వారల పవిత్ర సంప్రదాయము. దాని వలన విఘ్నము లన్నియు వినష్టము లగును. ప్రారంభింపదలంచిన కృతి చక్కగా పరిసమాప్తినొందును. ఇట్టి యీ మంగళము శిష్టులు గ్రంథారంభమునను జేయుదురు. ఇది పాఠకులకు బ్రరోచనా సంపాదక మగును.

మంగళాచరణ మనేక విధములు. ఈ గ్రంథమున శ్రీభారతీ దేవి ధ్యాన మొనరింపబడెను. అదే భారతీస్తుతి గ్రంథప్రారంభమున సముచితము. కానిదే ప్రతిశాస్త్ర మవతారణరూపక కదా? ఇంకను గ్రంథకర్తయిన మనము శ్రీ మమ్మటోపాధ్యాయుల భారతీదేవి మనోనుకూల, ఇష్టదేవి. కావున నా దేవతాధ్యానాత్మకస్తుతి సముచితము. పర్యాలోచనము, పరామర్శ, స్మరణము, ధ్యానము, అనుసంధానము, స్తవము పర్యాయములు.

కావ్యప్రకాశగ్రంథము కారికా - వృత్తి - ఉదాహరణాత్మకము. శ్రీమమ్మటోపాధ్యాయులవారు కారికాకర్తలు. వారే వృత్త్యుదాహరణములు కూడ యోజనము చేసి గ్రంథమునకు సుస్వరూపమును సంపాదించినారు. తాము రచించిన మూలకారికలను తామే వ్యాఖ్యానింపదలచిన మమ్మటోపాధ్యాయుల కృతి ప్రశంసనీయము.

వివక్షితార్థప్రతిపాదనము చేయు వాక్యసందర్భమునకు గ్రంథమని పేరు. ఆట్టి గ్రంథము ప్రారిప్సితము. గ్రంథారంభమున స్తుత్యర్హ యయిన వాగ్దేవిని మమ్మటులు ఇట్లు ధ్యానించుచున్నారు.

నియతికృతనియమరహితము, హ్లాదైకస్వభావము, స్వతంత్రము, నవరసమనోహరము గాను కృతిని ప్రకాశింప జేయుచున్న శ్రీభారతీదేవి సర్వాతిశాయినియై రాణించుచున్నది. అని యభిప్రాయము. మమ్మటోపాధ్యాయుడు శబ్దబ్రహ్మారాధకుడు కావుననే భారతి నిట్లు స్తుతించుచున్నాడు.

ఇచ్చట నిర్దేశింపబడిన భారతీదేవి ప్రత్యభిజ్ఞావాదు లంగీకరించు + షట్త్రింశత్తత్త్వము లందలి శివతత్త్వము. విశ్వోత్తీర్ణుడు స్వచ్ఛంద స్వభావుడు నగు శివుడు ప్రథమతత్త్వము. ఆ శివుడే శక్తిస్వభావుడు.

---

+ షట్త్రింశత్తత్త్వములు :- శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్యా, మాయా, కలా, విద్యా, రాగ, కాల, నియతి, పురుష, ప్రకృతి, బుద్ధి, అహంకార, మనః, శ్రోత్ర, త్వక్, చక్షుః, జిహ్వా, ఘ్రాణ, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, ఆకాశ, వాయు, వహ్ని, జల, భూములు.

అతడే విశ్వోత్తీర్ణుఁ డయిన యుచ్ఛూనతావస్థలో శక్తిశబ్దమున వ్యపదేశింపబడును. ఈ శక్తిశబ్ద వ్యపదేశ్యుఁడగు శివుఁడే ప్రకృతము భారతి. ఈ భారతియే కవికృతి ప్రకాశిక.

“కవయతే వర్ణయతీతి కవిః” అని కవిపద వ్యుత్పత్తి. వర్ణించువాఁడు కవి యని భావము. అతని కృతి కావ్యము. కావ్యరచనానుకూలమగు వ్యాపారమును కృతియే. అట్టి కృతిని వాగీశ్వరి ప్రకాశింప జేయుచున్న దని భావము. కవికృతికి కవియే కర్త. అయినను భారతి సంపాదకత్వము విరుద్ధము కాదు. ఘటమునకుఁ గులాలుఁడే కర్త. అయిన నీశ్వరకర్తృత్వము విరుద్ధము కాదు కదా! అట్లే ప్రకృతమునను గ్రహింపవలయును.

కవికృతిలో నియతికృతనియమము లేవియు లేవు. షట్త్రింశత్తత్త్వములలో నియతి యేకాదశ తత్త్వము. “ఇది నాది. ఇది నాది కాదు.” అను నియమమునకు హేతు వగునది నియతి యని ప్రత్యభిజ్ఞా (స్పంద) వాదుల నిశ్చయము. ఆ నియతి నియమములు భారతీప్రకాశ్యమగు కవికృతిలో నుండవు. కావున కవికృతి నియతి నియమాతీత.

ఇంక నీ కృతి హ్లాదైకమయి నిత్యమానందఘన. స్వాత్మానంద స్వరూపము నిది విడువదు. ఇది యేమాత్ర మితరాధీనము కాదు. కావుననే యనన్యపరస్వభావ. కవికృతి నవరసమధురము. స్వభావమనోహరము. కేవలము స్వభావమనోహర మగుటయే కాక నవరసములచే గూడ మనోహరము స్వభావకమనీయము. నవరసరమణీయము నగు కవికృతిని వాగ్దేవి వెలయించుచున్నది.

ఈ కారికారచనా విశేషమును బట్టి వేరొక విధమున గూడ నర్థమును భావింపవచ్చును. శ్రీ మమ్మటులు స్వేష్టసముచిత భారత్యభిన్నముగా కవిభారతి నభ్యూహించి యిట్లు నిధ్యాన మొనర్చుచున్నారు.

నియతి యొనరించు నియమములు లేనిదియు హ్లాదము మాత్రమే స్వభావముగా గలదియు నన్యపరతంత్రము కానట్టియు నవరసములచే మనోహరమగు నిర్మాణ మొనరించునదై కవిభారతి సర్వోత్కర్షముగా వెలయు చున్నది. అని సామాన్యార్థము. ఇచటి నిర్మితి పదమునకు రసాద్యభివ్యక్తి స్వభావక మగు నిర్మాణ మని యర్థము. కవిభారతి యొనరించు రసాద్యభివ్యక్తిరూప నిర్మితిలో నియతి నియమము లుండవు. ఈ పక్షమున

కావ్య. కావ్యమనే యిది కేవలము భారత్యధీనము. కావ్యరూప నిర్మితి శబ్దార్థాధీనాత్మకము. దానికి శబ్దార్థములలో నేదేని యపేక్షితము అయినను ఉపాదానకారణము సహకారికారణములు నేవియు నపేక్షితములు కానందున నిది స్వతంత్ర మనియే గ్రహింప వలయును. సుకవి కావ్యమున స్వతంత్రుడగుటచే యథేచ్ఛముగా వ్యవహరించును. అచేతన భావములను జేతనములనుగాఁ జేతనముల నచేతనములనుగా వ్యవహరించును గదా?

ఇంకను కవిభారతి నిర్మితి నవరస రుచిరము. కవినిర్మితి నిత్యనూతనము. రసయుతము సముజ్జ్వలము. ఇందు శృంగారాది నవరసములు ప్రతిపాదితము లగును. బ్రహ్మనిర్మితి తీపిమిర్యాది రసములు కలది యగును. నవరసములు కలిసి యుండునే యిది మనోహర మనియు భావము. మహారస మొక్కటియే. రసాంతర్విశేషములు తొమ్మిది. అవి శృంగారాది రూపములు. దానిచే నిది హృద్యము. కటుకాదిరసములును హృద్యములె. అవి శోకాది స్థాయికములై యయ్యును కావ్యోపనిబద్ధములై యభినీయమానములై యాస్వాద్యమానతాదశ నొంది నపుడు హృద్యములె యగుట యనుభవసాక్షికము. కానిచో ప్రేక్షకులకు ప్రవృత్తి యుదయింపదు గదా! ఇట్టి యపూర్వమధురలలితనిర్మితి సాధించు కవిభారతి "జయతి."

## కావ్య విలక్షణత

కవిభారతి యుత్కర్షి కలదని సూచిత మయినది. ఉత్కర్ష యనునది ప్రతియోగి (అన్యపదార్థము) నపేక్షించును. బ్రహ్మసృష్టి యిచట ప్రతియోగి బ్రహ్మసృష్టికన్నను గవిసృష్టి యతిశయిత మనియిచటి భావము. కవినిర్మితిలో బ్రహ్మనిర్మితి కన్న వైలక్షణ్య మున్నది. ఇది కారిక యందు సూచితమె. "నియతికృతనియమరహితాం" మొదలైనవిశేషణములు బ్రహ్మనిర్మితి విశేషణముల నర్థాక్షిప్తములను జేయుచున్నవి. అందు బ్రహ్మసృష్టియు వ్యతిరేకముఖమున సూచితమె. ఆ సూచితమునిట్లు విశదముగా గ్రహింప దగును.

## బ్రహ్మసృష్టి

బ్రహ్మనిర్మాణము నియతి శక్తిచే నియతరూపము. నియతి యొక తత్త్వము కదా? ఆ నియతియను నీశ్వరునియొక శక్తివిశేషము బ్రహ్మనిర్మాణమును నియతాకారము కలదానిగా జేయును. ఆ సృష్ట్యాకార మా శక్తిచే

"నియమ్యంతే అనయా కర్మాణి ఇతి నియతిః" అని నియతి పద వ్యుత్పత్తి. జీవిచే కర్మములు నియమితము లగునో యది నియతి యగునని భావము. కాగా పద్మత్వాదిరూప మయిన యసాధారణధర్మమే నియతి. పద్మత్వ మెచట నుండునో యచటనే సౌరభ ముండు ననునది నియతికృతనియమము. అట్టి నియమములీ నిర్మితి యందుండవు. కమనీయ కామినీ వదనమునగూడ సౌరభ ముండునని యీ నిర్మితి నిరూపించును. ఆముష్మిక స్వర్గాదిలాభము కలుగ వలయు నన్న "క్రతువ"ను నియతి కలుగ జేయు స్వర్గాదియోగ్య శరీరాంతర ముండి తీరవలయును. అది నియతినియమము. అట్టిదియు నిచట లేదు. దివ్యదేహ మక్కఱలేకుండగనే యీ దేహముననే స్వర్గప్రాప్తి కవి భారతి నిర్మితిలో నుండును. అపార కావ్యసంసారమున గవియే ప్రజాపతి. అతని కే విశ్వ మెట్లు రుచిత మగునో యది యట్లే యగును. కవి కావ్యమున శృంగారరసానుగుణ నిర్మాణ కుశలు డగునేని జగము రసమయ మగును. అతడే వీతరాగు డగునేని యంతయు నీరసమే. కావున నిది నియతి కృత నియమ రహిత మనుట సముచితమే.

ఇంక నీ నిర్మితి హ్లాదమాత్రప్రచుర మని ఫలితార్థము. కవి వర్ణించు వియోగశోకాదుల వలన గూడ నానందమె కలుగును. దుఃఖమోహాము లిందుండవు. శత్రుకృతపద్యమున గూడ సుఖమే కలుగును గాని దుఃఖ ముదయింపదు. "ఇది శత్రుపద్యము" అను ననుసంధానమున దుఃఖముద యించునేని యది శత్రుత్వమే యగును కాని కావ్యతత్త్వము కాదు. ఒక్కొకచో నర్థము తెలియమి మోహము కలుగునని కొంద రనుట యుక్తము కాదు. కావ్యము వ్యుత్పన్నబుద్ధులకును దెలియని యర్థమును బ్రతిపాదించు నది యగునో యది యకావ్యమే కాని కావ్యము కాజాలదు. వ్యుత్పన్నుల సుఖపెట్టునదె కావ్యము. కావ్యప్రతిపాదితార్థము నవ్యుత్పన్నులు గ్రహింప జాలరేని యది కావ్యదోషము కాదు. అవ్యుత్పన్నులకు గావ్యమున మోహము గలుగు ననుట యెట్టి మాట? జన్మాంధుడు కామినీ సౌందర్యమును గాంచ లేడు. అది కామినీ దోషమా? స్తనంధయుడు యువతి సౌభాగ్యము గాంచ నేరడు. అంత మాత్రమున నా యౌవనవతి కేమి హాని!

ఈ నిర్మితి యన్యపరతంత్రము కాదు. ఈ కవి భారతీ నిర్మితిలో గవి శక్తివ్యుత్పత్తు లివియే యపేక్షితములు. ఏ తదితరము లపేక్షితములు

కావు. కావుననే యిది కేవలము భారత్యధీనము. కావ్యరూప నిర్మితి శబ్దార్థోభయాత్మకము. అందు శబ్దాంశములో నేవేని యపేక్షితము లయినను నలౌకికమగు నర్థాంశములో నేవియు నపేక్షితములు కానందున నిది స్వతంత్ర యనియే గ్రహింప వలయును. సుకవి కావ్యమున స్వతంత్రుడగుటచే యథేచ్ఛముగా వ్యవహరించును. అచేతన భావములను జేతనములనుగాఁ జేతనముల నచేతనములనుగా వ్యవహరించును గదా?

ఇంకను గవిభారతీ నిర్మితి నవరస రుచిరము. కవినిర్మితి నిత్యనూతనము. రసయుతము. సముజ్జ్వలము. ఇందు శృంగారాది నవరసములు ప్రతిపాదితము లగును. కావున నిర్మితి తొమ్మిది రసములు కలది యగును. నవరసములు కలిగి యుంటనే యిది మనోహర మనియు భావము. మహారస మొక్కటియే. తదంతర్విశేషములు తొమ్మిది. అవి శృంగారాది రూపములు. దానిచే నిది హృద్యము. కరుణాదిరసములును హృద్యములె. అవి శోకాది స్థాయికములె యయినను కావ్యోపనిబద్ధములై యభినీయమానములై యాస్వాద్యమానతాదశ నొంది నపుడు హృద్యములె యగుట యనుభవసాక్షికము. కాకున్న బ్రేక్షకులకు బ్రవృత్తి యుదయింపదు గదా! ఇట్టి యపూర్వమధురలలితనిర్మితి సాధానించు కవిభారతి "జయతి."

## కావ్య విలక్షణత

కవిభారతి యుత్కర్ష కలదని సూచిత మయినది. ఉత్కర్ష యనునది ప్రతియోగి (అన్యపదార్థము) నపేక్షించును. బ్రహ్మసృష్టి యిచట ప్రతియోగి బ్రహ్మసృష్టి కన్నను గవిసృష్టి యతిశయిత మనియిచటి భావము. కవినిర్మితిలో బ్రహ్మనిర్మితి కన్న వైలక్షణ్యా మున్నది. ఇది కారిక యందు సూచితమె. "నియతికృతనియమరహితాం" మొదలైనవిశేషణములు బ్రహ్మనిర్మితి విశేషణముల నర్థాక్షిప్తములను జేయుచున్నవి. అందు బ్రహ్మసృష్టియు వ్యతిరేకముఖమున సూచితమె. ఆ సూచితమునిట్లు విశదముగా గ్రహింప దగును.

## బ్రహ్మ సృష్టి

బ్రహ్మనిర్మాణము నియతి శక్తిచే నియతరూపము. నియతి యొక తత్త్వము కదా? ఆ నియతియను నీశ్వరునియొక శక్తివిశేషము బ్రహ్మనిర్మాణమును నియతాకారము కలదానిగా జేయును. ఆ సృష్ట్యాకార మా శక్తిచే

నన్యోన్య మసంకీర్ణవ్యవహారమున వ్యవస్థాపిత మగును. బ్రహ్మసృష్టి సుఖదుఃఖమోహస్వభావము. అది సుఖాదిమయముగా నుండును. సత్త్వరజస్తమోగుణ ప్రయోజ్యము లగు చిత్తవృత్తులే సుఖదుఃఖమోహములు. సాంసారికవ్యవహార మంతయు సుఖదుఃఖమోహములందు బర్యవసించుచున్నది. ఆహ్లాదదుఃఖమోహములచే నీ సంవిన్మార్గము మూడు విధము లగునని తద్విదులసూక్తి. సుఖమాహ్లాద మొక్కటియే. సర్వభావములును త్రిగుణమయము లని సాంఖ్యవచనము.

రూపయౌవన వస్త్రాలంకారస్రక్చందనాది భూషితయయిన కామిని తా నొక్కతయే స్వకాంతుని సుఖపెట్టును. అప్పుడాతని విషయమై యామె సుఖరూప సత్త్వసంబంధము కలదగుటయే హేతువు. ఆ భామినియె సవతులను దుఃఖపెట్టును. అప్పుడా సవతుల గురించి యామె దుఃఖాత్మకరజోగుణసంబంధము కలదగుట కారణము. ఆ రమణియె యామెను బొందలేని యితరతరుణుని మోహపెట్టును. అతని విషయమై యా రమణి మోహాత్మకతమఃసంబంధ మున్నదగుట నిమిత్తము.

ఇట్లు విశ్వ మంతయు సుఖాదిమయము. బ్రహ్మనిర్మితి లోని లౌకిక పదార్థము లన్నియు నీదృశములు. బ్రహ్మనిర్మితి యందు సుఖదుఃఖమోహము లుత్పన్నము లగుననియు నేతదర్థము.

బ్రహ్మసృష్టి కారణపరతంత్రము. కారణము త్రివిధము. సమవాయి (ఉపాదాన) కారణము, అసమవాయి కారణము, నిమిత్తకారణము నని. ఘటమున మృత్పరమాణువులు సమవాయికారణము. స్పందరూపమయిన పరమాణుక్రియ యసమవాయి కారణము. ఈ క్రియ యయిదు విధములు. ఉత్క్షేపణ — అవక్షేపణ — ఆకుంచన — ప్రసారణ — గమనము లను విధములు. దండచక్రకులాలాదులు నీశ్వరేచ్ఛాదిక్కాలాదులు ఘటమున నిమిత్తకారణము. ఈ కారణత్రయమును బ్రధానకారణాప్రధానకారణరూపమున విభాగించుటయు గలదు. అప్రధానకారణమును సహకారికారణ మనియు నందురు. సమవాయికారణము ప్రధానకారణము. అసమవాయి నిమిత్తము లప్రధాన కారణములు. కాఁగా బ్రహ్మసృష్టి పరమాణ్వాద్యుపాదానకారణాధీనము. స్పందరూప మగు కర్మాదిసహకారికారణ పరతంత్రము నగుచున్నది. కొందరిట్లందురు. నిమిత్తకారణమె ప్రధానకారణము. ఉపాదానాసమవాయి కారణము లప్రధానము లని.

ఇంకను బ్రహ్మకృతి షడ్రసము. అందుమధురామ్లలవణకటుకషాయ తిక్తము లను నారు రసములు మాత్రమే కలవు. వానిచే నా సృష్టి మనో రమమే యనజాలము. కట్వాదులందరకును హృద్యములే యగునా? మధు రాదిరసములు పరస్పరము విలక్షణములు. ఒక్కొకడొక్కొక రసము నభిలషించును. మధురమయినది యందరకు హృద్యము కాదు. సన్నిపాత రోగి కది చేదు. ఇట్లే యన్యములు. భోక్తల యభిలాష భిన్నభిన్నము. తదనుసారమున తత్తద్రసములందు మానవులు ప్రవర్తింతురు. బ్రహ్మసృష్టి యంతయు నిట్లే యుండును.

## కవిసృష్టి

కవివాఙ్నిర్మితియో; యేతద్విలక్షణము. కవియే బ్రహ్మ. కవి వాక్సృష్టి బ్రహ్మసృష్టికన్న నధికము. కవియు బ్రహ్మకన్న నధికుడు. కవి వాఙ్నిర్మితి విసదృశము. విశిష్టలక్షణము. చారుస్వరూపము. వాఙ్ని ర్మితి యనుట కవి వాచారూపమగు నిర్మితి యని యాపాతార్థము. వాక్పద మునకు మూడర్థము లున్నవి. "వక్తీతి వాక్" ఉచ్యతే ఇతి వాక్ ఉచ్యతే అనయా ఇతి వాక్ అని వాక్పదవ్యుత్పత్తి త్రివిధముగ భావనీయము. కాగా శబ్దము అర్థము వ్యాపారము అను మూడును సంగృహీతము లగును.

శబ్దార్థవ్యాపారాత్మకమగు కవినిర్మితి బ్రహ్మనిర్మితి కన్న విలక్షణ స్వభావక మనుట "నియతికృత నియమరహితాం" అను మూలకారిక యందె సూచితము. నిరూపితమును. కవివాఙ్నిర్మితి కే నియమమును లేదు. ఏతదీయసృష్టి నియతినియంత్రణాతిక్రాంతము. జలముననే కమల ముండు నని నియతినియమము. తరుణియందును గమలములు కలవని కవినిర్మితి. ఈ దృశములలో ననియమసహస్రమే గోచర మగుచున్నది గదా! వాఙ్ని ర్మితి దుఃఖమోహాత్మకము కాదు. సుఖైకస్వభావము. అలౌకిక సుఖప్రకాశ ఘనము. ఇందన్యపారతంత్ర్యము లేదు. ఇది పరతంత్రవార్తానభిజ్ఞము. ప్రతిభామాత్రప్రవృత్తము. ఇందు రసములారే కాదు. శృంగారాది నవరస ములతో నిది నిరంతరము. ఈ రసనవకములో నేదియు నరుచిరము కాదు. బీభత్సరసము నమృతాయమానమె యగును. కావ్యపదార్థము సర్వమా నందహేతు వగుట కవి సృష్టి యలౌకిక వివిధరసవైచిత్ర్యచారు చమత్కా రము కల దగుచున్నది. ఇట్లు కవి నిర్మితి బ్రహ్మనిర్మితి కన్న విలక్షణ

వైలక్షణ్య మున్నదని యిట్లు దర్శిత మయినది సాహిత్యము సర్వదర్శన పార్షద మనియు సర్వోత్తీర్ణ మనియు నిచటద్యోతితము.

ఈ యాదిమసూత్ర మందే మమ్మటులు ప్రతిపాదింప దలచిన వస్తురూపము అలంకారరూపము రసరూపము నగు త్రిస్కంధక మయిన యర్థము ప్రతీయమాన మగుచున్నది. జయత్యర్థమున నమస్కారలక్షణ మగు వస్తు వ్యంగ్యము. బ్రహ్మనిర్మితి కన్న కవినిర్మితి కాధిక్యము కలదని సూచితము. కవిభారతికి సూచితము లయిన నాలుగు విశేషణములు. స్వరూప-ప్రయోజన-కారణ-విశేష ములను బ్రతిపాదించుచున్నది. ఈ విశేషణచతుష్టయమున నాధిక్య మున్నది గదా! బ్రహ్మనిర్మితి సూత్రమున శబ్దోపాత్తము కాదు. కావున వ్యతిరేకాలంకారము వ్యంగ్యము. భారతీవిషయక కవినిష్ఠ రతి ధ్వన్యమానము కావున రతిభావము వ్యంగ్యము. విదగ్ధులు వ్యంగ్యముననే వ్యవహరింతురు గదా! రతిభావ మసంలక్ష్యక్రమ వ్యంగ్యము వస్త్వలంకారములు లక్ష్యక్రమవ్యంగ్యములు కవిభారతీస్తుతిచే సామాన్యముగా గావ్య మభిధేయ మనియు ధ్వనితము.

గ్రంథమున నభిధేయము సంబంధము ప్రయోజనము అధికారి యను ననుబంధచతుష్టయకథనము యుక్తము. దోషపరిహారమున సగుణము సాలంకారము నగు కావ్య మభిధేయము. ఈ ప్రకరణశాస్త్ర మభిధాన మగుట నిందు గావ్య మభిధేయ మగుట నీ రెండిటికి నభిధానాభిధేయభావము సంబంధము. కావ్యఫలార్థి యధికారి. ఈ త్రితయము ప్రసిద్ధము. సర్వాకార స్వీకార్య మగు ప్రయోజనము నిక జెప్పవలసి యున్నది. "ప్రయోజనమనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే" యని గదా! న్యాయము. ప్రయోజనమును ప్రతిపాదింపకున్న "ఇది నా కిష్టసాధనము" అను జ్ఞాన ముదయింపదు. అది లేకున్న బ్రేక్షావత్ప్రవృత్తి యుండదు. వివరణీయ కావ్యము సప్రయోజన మైననే తద్విచారకాలంకారశాస్త్రమున జనుఁడు ప్రవర్తించును. కావున నీ యలంకారశాస్త్రమున ధ్వనిగుణీభూత చిత్రాత్మక మగు త్రివిధకావ్యము ప్రయోజనసహిత మని మమ్మటులు ద్వితీయసూత్రమునఁ జెప్పుచున్నారు. ఇందిటుపై నిరూపింప బడునది యంతయు నభిధేయము. అదియు సప్రయోజనమె. కావ్యము ప్రధానము అంగి. కావ్యప్రకాశగ్రంథ రూపమగు నిది యప్రధానము. అంగము. అంగమునకు స్వతంత్రఫలము

లేదు. ప్రధానఫలమే యశఃఫలము. కాఁగా నీగ్రంథమును సఫలమని తెలిపెను. ఆ యంశమే యిందు నిరూపిత మగును.

★ ఇహాభిధేయం సప్రయోజనమిత్యాహ.

కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే. ౨

కాళిదాసాదీనామివ యశః శ్రీహర్షాదేర్ధావకాదీనామివ ధనం, రాజాదిగతోచితాచార పరిజ్ఞానం, ఆదిత్యాదేర్మయూరాదీనామివానర్థనివారణం, సకల ప్రయోజన మౌలిభూతం సమనన్తరమేవ రసాస్వాదనసముద్భూతం విగలిత వేద్యాంతరమానందం ప్రభుసమ్మితశబ్దప్రధానవేదాది శాస్త్రేభ్యః సుహృత్సమ్మితార్థ తాత్పర్యవత్పురాణేతిహాసేభ్యశ్చ. శబ్దార్థయోర్గుణభావేన రసాంగభూత వ్యాపారప్రవణతయా విలక్షణం యత్కావ్యం లోకోత్తరవర్ణనానిపుణకవికర్మ తత్కాన్తేవ సరసతాపాదనేన అభిముఖీకృత్య, "రామాదివద్వర్తితవ్యంన రావణాదివత్" ఇత్యుపదేశం చ యథాయోగం కవేః సహృదయస్య చ కరోతీతి సర్వథా తత్ర యతనీయం.

కావ్యకారణము కావ్యస్వరూపము కావ్యవిశేషము చెప్పిన పిమ్మట ఫలమును జెప్పుట సముచితము. కాని దాని ముందుగా జెప్పుట పాత్రకాన్ముఖ్యమున కని తెలియునది. మొదటగా ఫలము తెలిసినచో దదుత్సుకులై కావ్యకారణాదిజ్ఞానమున నుత్సాహపడుదురు. కాకున్న "దీని ఫలమేమో?" యని సందిహానులై శ్రోతలు మొదట గారణాదికమున నుత్సుకంపడరు. కావున బ్రయోజనాభిధానము సముచితము.

కావ్యము ప్రయోజనము రెండిటికిని గార్యకారణభావము సంబంధము. వక్త వ్యుత్పాదకుడు. శ్రోత వ్యుత్పాద్యుడు. కావ్యస్వరూపపరిజ్ఞానమున గావ్యస్వరూపలాభము కలుగును. ఇఁక నిటుపైఁ జెప్పఁబడఁబోవు యశఃప్రభృతులు కావ్యప్రయోజనములు. ఆ ప్రయోజన సిద్ధ్యనంతర మపేక్ష యుండదని యింక బ్రయోజనాంతరము లేదు. ఈ కారికలో బ్రయోజనములని ట్లు తెలియునది.

కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే. ౨

ఈ కారికలో "అర్థకృతే వ్యవహారవిదే, ఉపదేశయుజే" అను నవి "క్విప్" ప్రత్యయాంతములు. ఇవి తాదర్థ్యమున నున్న చతుర్థీవిభక్తులు. ఇవి భావార్థమును బోధించును. "కృదభిహితో భావః ద్రవ్యవత్ ప్రకాశతే" యని న్యాయము. కాఁగా నీ యర్థము కలుగును. కావ్యము యశః ప్రఖ్యాపనమునకును, ధనకరణమునకును, వ్యవహారవేదనమునకును శివేతర నాశనమునకును (శివము కల్యాణము తదితర మకళ్యాణము అమంగళము) శ్రవణసమనంతరమె పరనిర్వృతికిని, కాంతాసమ్మిత మగుట నుపదేశ యోగమునకును (యుక్తోపదేశము) సమర్థమగును. "కృతే విదే యుజే" అను నవి భావార్థక క్విబంతము లనువారి యభిప్రాయమునుబట్టి పై విధమున నర్థమును దెలియదగును.

కాని యిట్లని పాదపూర్ణమాత్ర ప్రయోజనములె యనుట యుత్తాన బుద్ధినే సూచించును. అది యంతగా యుక్తమని తోఁచదు. సహృదయుఁ డైన మమ్మటుడు!

కావ్యం యశసేఽర్థాయ వ్యవహారాయ కుశలేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశాయ

అని కాని;

కావ్యం హి యశసేఽర్థాయ శివేతరనివృత్తయే
కాంతావదుపదేశాయ పరనిర్వృతయే క్షణాత్

అని కాని పలుకుటకు బ్రగల్భింపడు గదా! అర్థమును సంపాదించుటకు వ్యవహారమును దెలిసికొనుటకు నుపదేశమును యోజనము చేయుటకు సమర్థ మగునది కావ్యమె యని యర్థమును జెప్పికొనుట యుక్తము. కాఁగా గావ్యమునకు గరణీయ జ్ఞాపనీయాద్యనేకార్థక్రియా సామర్థ్యము కలదని సమర్థిత మగును. కావున నెట్లెట్లో యర్థమును జెప్పి కోమలహృదయ కవిజన కదర్థనము చేయుట పాడి గాదు.

క్రియాదిసంబంధమున స్వారస్యమును నిరూపించుటకై యీ కారికను విపులముగా వ్యాఖ్యానించుట యవసరము. కావ్యము వలన యశః ప్రభృతి ప్రయోజనములు కలుగునని యిం దుక్తమయినది. వానిని దృష్టాంతమున నుపపాదించుట యుక్తము.

"యశసే" కావ్యము కాళిదాసాదులకు వలె యశము నాపాదించును. కాళిదాసుని వంశాదికము తెలియదు. అతని దానాదిక మయిన నేమియు ప్రసిద్ధము కాదు. అతని కీర్తి దేశ దేశాంతర, ఖండ ఖండాంతర శేయమాన మహాయశస్సు కలుగుటలో గావ్యమె హేతువు. వాల్మీకి వ్యాసాదులకు వలె యశము కలుగుట యనునది యిట వక్తవ్యమే. అయిన నదివ్యప్రకృతుల నుద్దేశించి యిట్లు నిరుక్తమయినది. దివ్యాదివ్య ప్రకృతు లయిన వాల్మీకి వ్యాసుల యశమున గావ్యమె హేతువు కాదు. ఇతరములు నచట యశః కారణములు. అదివ్యులగు కాళిదాసాదుల కన్ననో కావ్యమే యశోహేతువు. కాళిదాసాదు లనుట భవభూతి దండి ప్రభృతులంగూడ గ్రహింప వలెను.

"అర్థకృతే" కావ్యము శ్రీహర్షాదుల వలన ధావకాదులకు వలె ధనమును సంపాదించును. శ్రీహర్షుని పేర రత్నావళి నాటికను రచించి ధావకు డను కవి భూరిధనమును బొందెనని ప్రసిద్ధి. వేరొకరు వేరొకరీతి జెప్పెదరు. ధావకుడను నొక పండితుడు కలడు. అతడు మొదట పరమ దరిద్రుడు. చింతామణి మంత్రోపాసకుడై విచిత్రవిద్యాశాలి యైనాడు. అయినను నిర్ధనతను క్లేశపడుచు నూరు సర్గలు కల నైషధీయ చరిత మను విచిత్రమహాకావ్యమును రచించి గుణజ్ఞ శిరోమణి యగు శ్రీహర్షవర్ధనునకు జూపించినాడు. రాజత్యంతము సంతుష్టుడై యొక్కొడు రాబడి కల భూమి నిచ్చి యా కావ్యమును దనపేర బెట్టించుకొనినాడు. ఇట్లు ధావకునకు ధనము పలబ్ధ మయినది. ఇట్లె యితరులకును.

"వ్యవహారవిదే" రాజాదిగతోచితాచార పరిజ్ఞానమును గావ్యమున లభించును. వర్ణాశ్రమరక్షణము పృథివీపాలనము మొదలగు రాజుల యుచితాచారపరిజ్ఞానము కావ్యమున గలుగును. వారి వారి యుచితాచార పరిజ్ఞానమె దీన గలుగును. అనుచితాచారములో? వ్యావృత్తములె యగును. ఔచిత్యాత్మక మగు వస్తువు ప్రమాణకక్ష్యా నిక్షిప్త మగుటయె కావ్య

వ్యవహారమునకు సర్వస్వముకదా! కావుననే యిది పురుషార్థ వ్యుత్పత్తిని ఫలించునది కాగలదు. రాజాదుల ప్రజాపీడనాద్యనుచిత వ్యవహారమును దీన గ్రహింపనగునని తెలియవచ్చును. ఇందలి యీ యౌచిత్యము రస గోచర మగునదియె యని నిశ్చయము.

"శివేతరక్షతయే" గ్రంథము మొదట నశివము నుచ్చరించుట సముచితముగ నుండదని మమ్మటు లశివమునె చెప్పుటకు శివేతరపదము నుపయోగించుట సముచితముగా నున్నది. మయూరాదికవుల కాదిత్యాదుల వలన ననర్థనివారణము కలిగినది. అనర్థమన బాపము తత్ఫలమును ఇదియు (అనర్థనివారణము) కావ్యఫలము. మయూరుడను కవి కుష్ఠరోగ బాధితుడు. అతడు చెట్టునెక్కి చిటారు కొమ్మకు నూరు త్రాళ్ళు గల యుట్టి గట్టి యందుపవిష్టుడై "సూర్యప్రసాదమునఁ గుష్ఠము పోవలయును లేకున్న బ్రాణముల ద్యజించెద" నని పట్టు పట్టి సూర్యస్తవ మొనరించెను. ఒక్కొక శ్లోకమున స్తవము చేయుట యుట్టికి గల యొక్కొక త్రాడును దెగ గోయుటగా నొకటి తక్కువ శతరజ్జువుల నాతడు ఛేదించెను. తుదకు మయూరకావ్యపరితుష్టుడయిన సూర్యదేవుడు మయూరదేహమును నీరోగముగా రమణీయముగా నొనరించె నని యాభాణకము. ఇట్లాతని కశివక్షతి కలిగినది.

మఱియు నొకటి. శివాది క్షిత్యంతము ముప్పదియారు తత్త్వము లిది వరలో సూచితము లయినవి. శివుడాదితత్త్వము. తదితరములు ముప్పది యైదును శివేతరములు. ఆ శివేతరము లన్నియు క్షయించి పోవుటయు గావ్యసంపాద్యము. శివేతరముల వలననే యనర్థము కలుగును. శివేతరములే పోయిన ననర్థము లేదు. అపుడు మహార్థమె. శివభావమె మహార్థము. అదియు గావ్యనిష్పాద్యము. ఈ యర్థమును గూడ నిచట సాహిత్యదార్శనికులు భావింతురు.

"సద్యః పరనిర్వృతయే" ఉద్దేశక్రమమున మిగిలిన పార్యంతిక మగు నీ ప్రయోజనయుగళమునకు బ్రాధాన్యము కలదని ప్రఖ్యాపితమగుచున్నది. అందును తత్త్వచింతలో నానందమునకు బ్రాధాన్య మున్నది. యశఃప్రభృతుల వలన గూడ గవికి బ్రీతియే యుత్పాద్యము కాకున్న వ్యుత్పాదకము లగు వేదపురాణముల కన్న కాంతా సమ్మితకావ్యమున విశేషమేమి కలదు?

ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ
కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్యనిషేవణం

అని చెప్పఁబడెను కదా! సకలప్రయోజన మౌళిభూతము కావ్యశ్రవణ సమనంతరమునన రసాస్వాదన నిష్పన్నము విగళిత వేద్యాంతరమునగు నానందమును గావ్యలభ్యము. కావ్యమున గలుగు యశము మొదలుగాఁగల సకల ప్రయోజనము లందును నియ్యది ప్రధానము. ఇది నిర్వృతి రూపము. కనుకనె మౌళిభూత మయినది. యశః ప్రభృతులె తదంగములు. కావ్యశ్రవణ సమనంతరముననె యిది కలుగును. యాగాములకు వలె దేహాంతర మక్కఱ లేదు. రసాలము నెక్కుట ఫలమును బొందుటలలో నున్న కాల విలంబనము కూడ నిచట లేదు. ఇందు దేహాంతరము కాలాంతరము లేక పోవుటలో నీ యానందము రసాస్వాదన సముద్భూత మగుటయె హేతువు. "రస్యతే ఆస్వాద్యతే ఇతి రసః" అని రసపద వ్యుత్పత్తి. కాఁగా రస పదము రత్యాది స్థాయిభావ పరము. విభావానుభావ వ్యభిచారుల సంయోజనమెతదాస్వాదనము. ఇట్టి తదాస్వాదనమున నానందము నిష్పన్నమగును. విభావాదులు నాస్వాదగోచరము లగును. కాని ప్రధానమగుట స్థాయికె యుట నుపాత్తము. ఆస్వాదమన ముహుర్ముహుర్విభావన మని భావము. కావ్యానందము నిరుపాధికేచ్ఛావిషయము. సుఖస్వరూపము. స్వప్రకాశజ్ఞానరూపము. అనియు దాత్పర్యము. రసము స్వప్రకాశానంద స్వరూపమగుట చతుర్థోల్లాసమున విస్పష్ట మగును.

ఇందు శబ్దార్థవ్యాసంగమున విలంబ ముండదు. రసాస్వాద సమయమున వేద్యాంతర మేమియు నుండదు. స్వాతిరిక్త మగు విషయాంతర మంతయు విగలిత మగును. జీర్ణపర్ణములు రాలిపోవునట్లు వేద్యాంతరము లనబడు నితర ప్రమేయభాగము లన్నియు పరిత్రుటితము లగును. ఘట విజ్ఞానము కలిగినపుడు ఘటము విషయము జ్ఞానము విషయి. ఇందు జ్ఞానాత్మకమగు నానందమె విషయము విషయి నగును. లౌకికసుఖము నందు వేద్యాంతరము ప్రకాశింపక పోదు. కావుననె లౌకికమున విషయ విషయి కృత మగు ద్వైతము కలదు. ఇందిట్టి ద్వైతము లేదు. ఇందానందము వినా యన్యానుభవ ముండదు. అందుచే నిందు ద్వైతము లేని యద్వైత మున్నది.

"కాంతా సమ్మితతయోపదేశయుజే" కాంతా సమ్మిత మగు కావ్యము ధర్మాద్యుపదేశ లక్షణ ప్రయోజనమును సంపాదించునని చెప్పబడినది. కావ్యము కాంతాసమ్మిత మనుట కాంతాసదృశ మని భావము. కాఁగా కాంతవలె కావ్యము కాంతము. కాంతకావ్యము కాంతవలె నుపదేశదాయకముఁ గగును. ఉపదేశమునకు నీతిశాస్త్రములు కలవు గదా! కావ్యమేల! అను శంకానిరాసమున కీ యర్థమును భావింప వలయును. ఉపదేశహేతువగు వాఙ్మయము సంక్షేపముగా మూఁడు విధములు ప్రభుసమ్మితము. సుహృత్సమ్మితము. కాంతాసమ్మితము నని వీని స్వరూపతత్త్వము లిట్లై యుండునది.

## వేదరీతి

వేదాదిశాస్త్రములు ప్రభుసమ్మితములు. ప్రభువన ప్రభునాదేశ మని యర్థము. వేదాదులు రాజాదేశసదృశములని భావము. వేదాదులు శాసించుటను బట్టి శాస్త్రము లగుచున్నవి. రాజువలె వేదము శాసించును. కాన శబ్దప్రధానము. ప్రభువు "నీవిట్లుచేయుము" అని యాజ్ఞాపించును. ఇష్టసాధనమందు అనిష్టసాధనమందు నిష్ఫలమందును రాజు భృత్యుని నియమించుట గలదు. భృత్యు డిష్ట మున్నను లే కున్నను అట్లు ప్రవర్తించి తీర వలయును. కాకున్న శిక్షణము తప్పదు. అట్లె వేదమును. వేద మిష్టసాధనము లయిన జ్యోతిష్టోమాదులను విధించును. అనిష్టసాధనము లయిన శ్యేనయాగాదుల విధించును. నిష్ఫలము లయిన సంధ్యావందనాదులందును నియమించును. సంధ్యావందన మొనరింపకున్న ప్రత్యవాయ మున్నది. ఒనరించిన ప్రత్యవాయము పోవుటయె ఫలము. అంత కతిరిక్తముగా నచట ఫలము లేదు. ఇట్లు రాజాదేశము శబ్దప్రధాన మయిన విధమున వేదమును శబ్దప్రధానము. వేదశబ్దము పరివృత్త్యసహము. అందుమార్పేమియు రారాదు. "అగ్నిమీళే" యనుచోట నర్థము కుదురును గదా! యని "వహ్నిం స్తౌమి" యనరాదు. వేదమున నానుపూర్వియు (వరుస) వివక్షితము. అట్టి వరుస పాఠముననె యది ఫలజనకము. "ఈళె అగ్నిం" అని క్రమమును మార్ప రాదు. విధి విధిరూప శబ్దబలముననె వేదము ప్రవర్తకము. తదనుసారముననె ఫలరూపార్థము లభించును. అంతియ కాని ఫలవశమున వేదము నన్యథింపరాదు. వేదముపదేశించు విధిని "అక్షరశః" పాలించుటయె ధర్మము. తదాజ్ఞా

తాత్పర్యాలోచనమున నెవనికి నధికారము లేదు. అధ్యయన మాత్రముననె వేద మభ్యుదయనిశ్శ్రేయసప్రదము కదా! వేదపాఠమున స్ఖలన ముండ రాదు. వేదపాఠస్ఖలన మసదస్యత్వము చెప్పును. దాన ప్రత్యవాయలక్షణా మంగళ మున్నదని యార్యోక్తి. కాఁగా శబ్దార్థయుగళ మేళనమున శాబ్ద భాగముననె వేదములకు ప్రాధాన్య మున్నది. కాని యర్థభాగమున లేదు. “వేదాదిశాస్త్రములు” అను నాదిపదమున మానవధర్మ చికిత్సాదులును గ్రాహ్యములు.

## పురాణరీతి

పురాణాదులు ఇతిహాసములును, సుహృత్సమ్మితములు. సుహృన్మిత్రశబ్దములు పర్యాయములు “సుహృత్” అన సుహృదాదేశ మని యర్థము. పురాణేతిహాసములు సుహృదుపదేశ సదృశము లని భావము. ఆది పదమున నుపపురాణములును గ్రాహ్యములు. పురాణాదులు వేదము వలె గర్మవిశేషమున బ్రవర్తింప జేయవు. “ఇట్లుచేసిన నిది కలుగును. ఇట్లొనరించిన నిది కలుగు”నని వస్తుతత్త్వమును మాత్రమె మిత్రము బోధించును గదా! అట్లే పురాణాదులు “ఇట్లు చేసిన నీ యిష్టము కలుగును. ఇట్లు చేసిన అనిష్టము ఘటిల్లును.” అనియే తావదుపదేశమాత్రమును బోధించి విరమించును. ఇట్లు దీని యర్థమును బర్యాలోచన చేసిన పిమ్మట అందలి యుపదేశమును గ్రహించుట యందు గాని త్యజించుట యందు గాని యందరకు నధికారము కలదు. సుహృదుపదేశము పురాణము ఈ రెండిటి యందర్థమె గ్రాహ్యము. పురాణము అర్థవాదానుప్రాణనము కలిగి యుండును గావున నవి యార్థమగు నంశము నందె ప్రాధాన్యము కల వగును. కాని శబ్దాంశమున ప్రాధాన్యము కలవి కావు. ఇందు శబ్దములు పరివృత్తిసహములు కాకపోవుట లేదు. కావుననే యందర్థతాత్పర్యవత్త్వము నభ్యూహింప వలయును. ఇంకను సుహృత్పురాణములు వాచ్యార్థమాత్ర పరములె యనియు గ్రాహ్యము. ఇవి సిద్ధార్థరూపములె కదా! విధేయార్థరూపత సుహృత్పురాణములందు నదృష్టము.

## కావ్యరీతి

వేదపురాణము లిట్లు ప్రభుసుహృత్సమ్మితములు. కావ్య మీ రెండిటి కన్నను విలక్షణము. ఏల? కావ్యోపదేశము కాంతాసమ్మితము కదా!

కాంతయునఁ గాంతోపదేశమని గ్రాహ్యము. కమనీయ కామిని తన దయితుడు కుమిత్రాద్యర్థీను డయినను కటాక్ష భుజాక్షేప మందగమన విలాస విభ్రమాది సరస వ్యాపారములచే స్వాభిముఖు డగునట్లు చేసి తన యుపదేశమును గ్రహించు నట్లొనరించును. స్వవ్యాపారమున బ్రవర్తింప జేయును. అట్టి కావ్యమును. కావ్యమున శబ్దమప్రధానమగును. వాచ్య లక్ష్యాత్మక మగు నర్థమును గుణభావము పొందును. ఇట్లు కావ్య మనుభయ ప్రధానము. ఇది రసాంగభూత వ్యాపార ప్రవణ మగుటయె శబ్దార్థగుణ భావమున హేతువు. కావ్యమునందు శృంగారాదిరసోపాయభూత మగు నొక వ్యాపారము కలదు. అది వ్యంజనాకార మగుశక్తి. తత్ప్రవణత్వము శబ్దార్థములకు గలదు.

రసాద్యర్థము స్వప్నముననను వాచ్యము కాదు. రసములు వ్యంగ్యత్వ మాత్ర స్వభావములె ఈ వ్యంజన రసములకు పరిజర్వారూపమున నుండును. వేదము శబ్దార్థపరము. పురాణము లక్ష్యార్థపరము. కావ్యము వ్యంగ్యరూప రసాద్యర్థపరము. అగుట వ్యంజనాశక్తియే రసాంగభూతవ్యాపారము. విభావానుభావవ్యభిచారి భావముల సంయోజనమె రసాంగవ్యాపార మనియు గొందరి భావము. కావున గావ్యము విలక్షణము. చారుస్వరూపము. సుందరవస్తూపవర్ణనమున గావ్యము సరసత నుత్పాదించును. ఉపదేశ్యు నభిముఖీకరించు కొనును. ప్రాణవల్లభాప్రఖ్యమగుట మృదు లలిత సరస హృదయంగమ పద్ధతి నుపదేశించును. శబ్దార్థముల నుపసర్జనీకరించును. ఈ యర్థమునే భట్టనాయకుడు తనహృదయదర్పణమున స్పష్టము చేసివాడట! తద్భావమిది.

### హృదయదర్పణభావము

వేదాది శాస్త్రము శబ్దప్రాధాన్యము ననుసరించి యుండును. అర్థ ప్రాధాన్యయోగమున బురాణము స్వరూపలాభము పొందును. శబ్దార్థముల యప్రాధాన్యమున వ్యాపార ప్రాధాన్యముననను కావ్యశ్రీ (సాహిత్యశ్రీ) యాత్మలాభము గాంచుచున్నది. అని

### తత్పరిశీలనము

ఈ విషయము నిచట గ్రహింప వలయును. కావ్యమున వ్యంజన వ్యాపారము విశ్రాంతిధామము కాదు. అందు వాక్యార్థత్వము లేదు.

వ్యంజనవ్యాపారవిషయ మయిన రసాది ముఖముననె వ్యంజన స్వాత్మ లాభము కలదగుచున్నది. రసాది ప్రాధాన్యము ననుసరించియె వ్యంజన ప్రధాన మగుచున్నది. కావున స్వరూపమున నిది విచారక్షమమె కాదు. కావ్యశ్రీ యందు వ్యంగ్యమునకే ప్రాధాన్య మున్నది. కాని వ్యాపారమునకు ప్రాధాన్యము లేదని స్పష్టము. వ్యాపారప్రాధాన్య ముండుననుట భట్టనాయకమతము. వ్యంగ్యమె ప్రధాన మనుట యిచటి మతము * శబ్దార్థములు వ్యంజనాస్వరూప నిష్పాదకములు కావు. వ్యంజనాఫల మగు రసాది వ్యక్తి నివి సంపాదించును. కాఁగా శబ్దార్థములు రెండును గుణములె, (అప్రధానములు) యగుట రసమె కావ్యమున ముఖ్యము. ఇట్టి యిది కాంతాసమ్మితమై యుపదేశ మిచ్చును.

ఇట్టి యీ కావ్యము సామాన్య కవిసాధ్యము కాదు. కావ్యము లోకోత్తర వర్ణనా నిపుణ కవి కర్మ. అన్యలోక విలక్షణ వర్ణనమున నిపుణు డగు కవియె దీని రచింపఁగలఁడు. ముఖాదులను కమలత్వాది రూపమున గవి చెప్పును. అట్టి యాతని వర్ణన చమత్కార బోధజనిక. అందాతడు నిపుణుఁడు. అట్టి యాతని యసాధారణ వర్ణనాత్మక కర్మయె కావ్యము. కవి యిందు మందానిలాదిభావముల వర్ణించును గదా! వర్ణనమున శిల్పశాలిని యగు భణితి. అది లోకస్వభావాతిలంఘిని యగును. కవి యందు వ్యుత్పన్నుఁడు. పెద్దలనిరి కదా!

ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా
తదనుప్రాణనా జీవద్వర్ణనా నిపుణః కవిః.

అని "కాతి శబ్దాయతే విమృశతి రసస్వభావాదికమితి కవిః." "తస్య కర్మ కావ్యం" అని వ్యుత్పత్తి. కావ్య మిట్టిది. సాధారణ వర్ణన

---

* కావ్యము విలక్షణ మగుటలో రెండు హేతువులు. శబ్దార్థములు గుణభావమున నుండుట యొకటి. కావ్యము రసాంగభూత వ్యాపార ప్రవణ మగుట వేరొకటి. ఇట్లన్వయమంగీకరించిన వ్యాపార ప్రాధాన్యము కావ్యమునకు జెప్పినట్లగును. అయిన నీ యభ్యుపగమము వ్యాపార్య ప్రాధాన్యముననె పర్యవసానము పొందును. వ్యాపారము రసాంగ మయినపుడు వ్యాపార్యమగు రసమె సర్వప్రధాన మగును.

మునో! ప్రాకృత జనులను జేయుదురు. చమత్కార ముత్పాదించు వర్ణన మొనర్చుటకు కవియె సమర్థుడు. ఈ దృశ కావ్యము కాంతవలె నుపదేశము. కావ్య ముపదేశ్యజనుని సరసతాపాదనమున నభిముఖుని చేయును. సారస్యాకార మగు చమత్కారార్పణమున నాభిముఖ్య మిచ్చును. కావ్యము తాను ప్రతిపాదించు నర్థబోధలో భావుకుని అనుకూల యత్నాశ్రయునిగా జేయును. నిరూప్యమాణము కన్న నతిరిక్త వస్తువాసనా వ్యుదాస పూర్వకముగా రసచర్వణమున మాత్రమె యనుప్రాణనము సంపాదించును.

## కావ్యోపదేశము

రామాయణము రఘువంశము మొదలయిన కావ్యముల నేకవాక్యతకు దెచ్చుకొని నిష్కర్షించి యవధారించితి మేని "రామాదుల వలె నాచరింప వలయును. రావణాదుల వలె నాచరింప రాదు." అను నర్థము బహూపపత్తిసిద్ధమై సర్వప్రకారాభిరామముగా లభ్యమగును. కర్తవ్యాకర్తవ్య జ్ఞాన మిచట నుపదేశము. "రామాదులవలె రావణాదులవలె" యనుట సముచితార్థసూచకము. ఇది కావ్యోపదేశము. కావ్య మిట్లుపదేశించుటయు కాదు. యశఃప్రభృతి ఫలములం గూడ నందించును. ఇక్షుభక్షణమున వేతనవిత్తము లాభించినట్లు కావ్యశ్రవణమున వ్యుత్పత్తియు లాభించును. ఉపాయక్రమమున బ్రవర్తించు సాధకునకు సిద్ధి కలుగును. అనుపాయద్వారమున నుండు వానికి వినాశము కలుగును. నాయక ప్రతినాయక ముఖమున నర్థానర్థవ్యుత్పత్తి యున్నది కదా! చేదుమందు వలె శాస్త్ర మవిద్యావ్యాధిని నశింప జేయును. అమృతము వలె గావ్య మవివేక గదాపహారక మని పెద్దల సూక్తి.

> కటుకౌషధవచ్ఛాస్త్రమవిద్యావ్యాధినాశకం
> ఆహ్లాద్యమృతవత్కావ్య మవివేకగదాపహం

రాజకుమారాదులు సుకుమారమతులు. అతిసుఖిస్వభావులు. వారు నీరస నీతిశాస్త్రమున బ్రవర్తింప లేరు. వారలను కావ్యము కాంతవలె సరసతాపాదనమున నభిముఖీకరించుకొని యుపదేశించును. బాలకులు కటుకషాయౌషధమును ద్రాగుట కున్ముఖులు కారు. వారలకు మధురపానాదు లిచ్చి మందు లందించినట్లు కావ్య ముపదేశించు నని పరమార్థము. ఉన్ముఖులు కాని వారల కౌన్ముఖ్య మిచ్చువిశిష్టత కావ్యమున గలదు.

## క వి స హృ ద యు లు

కావ్య సృష్టినిర్వాహకు లిద్దరు. కవి సహృదయుడు. సరస్వతీ తత్త్వము కవిహృదయాఖ్య మని యందురు. ఈ చెప్పిన ప్రయోజనషట్కము యథాయోగముగా వీరలకు లాభించును. యశము ద్రవ్యము శివేతరక్షతి యను త్రితయము కవికి సంబంధించును. అవిశేషముగా నుభయులకు సిద్ధించునని కొందరి యూహ. వ్యవహారవేదనము పరనిర్వృతి యుపదేశము అను త్రికము సహృదయునకు గల్గును. కవి కివి యలభ్యములు కావు. వ్యవహారోపదేశములు లేకున్న కవి కవియే కాజాలడు గదా! కావ్యాస్వాదన సమయమున గవియు సహృదయుడే. ఇట్టి కావ్యమునఁ గవిసహృదయులవశ్యముగా యత్న మొనరింప వలయును. కవిభావకుల యత్నములు ప్రసిద్ధములు కదా! ఈ ప్రయోజనములలో నే యొకటి యున్నను యతింప వలయునె! ఫలషట్క ముండగా నింక జెప్ప నదేమి? ఈ సముదాయసిద్ధిలో నవశ్యముగా యత్నింప వలయు నని విధి. ఇట్లు కావ్య మైహికాముష్మిక ఫల ప్రదాయకము. కావున దద్విచారాత్మకమగు నీ సాహిత్యశాస్త్రమున బ్రవృత్తి సముచిత మని భావము.

★ ఏవమస్య ప్రయోజనముక్త్వా కారణమాహ.

శక్తిర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞశిక్షయాభ్యాస ఇతి హేతుస్తదుద్భవే. 3

శక్తిః కవిత్వబీజరూపః సంస్కారవిశేషః యాం వినా కావ్యం న ప్రసరేత్, ప్రసృతం వా ఉపహసనీయం స్యాత్. లోకస్య = స్థావరజంగమాత్మకలోకవృత్తస్య, శాస్త్రాణాం ఛందోవ్యాకరణాభిధానకోశకలాచతుర్వర్గగజతురగఖడ్గాదిలక్షణ గ్రంథానాం, కావ్యానాం చ మహాకవిసంబంధినాం, ఆదిగ్రహణాదితిహాసాదీనాం చ విమర్శనాత్, వ్యుత్పత్తిః, కావ్యం కర్తుం విచారయితుం చ యే జానంతి తదుపదేశేన కరణే యోజనే చ పౌనఃపున్యేన ప్రవృత్తిరితి, త్రయః సముదితాః, న తు వ్యస్తాః, తస్య కావ్యస్యోద్భవే = నిర్మాణే సముల్లాసే చ, హేతుః న తు హేతవః.

## కా వ్య కా ర ణ ము

ఇంతవరకు గావ్య ప్రయోజన రూప మయిన కావ్యము వివేచిత మయినది. ప్రయోజన కథనమున నధికారులయిన కవిసహృదయులు ప్రరోచనము కలవారగుదురు. వారు కావ్యమున యతన మొనరింప వలయునని కదా! యంటిమి. యత్నమనునది కారణము. కాన నుపాయరూప మయిన కారణమాత్రము నానూత్రింపవలయును. ఈ వక్ష్యమాణ మగు "శక్తిర్నిపుణతా"యను కారిక కావ్యకారణము చెప్పును.

ప్రతిభాత్మక మయిన శక్తి, లోకశాస్త్రకావ్యాది సమీక్షణమునఁ గలుగు నైపుణ్యము, కావ్యజ్ఞశిక్షణముచే నుదయించు నభ్యాసము అను నది కావ్యసముత్పత్తిలో హేతువు అని సామాన్యార్థము. "శక్తి, నిపుణత, యభ్యాసము" అను మూడు సాధనములు ప్రతిపాదితములు. కారణ మేకవచనాంతముగ గారికలో నున్నది. ఏల? మూడును మిళితములై యొకటియె యగుట యభీష్టము. ఈ మూడు నుపాదేయములు. ఈ యంశము ముందు విశద మగును.

### శ క్తి

ఆ హేతుసముదాయ మేమి? అందు మొదటి హేతువు శక్తి. అదియె ప్రతిభ. "శక్నోతి అనయా ఇతి శక్తిః" అని శక్తి పద వ్యుత్పత్తి. మానవుడు దీనిచేఁ గావ్యనిర్మాణమునకుఁ దదాస్వాదానుభవమునకును సమర్థుడగును. ఈ శక్తి కవిత్వబీజ రూప మయిన సంస్కార విశేషము. లోకోత్తర వర్ణనా నిపుణ రూప మయిన కవిత్వమున కిది బీజరూపము. జన్మాంతరీయాభ్యాస వశమున గాని, దేవతాప్రసాదమునఁ గాని బుద్ధికిఁ గలుగు సంస్కారవిశేషమే యిది.

"స్మృతిర్వ్యతీత విషయా మతిరాగామిగోచరా
బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాలికీ మతా
ప్రజ్ఞాం నవనవోన్మేషశాలినీం ప్రతిభాం విదుః."

అని సంప్రదాయ విదుల వచనము. గడచిన దానిని గుర్తించునది స్మృతి, భవిష్యమును గుర్తించునది మతి. వర్తమానమును గుర్తించునది బుద్ధి. భూతభవిష్యద్వర్తమాన కాలత్రయమునకు సంబంధించియుండునది ప్రజ్ఞ. నవనవోన్మేషశాలిని యగు ప్రజ్ఞయె ప్రతిభ. నిశ్చలమైన కవి మనస్సులో

నర్థ మనేకవిధముల విస్ఫురణము పొందును. శబ్దము లక్లిష్టములై భాసించును. ఇట్లు చేయునదియే శక్తి. ఈ శక్తి కావ్యకారణ మనుటలోఁ బ్రమాణమేమి? ఈ శక్తి లేకున్న కావ్యము ప్రసరింపదు. ప్రసరించినను ఉపహాసనీయమే యగును. ఒక డొకఁడు బుద్ధిమంతుడె యగును. మంచి యభ్యాసము కలవాఁడే యగును. శక్తి లేకున్నచోఁ జతుష్పదీ మాత్రమున నైనఁ బ్రసారము కలుగదు. మరి యొకఁ డెంతేని రచించును. వాని ప్రసారము ప్రభూతమె యయినను సహృదయు లుపహసింతురు. ఇట్టి వీరిద్దరు శక్తిదరిద్రులు. సందర్భమునఁ బ్రసరము అనుపహాస్యత్వము నుండు నాతడే కావ్యమున శక్తిమంతుడు. ప్రచురప్రసార మున్నను సహృదయు లుపహసింతురేని యది కావ్యమే కాదు. ఉపహాసనీయము వ్రీడావహము కదా! అకవిత్వ మధర్మమునకుఁ గాదు. వ్యాధి నీయదు. దండన నీయదు. కుకవిత్వమె "సాక్షాన్మరణము" అని మనీషు లందురు. నిపుణత యున్నను అభ్యాస మున్నను ఈ శక్తి లేకున్న అనుపహాసనీయమగు కావ్య ముదయింపదు. అందుచే శక్తి కావ్యహేతువు. రచనామాత్రమె కవిత్వము కాదు కదా! రసోత్పత్తి కనుకూల మయిన రచనయె కవిత్వము. అది శక్తి లేకున్న కలుగునేమి? దీనినే ప్రతిభ యని కొంద రందురు. ఈ యంశము నందరంగీకరింపరు. శక్తి నిపుణత అభ్యాసము అను మూఁడు కారణములు కూడుకొనిన బుద్ధియే ప్రతిభ యని వారి వాదము.

## నిపుణత

రెండవ హేతువు నిపుణత. ఇదియె వ్యుత్పత్తి. లోక శాస్త్ర కావ్యాదుల విమర్శనమున, పరిశీలనమున, వ్యుత్పత్తిలభించును. లోక మన స్థావర జంగమాత్మక మయిన లోకాచరణము. లోకవృత్త మొక విచిత్ర హేవాకము. ఇది యున్నందువనె స్వభావోక్తి, అతిశయోక్తి మొదలగు నలంకారములు ఘటించును.

వృక్షపర్వతాదుల వలె జడముగా నుండునది స్థావరము. పశుపక్షి మనుష్యాదుల వలె చేతనముగా నుండునది జంగమము. ఇట్టి లోకవిచిత్రాచరణమె లోకవృత్తము. ఛందో వ్యాకరణ అభిధానకోశ, కలా, చతుర్వర్గ, గజ తురగ ఖడ్గాది లక్షణగ్రంథముల విమర్శనమునఁ గూడ వ్యుత్పత్తి కలుగును. శక్తిమంతుఁడు లోకవృత్తము గుర్తించిన పిమ్మట నీ శాస్త్రాదులు

కావ్యమున నుపయోగించును. ఇది విశేషముగా భావింప దగినది. ఛంద శ్శాస్త్రము తెలిసినచో వృత్తసంశయము విడిపోవును. వ్యాకరణము తెలిసి నచో సౌశబ్ద్య నిర్ణయము కలుగును. అభిధాన మనునది నామానుశాసనము. కోశము లింగానుశాసనము గీతాది చతుష్షష్టి కళలు. కళలు.

౧ గీతము
వాద్యము
నృత్యము
ఆలేఖ్యము
౫ విశేషచ్ఛేద్యము
తండులకుసుమబలివికారములు
పుష్పాస్తరణము
మణిభూమికాకర్మ
శయనరచన
౧౦ దశనవసనాంగరాగము
ఉదకవాద్యము
ఉదకాఘాతము
చిత్రరచన
మాల్యగ్రథనము
౧౫ శేఖరాపీడయోజనము
కర్ణపత్రరచన
గంధయుక్తి
భూషణయోజనము
ఇంద్రజాలము
౨౦ నేపథ్యప్రయోజనము
కౌచుమారయోగము
హస్తలాఘవము
విచిత్రశాకయూషభక్ష్య వికారక్రియ
పానకరసరాగాసవయోజనము
౨౫ సూచీవానకర్మ
సూత్రక్రీడ
వీణాడమరుకవాద్యము
ప్రహేళిక
ప్రతిమాల
౩౦ దుర్వాచకయోగము
పుస్తకవాచనము
నాటకాఖ్యాయికాదర్శనము
కావ్యసమస్యాపూరణము
పట్టికావేత్రవానవికల్పములు
౩౫ తర్కుకర్మ
తక్షణము
వాస్తువిద్య
రూప్యరత్నపరీక్ష
ధాతువాదము
౪౦ మణిరాగాకరజ్ఞానము
వృక్షాయుర్వేదయోగము
మేషకుక్కుటలావకయుద్ధవిధి
శుకశారికాప్రలాపనము
ఉత్పాదనసంవాహన కేశమర్దన కౌశలము
౪౫ అక్షరముష్టికాకథనము
మ్లేచ్ఛితవికల్పము
దేశభాషావిజ్ఞానము

పుష్పశకటిక
నిమిత్తజ్ఞానము
౫౦ యంత్రమాతృక
ధారణమాతృక
సంపాద్యము
మానసకావ్యక్రియ
అభిధానకోశము
౫౫ ఛందోజ్ఞానము
క్రియాకల్పము
చలితకయోగము
వస్త్రగోపనము
ద్యూతవిశేషము
౬౦ ఆకర్షక్రీడ
బాలక్రీడనకము
వైనయికవిద్య
వైజయికవిద్య
౬౪ వ్యాయామము

ఇట్లు చతుష్షష్టికళలు కామశాస్త్రాదులలో నిర్దిష్టములు. చతుష్షష్టి కళల నిర్దేశములో మతభేదము కలదు.

ధర్మార్థకామమోక్షములు చతుర్వర్గములు. వీని లక్షణములు ధర్మశాస్త్ర, అర్థశాస్త్ర, కామశాస్త్ర, మోక్షశాస్త్రములలో విశదముగానున్నవి. జైమిని రచించిన పూర్వమీమాంసాశాస్త్రము, మనువుయాజ్ఞవల్క్యాదు మొదలగు వారు రచించిన స్మృతిశాస్త్రములు, ధర్మశాస్త్రమని ప్రసిద్ధి. గర్గ భార్గవ కౌటిల్యాదు లర్థశాస్త్రముల రచించిరి. వాత్స్యాయనాది మునులు కామశాస్త్రప్రణేతలు. వ్యాస, కపిల కణాద గౌతమ పతంజలి ప్రముఖ ప్రణీతము లయిన మోక్షశాస్త్రములు దర్శనములుగా ప్రసిద్ధములు. దర్శనములలో వైదికదర్శనములు అవైదికదర్శనము లను విభాగము కలదు. శాలిహోత్రాదిగ్రంథములు గజతురగాదిగ్రంథము లని ప్రసిద్ధి. ఖడ్గ ధనుర్బాణాది ప్రతిపాదక శాస్త్రములును ఇచట గ్రాహ్యములు. స్త్రీపురుషుల లక్షణములను నిర్దేశించు సాముద్రికశాస్త్రమును, ఆయుర్వేదజ్యోతిశ్శాస్త్ర, నీతిశాస్త్రములును గ్రహింపవలయును. వ్యుత్పత్తి కలుగుటకీ శాస్త్రముల విమర్శన మావశ్యకము.

న స శబ్దో న తద్వాచ్యం న సా విద్యా న సా కళా
జాయేత యన్న కావ్యాంగం అహో! భారః మహాన్ కవేః

కావ్యాంగము కాని శబ్దము లేదు. అర్థము లేదు. విద్య లేదు. అన్నియు కావ్యాంగములు. కవిభారము గురుతరము కదా! ఈ నిర్దిష్టములలో ఛందోనిర్దేశము ప్రథమమున నుండుట స్వారసికము. ఛందము లేకున్న

వాచానిబంధనమెం కుదురదు. గద్యకావ్యమున గూడ ఛందస్సనుసరణీయ మని కొందరి సూచనము. కావ్యనిబంధము లోని పదముల పరిశుద్ధికై వ్యాకరణ మవసరము. పదములు పరిశుద్ధములై యగును గావృత. అవి సందర్భానుగుణములా? అననుగుణములా? అను వివేచనమునకై యభిధానకోశము లవసరములు. పిమ్మట అర్థశుద్ధికై కళా చతుర్వర్గాముల ననుసరింప వలయును.

## అభ్యాసము

ఇట్లే మహాకవి సంబంధి కావ్యములను బరిశీలించుట యావశ్యకము. దాన తగిన వ్యుత్పత్తి లభించును. కాళిదాసాది మహాకవులు రచించిన కావ్యముల పరిజ్ఞానము లేకున్న అది యేటి వ్యుత్పత్తి? ఇతిహాస పురాణ విమర్శనమును వ్యుత్పత్తిహేతువు. బృహత్కథయు నిచట పరిగ్రాహ్యము. ఇట్లె తక్కినవియు, కావ్యకరణ మనునది యొక సమున్మీలనము. అందు కవులె ప్రభావులు. వారియందు ప్రఖ్యా ప్రాచుర్య ముండును. అందుచే వారి కృతుల పరిభావన మావశ్యకము. కావ్యవిదుల యుపదేశమున గలుగు నభ్యాసము నపేక్షితము. కావ్యవిజ్ఞులు రెండు విధముల నుందురు. కొందరు కావ్యకర్తలు. కొందరు కావ్యవివేచకులు. కావ్యకర్తల యుపదేశమున కావ్యకరణమునందుఁ బౌనఃపున్యమున (మఱలమఱల) ప్రవర్తించుట యొక విధమగు నభ్యాసము. కావ్యకర్తల యుపదేశము కావ్యసమయములఁ దెలియఁ జేయును. ఆదేశమున, ఆకాలమున, అస్థానమున ఆ యా వస్తువుల యునికి కావ్యకర్తలకుఁ బరిచితము. కావ్యవివేచకులు సహృదయులు. వారి వివేచనము వైచిత్ర్యము కూడిన విమర్శ. అట్టి విమర్శలో సహృదయులె సమర్థులు కదా! ఏల? వారి యందుపాఖ్యా ప్రాధాన్య మున్నది. వారి యుపదేశమునఁ గావ్యయోజనమునందు పౌనఃపున్యమునఁ బ్రవర్తించుటయు నభ్యాసము. మొదట కదా! పరీక్ష యవసరము. పిమ్మట నందు ఫలస్వామ్యము నన్వేషింప వలయును. అనంతర మన్నిటికిని ఫలపర్యంతత్వము నందించుట కావలయును. రసవిషయములో నిత్యజాగరణము కావ్యజీవము. వానికిఁదగినట్లు విభావాదియోజనము, అందలంకారౌచిత్యము సమీక్షించుట యపేక్షితము. ఇట్టి సమీక్షణమె కావ్యకరణము. కవి తన సంభావనమును ప్రబంధరూపమున సంఘటించుట కావ్యయోజనము. ప్రబంధములోని

యవయవవిన్యాస మాస్వాదోద్బోధకము కావలయును. అట్లుండుట కావ్యయోజన మని నిర్ణయము.

ఇట్లు శక్తి వ్యుత్పత్తి అభ్యాసములు మూడును మిళితములై కావ్యసముల్లాసమున హేతు వగును. ఈ మూడును ఒకే హేతువు. ఇవి వేరు వేరు కారణములు కావు. ఘటోత్పత్తిలో దండచక్రాదు లన్నియు నొక్క హేతు వయినట్లు కావ్యోత్పత్తిలో భిన్నస్వరూపము లయినను మిళితము లయిన శక్తినిపుణతాభ్యాసములు ఒకే హేతువు.

ప్రతిభా ముఖ్యత

ఇచట నీ విషయమును విచారింప వలయును. శక్తిలేని కవి రచించిన కావ్య ముపహాసనీయ మగునని మొదట నిర్దిష్టము. ఆ కావ్య మెట్టిది? ఛందోవ్యాకరణవిరోధము లేక పోవుటయే గుణముగా గల కావ్య మొకటి. దోషములు లేక గుణాలంకారసహితమై రసోద్బోధన సమర్థ మయిన కావ్యము మఱి యొకటి. ఇందీ రెండవ కావ్య మెన్నడు నుపహాసనీయమే కాదు. శక్తి లేక పోయినచో నిపుణతాభ్యాసములలో నే యొకటి యున్నను కావ్యము ప్రసరింపదు. నిపుణతాభ్యాసములు రెండు నుండునేని కావ్యము ప్రసరించును. కాని యది యుపహాసనీయ మగును. శక్తిమాత్ర మున్నను కావ్యము ప్రసరింప వచ్చును. అది సహృదయులు కాని సామాన్యవిద్వాంసులకు మీమాంసకాదులకు నుపహాసనీయము కాక పోవచ్చును. కాని సహృదయు లభినందింపని కావ్యము కావ్యమా? శక్తియు నిపుణతాభ్యాసములలో నే యొకటియో యుండి కవి కావ్యమును రచించును. అట్టి కావ్యము శ్లాఘ్య మగును. శక్త్యాదిత్రితయ ముండి కవి రచించిన కావ్యము సహృదయేతరులకు శ్లాఘ్యతరమై యగును. సహృదయులకును కావ్యవ్యవహారయోగ్యమై రసోద్బోధన సమర్థ మగును. అందుచే త్రితయ మపేక్షిత మని పరిగ్రాహ్యము.

★ ఏవమస్య కారణముక్త్వా స్వరూపమాహ.

తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి.

దోషగుణాలంకారా వక్ష్యంతే. క్వాపీత్యనేనైతదాహ; యత్సర్వత్ర సాలంకారౌ క్వచిత్తు స్ఫుటాలంకారవిరహేఽపి న కావ్యత్వహానిః యథా;

యః కౌమారహరః స ఏవ హి వరస్తా ఏవ చైత్రక్షపాః
తేచోన్మీలితమాలతీసురభయః ప్రౌఢాః కదంబానిలాః
సా చైవాస్మి తథాపి తత్ర సురతవ్యాపారలీలావిధౌ
రేవారోధసి వేతసీతరుతలే చేతః సముత్కంఠతే.

అత్ర స్ఫుటో న కశ్చిదలంకారః రసస్యచ ప్రాధాన్యాన్నా లంకారతా.

## కావ్యలక్షణము

ఈ చెప్పిన దంతయుఁ గావ్యోపాయము. ఉపాయమును గుర్తించిన పిమ్మట నుపేయమును గ్రహింప వలయును. ప్రకృత ముపేయ స్వరూప వివేచన మవసరప్రాప్తము. ఇట్లు పైఁ గావ్యస్వరూపమును మమ్మటుఁడు చెప్పుచున్నాఁడు. కావ్యస్వరూప మనునది యనన్యసాధారణము అవ్యభిచరితము నగు రూపము. ఇదియె కావ్య లక్షణము.

“తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి.”

అదోష సగుణ శబ్దార్థములు కావ్యస్వరూపము. ఒక్కొకచో నలంకారములు లేకున్నను అట్టి శబ్దార్థములు కావ్యమె యగును. దోషగుణాలంకారములు తరువాతి యుల్లాసములందు నిరూపితము లగును. నిర్దోషత్వాది సహిత మయిన శబ్దార్థయుగళము కావ్య మని సంక్షేపార్థము. శబ్దార్థములు రెండు నొకటి యగుట చిత్రమె. కొందరు కమనీయశబ్దమె కావ్యమందురు. మరికొందరు రమణీయార్థమె కావ్యమందురు. ఈ పక్షద్వయ మిచటఁ బ్రతిక్షిప్తము. ప్రతితిలమున తైల ముండు నట్లు శబ్దార్థముల రెండిట అహ్లాద నిబంధనత కలదు. అనుపహసనీయ కావ్యమె సహృదయ చమత్కార మాధానించునని మమ్మటులు తలఁచిరి. చమత్కారము శబ్దార్థముల రెండిట నుండును. వ్యంజనాకృతమగు నాస్వాదనమును నుభయమున నుండును. కావున శబ్దార్థములు రెండును గావ్యమనుట సమ్మతము.

చ్యుతసంస్కారాది దోషములు కావ్యత్వవిఘటకములు. కావ్యమున దోష మున్నచో సహృదయప్రీతి జనింపదు. రసబోధ కలుగదు. అందుచే దోషములు లేకపోవుట మొదట నుపాత్తము. మాధుర్యాది గుణములును ముందు నిరూపితము లగును. “గుణసహితము లయిన శబ్దార్థములు కావ్యము”

అనుటచే నిర్గుణమునం దతివ్యాప్తిలేదు. మాధుర్యాది గుణములు శబ్దార్థ నిష్ఠములై రసాదుల నభివ్యక్తము చేయును. గుణములు రసైకనిష్ఠములే యైనను రసాభివ్యంజక శబ్దార్థ నిష్ఠత్వమును వానికి గలదు. నిర్దోషములు సగుణములు సాలంకారములు నగు శబ్దార్థములు కావ్యమని తేలిన యంశము. ఏ వాక్యము కాని సావధారణమె యగునని నియమ మున్నది. అందుచే దోషశూన్యములె కావలయును. శబ్దార్థములు గుణసహితములె కావలయును. అని నిశ్చయింప వచ్చును. అట్లె "శబ్దార్థములు సాలంకారములె కావలయు" నను నిశ్చయ నియమ మంతగా నభీష్టము కాదు. అలంకారములు కావ్య శోభాసంపాదకములు. అవి యట్టివై యుండుట సమ్మతము. అంతియ కాని యలంకార నైయత్య మభీష్టము కాదు. కావ్యము నందు దోషముల పరిహరింప వలయు నని, గుణముల స్వీకరింప వలయునని నియమము నంగీకరించు పెద్దలు అలంకార విషయమునఁ గామచారము నంగీకరించినారు. అలంకారములు లేకున్నను ప్రతీయమానచ్ఛాయ కావ్యభూష యని ప్రతీతి. అందుచే నొక్కొక్కచో స్ఫుటముగా నలంకారములు లేకున్నను గావ్యత్వమునకు హాని లేదు. అనలంకృతి యను మూలవచనమునకు స్ఫుటాలంకార విరహ మనియె యర్థము నంగీకరింప వలెను.

కావ్యమున నంతట శబ్దార్థము లలంకార సహితములు గనె యుండ వలయును. ఒక్కొకచో స్ఫుటాలంకారత లేక పోయినను గావ్యత్వ ముండవచ్చును. నీరస కావ్యమునఁ గూడ నస్ఫుటాలంకారత యుండక పోదు. నీరసమునందు స్ఫుటముగా నలంకారము లేకున్నచోఁ గావ్యత్వ మంగీకరించుట యంతగా రుచిరముగ నుండదు. రసాదికము, అలంకారము అను నీ ద్వయము కావ్యచమత్కార హేతువు. రసాదు లున్నచోట స్ఫుటాలంకారాపేక్ష లేదు. రసానుగుణమైన యర్థవిశేషము నిబద్ధమయినప్పు డలంకారము లేక పోయినను ఛాయాతిశయము కలదని ధ్వనికారాదు లంగీకరించిరి. నీరస కావ్యమున స్ఫుటాలంకారము లేక పోయినచోఁ జమత్కార మెట్లు కలుగును? కావ్యము చమత్కారసారము కదా! అందుచే స్ఫుటాలంకారము లుండుట యావశ్యక మగుచున్నది. రసాదులు స్ఫుటము కాని యప్పుడె యస్ఫుటాలంకారము నొక్కొక్కచో గావ్యము కావచ్చును. అలంకారములు లేక పోవుట యనునది సార్వత్రికము కాదు.

దోషము లున్నచో గావ్యత్వ భంగము కల్గును. గుణములు లేకున్న కావ్యత్వ భంగము కలుగదు. అలంకారములు లేక పోయినచో నట్లు కావ్యత్వభంగము రాదని సారాంశము. ఈ యంశము నుదాహరణ ద్వారమున గుర్తించుట సముచితము.

ఈ పద్యము శార్ఙ్గధరపద్ధతి సుభాషితరత్నభాండాగారములలో శీలాభట్టారికా రచితముగా ప్రసిద్ధము. ఇందలి నాయిక స్వాధీనపతిక. ఎన్నియో పర్యాయములు ఆ యా యుపకరణములను, ప్రియుని ననుభవించినది. ఐన నధికోత్కంఠ కలదియై యందలి యభీష్టమును సూచించు చున్నది. కొందరిట్లందురు. ఇందలి నాయిక బాల్యమునందె కులశీలాది గుణగణోల్బణుం డయిన యొక యువకుని ప్రేమించినది. నిగూఢముగా నభిలాషము నిర్వహించు కొనినది. తరువాత నాచారసంరక్షణమునకు తెలియక చేసినపని కప్పిపుచ్చుటకు దలిదండ్రు లామె నాతనికే యిచ్చి పరిణయము చేసిరి. ఇప్పుడామె కుటుంబిని యయినది. ప్రియసఖుల సంకథనములోఁ బ్రాచీన వాసనా వశంవద యయిన యామె యిట్లనుచున్నది. ఈ పద్యభావము నిట్లు గ్రహింప వలయును.

అనాడు నా కౌమారమును దోచుకొనిన వరుడె యీ వరుడు. ఆ వసంతరాత్రులె యివియు వికసితమాలతీ పరిమళము కలిగి ప్రౌఢము లయిన యా కదంబానిలములె యిప్పుడు నున్నవి. నేను నానాటి యావని తనె అయినను ఆ రేవాతీరమున, ఆ వేతసీతరుతలమున, ఆ సురతవ్యాపార లీలా విధానమున నా చేత ముత్కంఠముతో నున్నది. స్త్రీస్వభావ కోమల మయిన చిత్తమున ప్రథమప్రణయ మెన్నడు విస్మృతము కాదను నంశమిందు గోచర మగును.

ఈపద్యమున స్ఫుటముగా నే యలంకారమును లేదు. రసము ప్రధాన మగుట అది యలంకారము కాదు. ఇందు విభావనా లంకారము, విశేషోక్త్యలంకారము సంభవింప వచ్చును. కాని యవి యస్ఫుటములుగా నున్నవి. కారణము లేక పోయినను కార్య ముత్పన్న మైనట్లు వర్ణించినచో విభావనాలంకారము. ఇందుత్కంఠా కారణములు నిర్దిష్టముగ లేవు. ఐన నుత్కంఠ కలుగు చున్నట్లు వర్ణితము. అందుచే విభావనాలంకార మని యను కొనుట కవకాశ మున్నది. కాని యది స్ఫుటము కాదు. కారణ

ములు లేక పోవుట స్పష్టముగా నిందు లేదు. స్పష్టముగా లేనందున విభావన యుల్లసించుట లేదు. కారణసామగ్రి పుష్కలముగా నున్నను కార్యముత్పన్నము కాకపోయినచో విశేషోక్త్యలంకార మగును. ప్రకృత పద్యము నం దనుత్కంఠను గలుగజేయు కారణములు గలవు. ఐన ననుత్కంఠా రూప మయిన కార్యము వర్ణితము కాలేదు. కారణ మున్నను కార్యము లేకపోవుట యను విశేషోక్తి సంగతము కావచ్చును కాని యదియు నస్ఫుటమే. ఇందు గార్యాభావము స్పష్టముగా నిర్దిష్టము కాలేదు. ఉత్కంఠ కలుగుచున్న దనియె యున్నది. కాని యనుత్కంఠ పుట్టుట లేదని లేదు కదా! కావున నీ రెండు నిచట నస్ఫుటాలంకారములె.

రసము ప్రతిపాదిత మైన స్థలమున నది యలంకారమె యని భామహాదు లంగీకరింతురు. రసము ప్రధానమె యగుచో నది యలంకార్యమె యగును కాని యలంకారము కాదు. ఈ యంశము పంచమమున స్పష్ట మగును. ఇందు విప్రలంభ శృంగారము ప్రధానమై యంగిగా నున్నది. అది యలంకారము కాదు. "హరః వరః" అను అనుప్రాస శృంగార ప్రతీప మగుట నలంకారము కాదు. ప్రధానానుకూలమే యలంకారము కదా! విభావనా విశేషోక్తు లస్ఫుటములుగనే యున్నందున దన్మూలక సందేహ సంకరాలంకారము నస్ఫుటమే యగును. కావున నే యలంకారము నిందు స్ఫుటరూపము పొందుట లేదు.

ముందుగా సామాన్యము గోచర మయినపుడు పిమ్మట విశేష జిజ్ఞాస గోచరించును. ఇంతవరకు సామాన్యరూపమున గావ్యలక్షణము నిరూపిత మయినది. కావ్యవిభాగములను క్రమముగ నిక చెప్పవలసి యున్నది.

★ తద్భేదాన్ క్రమేణాహ.

ఇదముత్తమమతిశయిని వ్యంగ్యే వాచ్యాద్ధ్వనిర్బుధైః కథితః.

ఇదమితి కావ్యం బుధైర్వైయాకరణైః ప్రధాన భూత స్ఫోటరూపవ్యంగ్యవ్యంజకస్య శబ్దస్య ధ్వనిరితి వ్యవహారః కృతః తతస్తన్మతానుసారిభిరన్యైరపి న్యగ్భావితవాచ్యవ్యంగ్యవ్యంజన క్షమస్య శబ్దార్థయుగళస్య యథా;

నిశ్శేషచ్యుతచందనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరో
నేత్రే దూరమనంజనే పులకితా తన్వీతవేయం తనుః
మిథ్యావాదిని! దూతి! బాంధవజనస్యాజ్ఞాతపీడాగమే!
వాపీం స్నాతుమితో గతాసి? న పునస్తస్యాధమస్యాంతికం.

అత్ర తదంతికమేవ రంతుం గతాసీతి ప్రాధాన్యేన వ్యజ్యతే.

## ఉ త్త మ కా వ్య ము

కావ్యభేదములలో మొదటిది యుత్తమము. ఇది యుత్తమ కావ్య లక్షణము. అభిధావృత్తి ప్రతిపాదించు వాచ్యార్థము కన్న వ్యంజనావృత్తి ప్రతిపాదించు వ్యంగ్యార్థ మధికచమత్కారమును గలుగ జేయునది యైనచో నది ధ్వనికావ్య మగునని ధ్వనిపండితులు నిరూపింతురు అని సామాన్యముగా దీని యర్థము.

ఇందు నిర్దిష్టు లయిన బుధులు వైయాకరణులు. బుధ శబ్దము విద్వత్సామాన్యవాచకమె. ఐనను ధ్వనినిరూపకులనె యిచట నిర్దేశించును. "ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః వ్యాకరణమూలత్వాత్సర్వవిద్యానాం" అని ధ్వనికారు డనుచున్నాడు. వైయాకరణులు స్ఫోటవాదము నంగీకరింతురు. వారి దృష్టిలో స్ఫోట ప్రాధానము. అట్టి స్ఫోటరూప మయిన వ్యంగ్యమునకు వ్యంజక మయిన శబ్దమునకు "ధ్వని" యని వారు వ్యవహారము నేర్పఱచిరి.

ఈ యంశము నిట్లు గ్రహింప వచ్చును. ఏదేని పదము నుచ్చరించి నపుడు దాని వలన నర్థజ్ఞాన మెట్లు కలుగు చున్నది? దాని నిట్లు వైయాకరణులు ప్రతిపాదింతురు. "పట" శబ్ద ముచ్చరిత మయిన దనుకొనుడు. ఇందు రెండు వర్ణములు కలవు. వర్ణము లన్నియు క్షణికములు, క్షణము దాటినచో నవి యుండవు. నశించును. పట పదము లోని "ప" కారో చ్చారణములో "ట" కారము లేదు. "ట" కారోచ్చారణములో "ప" కారము నశించినది. రెండు వర్ణము లొక్కే కాలమున వినఁబడవు కదా! ఆ రెండిటికి సమూహ మెట్లు కుదురును? వర్ణములు ప్రత్యేకముగా నర్థబోధకము లనుటయు గుదురదు. ఒక్కొక వర్ణమున నర్థమేమియు గలుగుట లేదే! ఇంక పటపదమున నర్థప్రతీతి కలుగుట యెట్లు? ఇట్లు కలుగును. వినఁబడు వర్ణముల కన్న భిన్నముగ నచట నున్న వర్ణములచే నభివ్యంగ్య

మగుచు నర్థము తెలియజేయు నట్టి నిత్యశబ్దమొకడు కలదు. అదియే స్ఫోటం. ఈ స్ఫోటశబ్దములో క్రమము లేదు. పదమునకు ప్రత్యేకముగా నొక స్ఫోట యున్నది. అది శబ్దముచే నభివ్యక్త మగును. శబ్దము వ్యంజకము. స్ఫోట వ్యంగ్యము. ఇట్లు వైయాకరణ మతమున స్ఫోటయే ప్రధాన మని స్పష్ట మయినది. దానిని దెలియఁ జేయు శబ్దము "ధ్వని" యని యెరిగి నట్లయినది. ఇట్లంగీకరించు వైయాకరణుల మతమును సాహిత్యకారులును అనుసరింతురు. సాహిత్యవిదులు శబ్దార్థయుగళమునకు ధ్వని యను వ్యవహారము నేర్పఱచిరి. అభిధ ప్రతిపాదించిన వాచ్యార్థ మప్రధానము కాదు. ప్రధానముగ నవభాసించు వ్యంగ్యార్థమును వ్యంజనము చేయుటలో సమర్థ మయిన శబ్దార్థ యుగళము వీరి మతమున ధ్వని. ఇట్లనుటచే నేతద్రూప మయిన యుత్తమ కావ్యము ధ్వని యని యర్థము. ఇట్టి యభిప్రాయమునే ధ్వనికారు లానందవర్ధనులు చెప్పిరి. శబ్దము తన యర్థము గుణీకరించుకొని అప్రధానము చేసికొని, యర్థాంతరమును గోచరింపఁ జేసినపుడు అర్థము తా నుపసర్జనీకృతమై యన్యార్థమును బ్రతిపాదించు నపుడును ధ్వని యన్న వ్యవహారము కల్గును" అని.

నీ స్తనతటమున జందన మంతయు బోయినది. అధరమున రాగము తుడిచి నట్లయినది. నేత్రమున నంజనమేదో? నీ యీ తనువు పులకిత మయ్యె నట్లై యున్నదె.! మిథ్యావాదిని! దూతి! బాంధవజనుల పీడ నీకు దెలియునటె! నీవు వాపీస్నానమున కేగితివా? ఆ యధముని యంతిక మున కేగ లేదా!— ఒక నాయిక తన సఖిని నాయకుని దీసికొని వచ్చుటకై పంపినది, ఆ చతురసఖి యాతని సమాగమానుభవము సంపాదించి దాని దాచుటకై "వాపీస్నానమున కేగితిని" అని బొంకగా నాయిక యీ విధ మున నంతయు గుర్తించి యిట్లు పలికినది.

ఈ పద్యము నందు "రమించుటకై యాతని సమీపమునకే వెళ్ళితివి" అను నర్థము ప్రధానముగా "నధమ" పదమున నభివ్యక్త మగుచున్నది. ఇందలి నాయిక విదగ్ధ, గూఢ తాత్పర్యము గల మాటల పలికినది: ఇవి మొదట స్నానసాధారణములై సంగతము లగును. అనంతరము వక్త్రి బోద్ధవ్యాది వైశిష్ట్యము వలన దదంతిక గమనమును వ్యంజనము చేయును. ఇట్టి యర్థస్ఫురణములో నధమపద ముపకారకము, వాచ్యతాదశలో

"నాయకుఁడు దుఃఖము నిచ్చు కర్మశీలు డగుట నధముడు" అని సంగత మగును. వ్యంజనా బలమున దూతీ సంభోగ మొనరించిన వాడగుట అధ ముఁడని పర్యవసించును. ఇట్లు వాచ్యవ్యంగ్యార్థము లందుపకరించు "అధమ"శబ్దము ముఖ్యవ్యంజక మగుచున్నది.

★ అతాదృశి గుణీభూతవ్యంగ్యం వ్యంగ్యే తు మధ్యమం;

అతాదృశి - వాచ్యాదనతిశాయిని, యథా;

గ్రామతరుణం తరుణ్యా నవవంజుల మంజరీసనాథకరం
పశ్యంత్యా భవతి ముహుః నితరాం మలినా ముఖచ్ఛాయా.

అత్రవంజులలతాగృహే దత్తసంకేతా నాగతేతి వ్యంగ్యం గుణీభూతం, తదపేక్షయా వాచ్యస్యైవ చమత్కారిత్వాత్.

మ ధ్య మ కా వ్య ము

ఇది గుణీభూత వ్యంగ్య మను మధ్యమకావ్య లక్షణము. వ్యంగ్య మట్టిది కానప్పుడు గుణీభూతవ్యంగ్య మను మధ్యమకావ్య మగు నని లక్షణార్థము. ప్రాధాన్య ముండుట వ్యంగ్యమునకు స్వాభావికమగు స్వరూపము. అప్రాధాన్యమో ? అది యౌపాధికము. గుణీభూత మగు వ్యంగ్యము కలది గుణీభూతవ్యంగ్యమగును. గుణ మప్రధానము. గుణీభూత మగుట యప్రధాన మగుట యని భావము. వ్యంగ్య మప్రధాన మగుట యనేక విధముల నుండును. వాచ్యవ్యంగ్యములు రెండు సమప్రధానము లయినచో వ్యంగ్యమునకే ప్రాధాన్యమున్నట్లు కాదు. అచట వ్యంగ్యము నకు వాచ్యాతిశాయిత లేదు. వ్యంగ్యము సర్వప్రధాన మయిననే ధ్వని కావ్యము. అట్లు కాకున్న మధ్యమకావ్యమని వివేకము.

ఉదా:— "నూతనము సుందరము నయిన పూలగుత్తిని చేతబట్టి వచ్చిన గ్రామము లోని తరుణుని జూచుచున్న తరుణి ముఖకాంతి మిక్కిలి మలిన మగుచున్నది." గ్రామమున నాతడే తరుణుడు. ఆమెయు తరుణి, అతని వలచి సంకేత మేర్పఱచియు నన్యాన్యకార్యము లందుండి పోజాలని దైనది. తరుణు డచటికేగి యామె రాక చూచి చూచి రామి యచటి చిహ్నముగా మంజరి తెచ్చి యటు నిటు తచ్చాడు చుండెను. ఆమె యట్టి యాతని జూచి యిట్లయినది.

ఈ పద్యములో మంజుల లతాగృహమున సంకేత మిచ్చియు నాయిక వచ్చినది కా దను వ్యంగ్యము గుణీభూత మయినది. ఈ వ్యంగ్యము కన్న వాచ్యమే చమత్కారిగా నున్నది. ముఖచ్ఛాయ మలిన మగుట యనునది నాయికకు కలిగిన విషాదానుభావము. కామినికి గల రాగోత్కర్ష దీనిచే సూచిత మగునట్లు వ్యంగ్యముచే సూచిత మగుట లేదు. వంజుల మంజరి పట్టు కొనియున్న తరుణుని స్థితియు వ్యంగ్యము కన్న సుంధరమై యాస్వాద్య మగుచున్నది. ఇట్లు వ్యంగ్యము వాచ్యాతిశయితము కానందున దీనిని గుణీభూత వ్యంగ్య మనుట యుచిత పక్షము.

★ శబ్దచిత్రం వాచ్యచిత్రమవ్యంగ్యం త్వవరం స్మృతం.

చిత్రమితి గుణాలంకారయుక్తం అవ్యంగ్యమితి స్ఫుటప్రతీయమానార్థరహితం. అవరమధమం. యథా;

స్వచ్ఛందోచ్ఛలదచ్ఛ కచ్ఛ కుహర చ్ఛాతేతరాంబుచ్ఛటా
మూర్ఛన్మోహమహర్షి హర్ష విహితస్నానాహ్ని కాహ్నాయవః
భిద్యాదుద్యదుదార దర్దుర దరీ దీర్ఘాదరిద్ర ద్రుమ
ద్రోహోద్రేకమహోర్మి మేదురమదా మందాకినీ మందతాం.

వినిర్గతం మానదమాత్మ మందిరా
ద్భవత్యుపశ్రుత్య యదృచ్ఛయాపి యం
ససంభ్రమేంద్ర ద్రుత పాతితార్గళా
నిమీలితాక్షీవ భియాఽమరావతీ.

ఇతి కావ్యప్రకాశే కావ్యస్య
ప్రయోజనకారణస్వరూపవిశేషనిర్ణయో నామ
ప్రథమ ఉల్లాసః.

## అ ధ మ కా వ్య ము

ఇది యధమ కావ్యలక్షణము. దీనికే చిత్రకావ్యమనియు పేరు. దీని లక్షణము "అవ్యంగ్యం" అనునది. అవ్యంగ్య మగుకావ్య మవర మని సమ్మతము. అవర మనగా నధమ మని యర్థము. దీనినే పండితులు చిత్ర కావ్య మని యందు రనుట మూలకారికలో నిరూపితము కాలేదు.

ఈ యనిరూపణమే పూర్వము వానికన్న దీని న్యూనతను సూచించును. దేవనృపాదుల యాకృతిని జ్ఞాపకమునకై చిత్రమున లిఖింతురు. వివిధ చిత్రవర్ణక రేఖా ఘటనలచే విచిత్రతను గూర్చుదురు. అందుచే చూచువాని చిత్తమాకృష్ట మగును. అనుక్షణముననే యా యా దేవాదులు స్మృతిలో భాసింతురు. అట్లే యీ కావ్యమును. చిత్రము నందు బ్రాణ ముండదు. ఐనను ప్రాణ మున్నట్లు గోచరించును. దానిని జూచినపుడు చూచు వారి చిత్తము చిత్రీకృత మగుచున్నది. అందుననే చిత్రము చిత్ర మగుట.

ప్రకృత కావ్యము కూడ నట్టిది. దీని యందుఁ బ్రాణమన దగిన వ్యంగ్య ముండదు. వెంటనే యాస్వాదము కలుగజేయుటకుఁ గవి గుణాలంకారముల నిబద్ధము చేయును. శబ్దములను బింకముగా గూర్చును. వాని యందే సహృదయుని విశ్రమింప జేయును. ఆటుపిమ్మట నెప్పుడో యేదేని యాస్వాదము కలుగును. వెంటనే యాస్వాదము కలుగుటలేదు. కావున నిది యధమము. ఇది యవ్యంగ్యముగా నుండునని యందురు. అవ్యంగ్యమనుట వ్యంగ్య మత్యంతము లేకుండుట కాదు. ఏ మాత్ర మేని వ్యంగ్యస్పర్శ లేక చమత్కార మాపాదించు వాక్యమే యుండదు. అదియుగాక ఇట్టి వాని యందు నయితము వర్ణిత మగు నంశ మేదేని విధమున రసాంగత్వము పొందక పోదు. వర్ణిత మెట్టిదైన గాని తుదకు విభావముగానైన అది రసాంగమగు నని పెద్ద లనిరి. వర్ణితములకు పార్యంతిక మయిన రసప్రతీతి యవశ్య ముండును. కావుననే వ్యంగ్య మత్యంతము లేకుండు ననుట పొసగదు. వస్తువ్యంగ్యము లేక పోవచ్చును. అలంకారవ్యంగ్యము లేక పోవచ్చును. రసవ్యంగ్య ముండక పోదు. అందుచే నిది యవ్యంగ్యమనుట యెట్లు? కాన అవ్యంగ్య మనుట కిది యర్థము. ఇచట 'నఞ్' పదమునకు ఈ షదర్థమును జెప్పుకొన వలయును. ఏదో కొంచెము వ్యంగ్య ముండును. కాని యిట్టి దానిలో స్ఫుటముగా నుండదని యర్థము. వివక్షితమైన స్ఫుటవ్యంగ్య మిచట నుండదు. కవి తాత్పర్యవిషయము కాని వ్యంగ్య ముండినచో నుండ వచ్చును. అట్టి దున్నను లేనట్లు. గుణీభూత వ్యంగ్య కావ్యమున వ్యంగ్యమస్ఫుటముగ నుండును. దీని యం దస్ఫుటతరముగ నుండును. వస్త్వలంకార వ్యంగ్యము లుండవు. అందుననే యవ్యంగ్య మనుట యనుపపన్నము కాదు. ఇది శబ్దచిత్రమని యర్థచిత్ర

మని రెండు విధములు. కాఁగా శబ్దాఖ్య కావ్యభాగము నందును అర్థ కావ్య భాగము నందును చిత్రత యుండునే కాని రసాదు లుండవని నిశ్చితార్థము.

ఉదా:— ఆ మందాకినీనది మీదు మందత్వమును బోదోలు గావుత. ఆ నదీజలము స్వచ్ఛందముగా సంచలిత మగుచున్నది. కచ్ఛకుహరముల ధారాజలముల నిర్మోహమహర్షులు హర్షమున స్నానము లొనర్చి యాహ్నికముల దీర్చుచున్నారు. బొరియలలో దర్దురములు – పెద్దకప్ప లెగురు చున్నవి. నదిలోని మహాతరంగములు తీరము నందలి మహా వృక్షములను గూల్చు చున్నవి. ఇట్టి యీ గంగానది శీఘ్రముగా మీ యజ్ఞానము నశింప జేయు గావుత! అని పద్య భావము.

## శ బ్ద చి త్ర ము

ఈ పద్యములో చ్ఛ, ద, త, మ, హ, ర్ష మొదలయిన వర్ణము లనేక పర్యాయములు ప్రయుక్తము లయినవి కాన వృత్త్యనుప్రాస మలంకారము. ఓజోగుణమును తదనుగుణమై యున్నది. ఇట్లు శబ్దచిత్రణమె యిందు ముఖ్యముగా నున్నదనుట తెలియనిది కాదు. ఆలోచింపగా నిందు మందాకినీ విషయ మయిన రతిభావ ముండుట గోచరించును. ఇతర నదుల కన్న గంగానది కాధిక్యము వర్ణిత మయినందున వ్యతిరేకాలంకారమును భాసింపక పోవుట లేదు. శాంతరస స్ఫురణమును ఏదియేని విధమున నపరిహార్యము కాకపోదు. ఇక నిది యవ్యంగ్యమగుట యెట్లు? అను నీ ప్రశ్నకు సమాధాన ముక్తప్రాయమె. ఈ రతిభావమున, వ్యతిరేకాలంకారమున, శాంతమున, గవిభావము లేనే లేదు. అట్టి వ్యంగ్యము పట్టుదలతో పిండినది యగునే కాని యక్లిష్టరమణీయమై భాసించునది కాదు. భావకుని చిత్తమును శబ్దచిత్రతాసమాకృష్టమై యుద్భటరచనలో లగ్నమై తచ్చిత్రతనె సంభావించునది యగును. దూరదూరముగ గోచరించు వ్యంగ్యపర్యంత మది ధావనము చేయదు.

## అ ర్థ చి త్ర ము

ఉదా :— శత్రుసంహారకు డయిన హయగ్రీవరాక్షసుడు యాదృచ్ఛికముగ నయిన నిల్లు వెడలుట విని సంభ్రమము పడిన యింద్రుడు వేగమున గడియ వేయ నమరావతి భయమున కనులు మూసికొని నట్లున్నది. హయ

గ్రీవు డేలనో గృహము తెలుపడెను. అతడు సంహారకు డగుట దేవేంద్రునకు తత్తరపాటు కలిగినది. వెంటనే వేగముగ తానె ద్వారము గడియలు పడవేసినాడు. ద్వారమమరావతి కన్ను. తలుపు వేసి గడియ బిగించుటతో నది మూసి నట్లయినది. అడుది యమరావతి భయము పుట్టగా జేయునది లేక కన్నులు మూసికొనినదా? అన్నట్లున్నదని భావము.

దీనిలో "అమరావతి భయముచే నిమీలితాక్షియో! యనునటుల నున్న" దని వర్ణించుట యుత్ప్రేక్షాలంకారము, మాధుర్యమను గుణమును గలవు. కవితాత్పర్య ముత్ప్రేక్షయందె కలదు. హయగ్రీవుని వీరత యిందు బ్రతీతము కాకపోవుట లేదు. కాని యుత్ప్రేక్షా చమత్కారమే ముఖ్యమై వీరాదికము నముఖ్యము చేయుచున్నది. అమరావతీ శబ్దగత స్త్రీలింగ స్వారస్యమును నుత్ప్రేక్షా లంకారమునకే పోషకముగా నున్నది. ఇందు గవి సమాహిత చమత్కార మంతయు నుత్ప్రేక్షా పరామర్శాధీనమై యున్నది. కావుననే యిది యర్థచిత్రము.

శృంగారాభాస కూడిన వీరరస భావనయిందున్నదని తన్నిమిత్తముగా నుత్కర్ష చెప్పుట యుపపన్నము కాదు. "పట్టణముపై హయగ్రీవుడు వచ్చునని దేవేంద్రుడు గడియ వేయుట యమరావతి యను నబలకు విహ్వలత సంపాదించినది అను నర్థభావనలో నేమి యౌచిత్యమున్నది? ప్రతినాయకుడగు హయగ్రీవునకుఁ దనకు జయింప దగిన నగరితో శృంగారమా? కావున నిట్టి యంశముపై కవివివక్ష లేదు. ఆ వైధుర్యముననే దీని కథమ కావ్య కక్ష్యా నిక్షేపము కలిగినది. ఉత్ప్రేక్షా చమత్కారము నాస్వాదించు సహృదయుల ప్రతిపత్తిచే నిట్టి యర్థచిత్రమును గావ్యకోటిలో గ్రోడీకృతము కావచ్చును. సహృదయులు నిత్యము రసాస్వాదలాలసులు, తత్సంభావన మే మాత్ర మున్నను వా రనుభూతి చూపుదురు.

ఇట్లిచటి శబ్దార్థ చిత్రములు వేరు వేరుగా నిరూపితము లయినవి. ఈ రెండిటి మేళనమున నుభయచిత్ర మొకటి వెలువడును. అది షష్ఠోల్లాసమున నిరూపితము కా గలదు.

ఇది ప్రథమోల్లాసము.

శ్రీ మమ్మటాచార్య కృత

# కావ్య ప్రకాశము

## ద్వితీయోల్లాసము

★ క్రమేణ శబ్దార్థయోః స్వరూపమాహ.

స్యాద్వాచకో లాక్షణికః శబ్దోఽత్ర వ్యంజకస్త్రిధా.

అత్రేతి కావ్యే ఏషాం స్వరూపం వక్ష్యతే.

" వాచ్యాదయస్తదర్థాః స్యుః "—

వాచ్యలక్ష్యవ్యంగ్యాః

ప్రథమోల్లాసములో శబ్దార్థములు కావ్యమని నిరూపితము. అందు శబ్ద మెన్ని విధములు ? అర్థ మెన్ని విధములు ? అని యాకాంక్ష కలుగును. ఆ శబ్దార్థముల స్వరూప విభాగము లిందుండును.

### శబ్ద విభాగము

ఈ కావ్యశాస్త్రము నందు శబ్దము మూఁడు విధములు. వాచకము, లాక్షణికము, వ్యంజకమునని. కావ్యశాస్త్రము నందె త్రిప్రకారము కలదు. ఇతర శాస్త్రకారులు వాచక లాక్షణిక భేదములనే యంగీకరింతురు. వారలకు వ్యంజకశబ్ద మభిమతము కాదు. కావుననే కారికలో " శబ్దోఽత్ర వ్యంజకః " అని ప్రత్యేకముగా నిరూపిత మయినది. వాచక లాక్షణికముల నంగీకరించినట్లు వ్యంజకమును గూడ నవశ్యముగా నంగీకరింప వలయునని తెలుసు. వ్యంజక మంగీకృతము కాదేని వాచక లాక్షణికములు ననంగీకృతములె యగు గావుత ! విశేష మేమి ? అనియు భావము. గౌణశబ్దము లాక్షణిక శబ్దము నందంతర్భవించును. ఈ యంశము ముందు సుస్పష్ట మగును. లాక్షణిక వ్యంజక శబ్దములకు వాచకశబ్ద ముపజీవ్యము. వ్యంజక శబ్దమునకు వాచకలాక్షణికము లుపజీవ్యములు. కావుననే వాచకమును మొదట జెప్పుటయు వ్యంజకమును దుద నిర్దేశించుటయు సార్థముగా నున్నది. వాచకాది శబ్దముల స్వరూపము మున్ముందు నిరూపిత మగును.

ఇచట శబ్దముల త్రిత్వనిర్దేశ ముపాధులకే కాని యుపధేయములకు గాదు. ఒక్కొక్క శబ్దము వాచకమే యగును.'' అను నియమము లేదు. సమయ ప్రకరణౌచిత్యమును బట్టి వాచకత, లక్షకత, వ్యంజకత యొకశబ్దమునకే యుండవచ్చును. వైశేషిక శాస్త్రములలో వ్యంజకశబ్దము పేరైన వినం బడదు. కావ్యమునందె వ్యంజకమునకు స్థితి యున్నది. కాకున్న జమత్కార విశేషము గలుగుటెట్లు? విశిష్ట చమత్కారము వాచక లాక్షణికముల వలన గలుగునేమి?

## అర్థవిభాగము

వాచ్యార్థము, లక్ష్యార్థము, వ్యంగ్యార్థము నను నర్థములు క్రమముగా వాచక లాక్షణిక వ్యంజక శబ్దముల కర్థములు. వాచకశబ్దముచే వాచ్యార్థము ప్రతిపాదిత మగును. లాక్షణికము లక్ష్యము నిరూపించును. వ్యంజక ప్రతిపాద్యము వ్యంగ్యము. ఇట్లె యీ యర్థముల రూపములు గుర్తింప వలయును. అంతియే కాని వేరుగా వానికి లక్షణములు లేవు. ఈ కావ్య శాస్త్రము నందు ముఖ్యముగా వ్యంజకమే నిరూపణీయము. ఇతరముల నిరూపణ ముద్దేశ్యము కాదు. అవి సర్వతంత్ర సిద్ధములు కదా! అయిన నుపపత్తి సౌకర్యమునకై వాని నిచట ననువదించితిమి.

★ —తాత్పర్యార్థోఽపి కేషుచిత్. ౬

ఆకాంక్షా యోగ్యతా సన్నిధి వశాద్వక్ష్యమాణస్వరూపాణాం పదార్థానాం సమన్వయే, తాత్పర్యార్థో విశేషవపురపదార్థోఽపి వాక్యార్థః సముల్లసతీత్యభిహితాన్వయ వాదినాం మతం. వాచ్య ఏవ వాక్యార్థ ఇత్యన్వితాభిధానవాదినః.

## తాత్పర్యార్థము

న్యాయాది న్యాయము లందు గొన్నిట దాత్పర్యార్థ మనునది యతిరిక్తముగా గలదు. తాత్పర్యమున సిద్ధమగు నర్థము తాత్పర్యార్థము. శబ్ద మర్థమును జెప్పును. ఆ యర్థమును జెప్పు శక్తి శబ్దమున గలదు. ఆ శక్తికే వృత్తి, వ్యాపారము అని పేరులు. వ్యాపారము వినా శబ్ద మర్థమును జెప్పుట స్వీకార్యము కాదు. అట్లే యయినచో నతి ప్రసంగము వాటిల్లును. పదార్థముల పరస్పరాన్వయమున వాక్యార్థ ముల్లసించుచున్నది. ఆ వాక్యా

ర్థమును శబ్దముననే కల్గును. ఆ యర్థమును జెప్పుటకు శబ్దమునందు దాత్పర్యమను వృత్తి కలదని యంగీకరింప వలసి యున్నది. అట్టి తాత్పర్యవృత్తిచే బ్రతిపాద్యమగు నర్థము తాత్పర్యార్థము. ఈ యర్థము కూడి పూర్వము వానితో నాలు గర్థభేదములు కావా? కొందరి మతమున దాత్పర్యార్థము కలదు. తాత్పర్యమనెడు వృత్తి సాహిత్యవిదుల మతమున దూష్య మదూష్యము నగును. అందుచే దాని వాచ్యాదులతో గలుపలేదు.

నైయాయికులు మీమాంసకులు మొదలగు కొందఱి మతమున తాత్పర్యార్థమును సముల్లసించు చున్నది. ఈ విషయమై మమ్మటపాదులు మతద్వయ ముల్లేఖించిరి. అభిహితాన్వయవాద మొకటి. అన్వితాభిధానవాదము మఱి యొకటి.

## అభిహితాన్వయవాదిమతము

అభిహితాన్వయవాది మతము మొదట నిర్దేశ్యము. అభిహితము లగు పదముల కన్వయము చెప్పు వా రగుట వీరు సార్థక నాములు. ఆకాంక్ష సన్నిధి యోగ్యత అనువాని వశమున బదార్థములకు సమన్వయము కలుగును. ఆకాంక్షా యోగ్యతా సన్నిధులు లేకున్నచో వాక్యము ప్రమాణము కాదు. పదమున కర్థము నందు సంకేత ముండును. ఈ పదముచే నీ యర్థమును గుర్తింపవలయు నను ఈశ్వరేచ్ఛయే సంకేతము. ఈ సంకేతమును గుర్తించిననే యా యా యర్థములు భాసించును. గోవు పదమును వినగనే సాస్నా లాఙ్గూల ఖుర విషాణ యుక్త మయిన యొక జంతువు గోచరించును. అది సంకేతిత మయిన యర్థము. ఈ యర్థ మనేకరూపములు కావచ్చును. ఈ విషయము మున్ముందు విశద మగును. మన నిత్య దైనిక వ్యవహారము వాక్యద్వారముననే కలుగుచున్నది. వాక్య మనునది పదసమూహము. ఆకాంక్షా యోగ్యతా సన్నిధులు కల పదసమూహమె వాక్యార్థమును జ్ఞాపనము చేయుట కర్హము. ఆకాంక్ష యనునది పదముల పరస్పర సవ్యపేక్ష. ఇది గ్రహించు వాని జిజ్ఞాసారూపముగ నుండును. "గోవును" అని యనగానే శ్రోత నే నేమి చేయవలయునో తెలిసికొనవలయు నని యనుకొనును. అదియె యాతని జిజ్ఞాస. పిమ్మట "తీసుకొని రమ్ము" అను పదమును వినెనా! యాతని యాకాంక్ష యుపశమించును. ఆకాంక్షా రహిత వాక్యము ప్రమాణము కాదు గదా! "గా రశ్వః పురుషో

హస్తీ" మొదలగు వాక్యములు ప్రమాణములు కావు. కావున నర్థప్రతిపత్తిలో నాకాంక్ష యవసరము. పదములు బాధ లేక పరస్పరాన్వితములై యుండుట యోగ్యత. దీనినే యర్థాబాధ యందురు. ఇది లేని వాక్యము ప్రమాణము కాదు. "అగ్నినా సించతి" అగ్నిచేత తడుపుచున్నాడు. ఇందు యోగ్యత లేదు. అర్థబాధ యగుచున్నది. అగ్ని సేచనక్రియా కరణము కాదు గదా! సేకము ద్రవద్రవ్యముననే సంభవించును. సమూహము లోని పదముల నవిలంబమున నుచ్చరించుట సన్నిధి. జామున కొక పద ముచ్చరించి నచో శ్రోత కర్థజ్ఞానము కలుగదు. అందుచే సాన్నిధ్యమును నర్థ ప్రయత్నములో హేతువు. పదములకు బదార్థములను మాత్రము గోచరింపజేయుటలో శక్తి కలదు. "ఘటం కరోతి" అను వాక్యమున ఘటశబ్దమునకు కలశ మని యర్థము. ఆ శబ్దోత్తరభాగమున నున్న "అమ్" ప్రత్యయమునకు కర్మత్వ మర్థము. కరోతి పదమునకు కృతి యర్థము. మొదట పదములచే నిట్లు పదార్థములు ప్రతీతములగును. పిమ్మట సంసర్గావసరమున వాక్యార్థము గోచరించును. అదియే తాత్పర్యార్థము. "ఘటం కరోతి" యను వాక్యమునకు ఘటనిష్ఠ మయిన కర్మత్వానుకూలకృతి యని యర్థము. ఇచట నిష్ఠత్వ మనునది యే పదమునకును అర్థముగ లేదు. తాత్పర్యార్థము వాచ్యలక్ష్య వ్యంగ్యములలో నేదియు గాదు. వానికన్న విలక్షణము, అపదార్థ మయినను ఆకాంక్షా యోగ్యతా సన్నిధి వశమున తాత్పర్యార్థ మగును. దీనిని జెప్పుటకు దాత్పర్య మను వృత్తి శబ్దమున గలదని యంగీకరింప వలయును. తల్లబ్ధమైన యర్థము తాత్పర్యార్థము. ఇది యిట్లనుభవ విషయ మగుచున్నదని యభిహితాన్వయవాదు లందురు.

## అన్వితాభిధానవాదిమతము

అభిహితాన్వయ వాదుల మతమనుటచే బక్షాంతరము గలదని తెలియును. అది యన్వితాభిధానవాది పక్షము. పరస్పర సమన్వయము పొందిన పదముల కన్వయము చెప్పువారగుట ఈ నామము సార్థకము. వీరు పైవారివలె యన్వయాంశము విలక్షణమని యనరు. అన్వయాంశము కూడ వాచ్యమే యని యందురు. వారి భావమిది.

బాలునకు వాక్యార్థబోధ యీ విధముగఁ గలుగును. తన తండ్రికడ నున్న బాలుడు తన తండ్రి పలికిన తమ భటుడు వినిన "గామానయ"

యను వాక్యమును వినును. భటుఁడు సాస్నా ఖుర విషాణసహిత మయిన యొక పదార్థమును తెచ్చును. దానిని బాలుఁడు చూచును. అట్లే "గాంనయ, అశ్వమానయ" యని తండ్రి పలికినప్పుడు భటుఁ డా వాక్యమును విని "ఇది వరలోఁ దీసికొని వచ్చిన పశువును తోలికొనిపోవుటను క్రొత్తగా నొక పశువును దీసుకొని వచ్చుటను" చేయుచున్నట్లు బాలుఁడు గుర్తించును. మఱల మఱల నిట్లే యీ మాటలను వినుటను అచేతలను జూచుట ననుభ వించిన బాలుఁడు అన్వయవ్యతిరేకముల ననుసరించి "నయనము, ఆనయము అను క్రియలలో నుపయోగించిన గోవునందు గోపదమునకు శక్తికలదని, గవాశ్వములు కల యానయనమునందు "ఆనయ" పదమునకు శక్తికలదని నిశ్చయించును. ఇట్లన్వయాంశముతోఁగూడిన పదార్థమభిధావృత్తిచే నాత నికి గోచరమగుచున్నది. ఇట్లు వీరి మతమున వాక్యార్థమనబడు తాత్పర్యా ర్థము వాచ్యముకన్న నతిరిక్తము కాదు. అభిహితాన్వయవాదులు నైయాయి కులుఁ భాట్టులు నగుదురు. అన్వితాభిధానవాదులు ప్రాభాకరులు. మూల ములో "అభిహితాన్వయ వాదినాం మతం" "అన్వితాభిధాన వాదినః" యని పూర్వమతమున బహువచనమును పరమతమున నేకవచనమును గలదు. మొదటి మతమున నేకులుఁ గ్రహింతురని బహువచనమున నానూచితము. మతాంతరమున బహ్వనుగ్రహము లేదని యేకవచనమున ధ్వనితము.

★ "సర్వేషాం ప్రాయశోఽర్థానాం వ్యంజకత్వమపీష్యతే".

తత్ర వాచ్యస్య యథా;

మాతర్గృహోపకరణమద్య ఖలు నాస్తీతి సాధితం త్వయా
తద్భణ! కింకరణీయం? ఏవ మేవ న వాసరః స్థాయీ.

అత్ర స్వైరవిహారార్థినీతి వ్యజ్యతే.

## వాచ్యము వ్యంజక మగుట

వ్యంజకత్వమనునది కేవలము శబ్దమునకే కాదు. అర్థమునకును వ్యంజ కత్వము కలదు. వాచ్యాద్యర్థములు మూడును కావ్యోపయోగులు. అట్టి విశేషము వానియందుండుటయు ప్రదర్శనీయము. అప్పుడే వ్యంగ్యము సర్వాకారమునఁ బ్రసాధిత మగును. అప్పుడెట్టి భంగశంకయు నుండదు.

ఈ భావమును సూచించుటకే యీ కారికా ఖండము సమర్థము. సామాన్య ముగా వాచ్యలక్ష్యవ్యంగ్యము లను నర్థముల కన్నిటికి వ్యంజకత్వముకూడ సమ్మతము. అని కారికార్థము. వ్యంజకత్వముకూడ నుండు ననుటచే వాచ్యాది రూపమున నవియుండుట స్పష్టము. వాచ్యాదులు సమయౌచిత్య మున నెప్పుడేని యొకప్పుడు వ్యంజకములగునే కాని ఎల్లప్పుడవి వ్యంజ కము లగుట కాదు. వ్యంజక శబ్దము వ్యంగ్యము గోచరింపఁజేసినట్లు ఒకచో వాచ్యార్థమును గోచరింపఁజేయును. వేరొకచో వ్యంగ్యార్థమె వ్యంజకమై వేరొక వ్యంగ్యము నభివ్యక్తము చేయుటయుఁగలదు. ధ్వన్యాచార్యు లీయం శమును స్పష్టముగా నంగీకరించినారు. వక్తృబోద్ధవ్యాదివైశిష్ట్య మున్నప్పుడె వాచ్యాదులు వ్యంజకములు కాఁగలవు. మూలములో "ప్రాయశః" అని ప్రాయోవాదమును సూచించుటచే ప్రధానమయిన రసాదికము వ్యంగ్యా ర్థమె యయినను వ్యంజకము కాక పోవచ్చు"నని సూచితము. సర్వా కారప్రధానమగునది వ్యంజకము కాఁజాలదు. ఇట్లు వ్యంజకత్వము కేవల శబ్దమునందె కాక వాచ్యార్థములందు నుండు ననుటచే నభిధాదులకన్న వైధ ర్మ్యము సూచితము.

ఉదా:— అమ్మా! ఇంటిలో వస్తువు లేమియు లేవని కిపుడే చెప్పితివి. నేను ఏమిచేయవలయునో చెప్పుమమ్మా! దినమిట్టె యుండదు కదా! వాచ్యలక్ష్యవ్యంగ్యార్థములలో వక్తృవైశిష్ట్యమువలన వాచ్యార్థము వ్యంజక మగుట కిది యుదాహరణము. అర్థమునకుఁగల వ్యంజకత్వము నుదా హరించుటకు వాస్తవముగా నిది యదను కాదు. శబ్దవ్యంజకత్వమున కుదా హరణములను నిరూపించిన పిమ్మట సవిస్తరముగాఁ దృతీయోల్లాసము నందర్థవ్యంజకత యుదాహృతము కాగలదు. అర్థవ్యంజకత యుండునా? యుండదా? యన్నశంకాగ్రస్తమగునని యిచట సంక్షేపముగా నుదాహృత మగుచున్నది. శబ్దవ్యంజన సకల సమ్మతము. అర్థవ్యంజనలో విప్రతిపత్తి యుండవచ్చును. అందువలననే శబ్దవ్యంజన నుదాహరింపకయె మొదటగా నర్థవ్యంజన నుదాహరించుట సముచితమనియు నభ్యూహ్యము.

ఈ పద్యము తరుణ యువతీ వాక్యము. ఆతరుణి పూర్వప్రవృత్తి నాలోచించినచో నామె కొంతగా నసాధువ్యాపారయని యూహింప వచ్చును. ఇట్టి వక్తృవైశిష్ట్యమును మొదట గుర్తించిననె వాచ్యార్థము

ద్వారా వ్యంగ్యార్థము గోచరించును. ఓ యమ్మా! కూర మొదలయిన గృహోపకరణము లేదని నీవే చెప్పితివి. కావున నిపుడాదేశింపుము. నన్నే దేని పనికిఁ బంపెదవు. నేనేమి చేయవలయును? ఈ విధముగనే దివస మంతయు గడచెను గదా! ఇది వాచ్యార్థము. ఈ యర్థము వ్యంజకమై యర్థాంతరము గోచరింపఁ జేయవలయు నన్న ఆ పలికెడి తరుణి పురుష విశేషాభిసారము నపేక్షించుచున్నదని మొదట నిశ్చితము కావలయును. ఇదియె వక్తృవైశిష్ట్యము. ఇది యాధారముగా నీ చెప్పఁబోవు వ్యంగ్యమవభాసించును. గృహోపకరణము లనఁగ నత్యంత మావశ్యకములు. అవి ప్రాతివేశిని (ప్రక్క యింటివారామె) కడనుండి తీసికొని వచ్చుటయుఁ గుదురదు. అవశ్యోపకరణము లన్నియుఁ బ్రక్క యింటిలో నుండవు కదా! అవి యింటిలో లేవని తల్లియె చెప్పుటచే నిఁక సందేహింపవలసిన యవసరము లేదు. అది యలంఘనీయమైన యాజ్ఞ. ఇంటిలో నేమాత్ర ముపకరణము లేకుండుటను తల్లి నేఁటికి నేఁటికే చెప్పినది. ఆ తరుణి యట్లు చెప్పలేదు. ఇంటి పెద్దయే చెప్పుటచే సందేహావసరము లేదు. ఆమె చెప్పి తీసికొని రమ్మనినఁ గాని యాపనికిఁ దరుణి చేయదు. నేను నీయాజ్ఞానువర్తిని. తీసుకుని రమ్మని నీవు చెప్పకున్న నేను చేయుట యెట్లు? అత్యంతము సాయంకాలమయిన నిమ్ముగ నీవు చెప్పినచో నేను కదలఁగలను కదా! "నీవు వెళ్ళుమన్నను నే నెట్లు వెళ్ళెదను?" అని యవభాసించు వాక్యార్థము. ఈవాక్యార్థావబోధ కలుగఁగనే "ఈ తరుణి స్వైరవిహారము కోరుచున్నది." అని వ్యంగ్యార్థము ప్రతీతమగును. ఈ యర్థమునందు శబ్దవ్యాపారము లేదు. శబ్దవ్యాపారము వాచ్యార్థమును ప్రతిపాదించి విరతమైనది. అర్థమున కితర వ్యాపారము లుండవు. వ్యంజకత్వము మాత్రమె దానియందుండును.

★ లక్ష్యస్య యథా:

సాధయంతీ సఖి సుభగం క్షణే క్షణే దూనాసి మత్కృతే
సద్భావ స్నేహ కరణీయ సదృశకం తావద్విరచితం త్వయా.

అత్ర మత్ప్రియం రమయంత్యా త్వయా శత్రుత్వమాచరితమితి లక్ష్యం, తేన చ కాముకవిషయం సాపరాధత్వప్రకాశనం వ్యంగ్యం.

### లక్ష్యార్థమునకు వ్యంజకత్వము

ఉదా:— సఖీ! నాకొఱకై సుభగుని సాధించుచు క్షణము క్షణము వ్యథపడితివి గదే. సద్భావముతో స్నేహముతో చేయవలసిన దానికి తగినట్లుగా నీవు చక్కగా చేసితివే!

బోద్ధవ్యవైశిష్ట్యము ననుసరించి యిందు వ్యంగ్యము గోచరమగును. ఒక నాయిక ప్రియుని యనుసరించుటకై తన దూతికను పంపినది. ఆదూతి యతనినె యనుభవించివచ్చినది. అట్టి యా దూతిని నాయిక పలుకుచున్నది. ఆదూతి యిచట బోద్ధవ్య. ఆమెయందలి విశేషము గుర్తించిన సహృదయులకే యర్థాంతరమవభాసించును. ఓ! సఖీ! నాకొఱకై యా సుభగ నాయకుని అనునయించుచు క్షణక్షణమున ఖిన్నవయినావు కదా! నీవు సద్భావమునకు స్నేహమునకుం దగినట్లు చేసితివిలే! ఇది వాచ్యార్థము. ఈ దూతి నాదు ప్రియునే యనుభవించి యా యుపభోగ చిహ్నములతో నిట్లు వచ్చినదని నాయిక గుర్తించినది. విపరీత లక్షణ మర్యాదచే — "నా ప్రియుని గూడి రమించిన నీవు నాకు శత్రుత్వమాచరించితివి." యని లక్ష్యార్థము కలుగును. ఈ లక్ష్యార్థము వ్యంజకమై వ్యంగ్యార్థము నవభాసింపఁజేయును. "తానంతగా వలచిన కాముకుడును దూతీభోగమొనర్చి యపరాధియయి నాడు. అట్టి నాయకునితో నిఁక నాకు మాత్రమేమిలే! దూతియు నిట్లు కార్యమాచరించి నాకు శత్రువయినది. నాశత్రువున కుపభోగమిచ్చిన నాయకుడును శత్రుమిత్రమగుట అపరాధియె యగును. ఇట్లు కాముక విషయమయిన సాపరాధత్వము ప్రకాశితమగు చున్నదని సహృదయులు గుర్తింపగలరు.

★ వ్యంగ్యస్య యథా:

పశ్య! నిశ్చలనిష్పందా బిసినీపత్రే రాజతే బలాకా
నిర్మల మరకత భాజనపరిస్థితా శంఖశుక్తిరివ.

అత్ర నిష్పందత్వేన ఆశ్వస్తత్వం, తేన చ జనరహితత్వం, అతః సంకేతస్థానమేతదితి కయాచిత్కంచిత్ప్రత్యుచ్యతే, అథవా; మిథ్యా వదసి! న త్వమత్రాగతోఽభూరితి వ్యజ్యతే.

### వ్యంగ్యార్థమె వ్యంజకమగుట

వ్యంగ్యార్థమునకును వ్యంజకము కలదని యీ పద్యములో స్ఫుటమగును. పూర్వపద్యములలోకన్న నీ పద్యమున నొక విశేషము కలదు.

కీని వలన కలుగు ప్రతీతు లనేకము లున్నవి. ఈ ప్రతీతి కక్ష్యాక్రమము నను సరించిన వ్యంజకత్వమువలన కలుగును. సుభగత్వాభిమానియగు నొక నాయకు డుపనాయికతో నిట్లనుచున్నాడని ప్రకరణార్థము గుర్తింపవచ్చును. సుభగత్వాభిమానిని యయిన యొక కామిని యుపనాయకుని గురించి యిట్లు పలుకుచున్నదనియు ప్రకరణార్థ మూహింపవచ్చును. మొదటి యర్థమున నాయకారబ్ధ శృంగారమున్నది. రెండవ యర్థములో నాయికారబ్ధశృంగారము కలదు. నాయికారబ్ధ శృంగారమునందే ప్రకర్షయుండుట దానినే ప్రకాశముచేయుట సముచితము.

కమలినీ పత్రమందు బలాకాపక్షి విరాజిల్లుచున్నది. నీవు చూడుము. అది నిశ్చలము నిష్పందము నైయున్నది. అది కదలుట లేదు. ఇతరులు దానిని కదిలించుటయు లేదు. నిర్మల మరకత భాజనమందున్న శంఖ శుక్తివలె నది రమణీయముగా నున్నది. ఈ పద్యమునందు నిష్పందత నిరూపితమగుటచే నా స్థలము విశ్వసింపదగిన దని బాహ్యసంక్షోభమేమియు లేదని యభివ్యక్త మగును. ఇట్లు వ్యంగ్యమయిన యర్థము "అప్రదేశము జనరహితము" అను వ్యంగ్యమును స్పష్టము చేయును. "మన కదియే సంకేతస్థానము." అని నాయిక సంకేతస్థాన మభిలషించు నుపనాయకుని గురించి చెప్పిన దనియు దాన వ్యంగ్య మగును. విశ్వాస యోగ్యతా రూప మయిన వ్యంగ్యము వ్యంజక మై జనరహితత్వ స్వరూప మయిన వ్యంగ్యము నభివ్యక్తము చేయుచున్నందున వ్యంగ్యార్థమునకు వ్యంజకత్వ ముండుట సుగ్రహము.

సంభోగ శృంగారమున కన్న విప్రలంభ శృంగారమునకు ప్రకర్ష కలదు. అందుచే నీ పద్యమును విప్రలంభపరముగా నన్వయించుటయు సముచితము. ఒక హాలికస్నుష గ్రామతరుణుని ప్రేమించినది. ఆ యువకుడు "బిసినీషండమునందు నిన్ను వెదకి వెదకి వచ్చితిని" అని యనెను. ఇక హాలికస్నుష యిట్లనుచున్నది. "నీవసత్యము చెప్పుచున్నావు. ప్రత్యక్షముగా గన్పడు బిసినీషండమునకు నీవు రానే లేదు. అచట బలాక నిష్పందమై యున్నదె కదా! నీవచటకు జేరియున్నచో బలాక నిశ్చల నిష్పందమై యుండునా? కావున నీవు చెప్పునది యసత్యము" అని. ఈ యర్థము విశ్వసనీయతా రూప మయిన వ్యంగ్యముచే నభివ్యక్తమగుచున్నది. ఇందును వ్యంగ్యమున కొక వ్యంజకత స్పష్టము.

★ వాచకాదీనాం క్రమేణ స్వరూపమాహ.

"సాక్షాత్సంకేతితం యోఽర్థ మభిధత్తే స వాచకః"

ఇహాగృహీతసంకేతస్య శబ్దస్యార్థ (విశేష) ప్రతీతేరభావా త్సంకేతసహాయ ఏవ శబ్దోఽర్థవిశేషం ప్రతిపాదయతీతి యస్య యత్రావ్యవధానేన సంకేతో గృహ్యతే స తస్య వాచకః

వాచక స్వరూపము

ద్వితీయ ప్రారంభములో వాచకాదిశబ్దములు నిరూపితములు. వాని స్వరూపములు మున్ముందు సూచితము లగునని యచట ప్రతిజ్ఞాతము. తన్నిరూపణమున కిది యవసరము. ఇటుపై క్రమముగా వాచకాదులు నిరూపితము లగును. ఈ కారికాఖండము వాచకశబ్దమునకు లక్షణము. సాక్షాత్సంకేతిత మయిన యర్థము నభిధానించు శబ్దమునకు వాచక మని పేరు. ఇది సామాన్యముగా గారికార్థము.

ఈ శబ్దమున నీ యర్థమును బోధింప వలయునను ఈశ్వరేచ్ఛ సంకేతము. ఈ సంకేతమును గుర్తింపక పోయినచో శబ్దార్థ మేమో తెలియుట శక్యమే కాదు. కావున సంకేతరూప మయిన శబ్దార్థముల స్వరూపమును అర్థజ్ఞానమున నవశ్యముగా నంగీకరింపవలయును. హస్తముఖాదిచేష్టల ద్వారమున గూడ నర్థజ్ఞానము కలుగవచ్చును. అందు వాచకలక్షణమున కతివ్యాప్తి కలుగరాదు. అందునకె లక్షణము నందు సంకేతిత పదము సార్థకము. హస్తపాదాదిచేష్ట లర్థమున సంకేతితములు కావు కదా! అదియుఁగాక; రచనలో గూర్పు పొందు వర్ణములు మాధుర్యాదిగుణముల నభివ్యక్తము చేయును. ఆ వర్ణములు మాధుర్యాద్యర్థమును జెప్పి నట్లాయి నది. వాచకలక్షణమున కిచటఁ గూడ నతివ్యాప్తి కలుగ రాదు. ఆ యా వర్ణములు మాధుర్యాదులయందు సంకేతితములు కావు.

సంకేతిత మనుచోట "సాక్షాత్" విశేషణము నవసరము. చూడుడు! శబ్ద మొకటియె యైనను ఒక్కొకచో రెండర్థములను జెప్పుచున్నది. "వటము" అను శబ్దమునకు వృక్షమని యర్థము. ఆ శబ్దమె యొకప్పుడు వటవృక్షము గల గ్రామమును జెప్పును. ఈ రెండర్థములలో వృక్షమను నర్థమె సాక్షాత్ప్రతిపాదితము. గ్రామరూపార్థము వ్యవధానముగ లక్షణచే గోచ

## సంకేతితార్థభేదములు

పూర్వము సాక్షాత్సంకేతితమును జెప్పు శబ్దము వాచక మని నిరూపిత మయినది. ఆ సంకేతితార్థమన నెట్టిది? సంకేతితముల లోని విభాగములు తెలియక పోయినచో శబ్దమునకు గల సంకేతితార్థాభిధాయకత గోచరమే కాదు. కాన సంకేతము సవిభాగముగా దీనిలో నిరూపిత మగును. సంకేతితార్థము జాతి, గుణ, క్రియ, యదృచ్ఛాత్మకముగ నాలుగు విధములు. ఇట్టిది చతుర్భేదమని మహాభాష్యకారుల మతము. సంకేతితార్థము జాతి రూప మగునది యొకటె. అందు గుణ క్రియా యదృచ్ఛా భేదములు లేవు. అను రెండవ మతమును మీమాంసకు లంగీకరింతురు. ఈ కారికలో సంకేతితవిషయమై జాత్యాదిపక్ష మొకటియు, జాతిపక్షము వేరొకటియు నాసూత్రిత మయినది. కారికలోని చివర నున్న "వా" శబ్దము స్పష్టానుక్తము లయిన రెండు మతములకు సూచకము. అవి యంతగా విచార్యములు కావని వాని యవసరము ప్రకృతమున లేదని కేవలము "వా" శబ్దముననే వికల్పపక్షములుగా సూచితము లయినవి.

## జాత్యాదిమతము

కారికలో జాత్యాదిమతము మహాభాష్యకార సమ్మత మయిన మొదటి మతము. ఆక్షేపపురస్సరముగా దత్ప్రతిష్ఠానము నిట్లు గుర్తింపవచ్చును.

## వ్యక్తిశక్తివాదము

సంకేతము వ్యక్తియందు జేయుటయే యుక్తము. ఆనయనము బంధనము మొదలగు నర్థక్రియలలో నిర్వాహకముగా నుండునది వ్యక్తియె దుగ్ధాది రూపమగు ప్రయోజన క్రియాకారియు వ్యక్తియె. ప్రవృత్తిలో గాని నివృత్తిలో గాని వ్యక్తియె విషయమై యుండి యోగ్యత కలదగును. "గామానయ" అను వ్యవహారములో "ఆనయన-బంధన" రూపమున నర్థక్రియార్హమైనది వ్యక్తియె గదా! పురుషప్రవృత్తి నివృత్తులలో వ్యక్తియే యుక్తమై యున్నది. కాని జాత్యాదులు కావు. కావున వ్యక్తియందె సంకేత మొనర్ప వలయును. నిష్ఫలమయిన జాత్యాదులందు సంకేత మొనర్పరాదు. అని యాక్షేపణ నిష్కర్ష.

దీని కిది సమాధానము :— వ్యక్తు లనంతములు. సర్వవ్యక్తులందు సంకేత మొనర్చుట శక్యము కాదు. ఏది యేని యొక వ్యక్తియందు సంకేత మొనర్చిన వ్యభిచార మను దోషము కల్గును. సర్వవ్యక్తులందు సంకేత మంగీకరించుట అనంత్య మను దోషము వాటిల్లును. ఈ రెండు దోషము లున్నందున వ్యక్తిసంకేతము శక్యక్రియ కాదు.

వ్యక్తి శక్తి వాదఖండనము

దీని వివరణము నిట్లు గుర్తింప వలయును. గోపదము నుచ్చరించి నప్పుడా పదముచే గుర్తింపదగిన యంశమేది? గోవ్యక్తి యందే ఆ పద మునకు శక్తి కలదని వ్యక్తి శక్తినె యంగీకరించినచో నానంత్యమన్న దోష మొకటి వాటిల్లును. గోవ్యక్తు లనంతములుగా నున్నవి. ఒక్కొక వ్యక్తి యందొక్కొక్క శక్తి నంగీకరింప వలసి యుండును. వ్యక్తు లెన్ని కలవో శక్తు లన్ని యగును. వ్యక్త్యానంత్యము వలన శక్త్యానంత్య మిట్లు సిద్ధమైన ఈ అనంతశక్తి కల్పనము వలన గౌరవ దోష మున్నది కదా!

"గామానయ" యని వృద్ధుఁడు ప్రయోగించి నపుడు కంటి యెదుట నున్న గోవును గుర్తించిన మధ్యముఁడు తదితర గోవులను గోపదశక్యము లనుగా బుద్ధిలో నవభాసింపజేసికొనును. వ్యక్తియందే సంకేతము గృహీత మయినప్పుడు సంకేతితములు కాని యితర గోవులును అతని బుద్ధిలో భాసిం చుట యెట్లు కుదురును? శక్తివేద్య మగునట్టిదే శాబ్దబోధలో భాసింప వలెనని నియమము. మధ్యమునకు బుద్ధిలో భాసించిన గోవు లగృహీత సంకేతములే కదా! అగృహీత సంకేతము లయిన వానికిని శాబ్దబోధలో భానముండునేని "గామానయ" యనినపుడు మహిషానయనమును అర్థము కావచ్చును. అసంకేతిత మయిన గోవు భాసించి నట్లె యసంకేతితము లయిన మహిషాదులును భాసింప వచ్చును గదా! కావున నీ యానంత్య వ్యభిచారదోషములు వ్యక్తిసంకేతవాదమున దురుత్తరము లగుచున్నవి. కాన వ్యక్తియందు సంకేత మొనర్చుట యుక్తము కాదు.

ఈ వాదమున వేరొక దోషమును గలదు. ఈ చూపిన దోషద్వయ మున సంకేత మొనర్చుటలో ననుపపత్తి కనుపడుచి నట్లయినది. ఈ చెప్ప బోవు దోషమున, ఎట్లేని పట్టుదలతో వ్యక్తిసంకేత మొనర్చినను వ్యవహా రము కుదురదని చెప్పనగును.

“గౌః శుక్లః, చలః, డిత్థః” అను విషయ విభాగము లోకమున నున్నది. వ్యక్తిశక్తినె యంగీకరించినచో నీ విషయవిభాగ ముపపన్నము కాదు. ఉపాధి యందు సంకేతము గ్రహించినచో గోత్వజాతి కలది, శుక్లత్వగుణము గలది, చలత్వక్రియ కలది, డిత్థమను పేరు కలది, యని యొకే వ్యక్తి నాలుగుపదములచే వ్యవహృతము కావచ్చును. వ్యక్తిసంకేత మునె చేసితిమేని; గోవాక్కుటియె శుక్ల, చల, డిత్థ పదములచే జెప్పబడ వలసిన దగును. అపు డీ పదము లన్నియు పర్యాయపదములె యగును. పర్యాయ పదముల నెవరును వరుసగా నుపయోగింపరు గదా! కర, హస్త, పాణి, పదములు పర్యాయ పదములు. అట్టి వానికి సహప్రయోగ ముపపన్నము కాదని స్పష్టము. గౌః, శుక్లః, మొదలయిన జాతిగుణాది వచనములలో వ్యక్తిమాత్రమె సంకేతితార్థమని యంగీకరించినచో జాతిగుణాది విభాగ మెట్లును ప్రతీతము కాదని స్పష్ట మయినది. అన్నిటను “వ్యక్తి వ్యక్తి” యని యుక్తమే నిరుక్త మైనట్లగును. కావున వ్యక్తి శక్తి వాదమును విడిచి పెట్టి జాత్యాది శక్తి వాదమునే యంగీకరింప వలయును.

### ఉపాధిసంకేతము.

ఉపాధియందే సంకేతమును గుర్తింప వలయును. ఉపాధివాది మతమున జాతి, గుణ, క్రియా, యదృచ్ఛా శబ్దములకు భేదముండును గాన “గౌః, శుక్లః, చలః, డిత్థః” యనునవి పర్యాయములు కావు. కావుననే వాని సహప్రప్రయోగమును సూపపన్నము. కాఁగా వ్యక్తికి సంబంధించిన యుపాధిరూప మయిన ధర్మమునందే సంకేత మొనర్పవలయును. ఉపాధి యందొనర్చిన సంకేత ముపాహిత వ్యక్తియందు ప్రవృత్తి నివృత్తులను సంపాదింప గలదని తాత్పర్యము.

★ ఉపాధిశ్చ ద్వివిధః. వస్తుధర్మో వక్తృయదృచ్ఛా సన్నివేశితశ్చ, వస్తుధర్మోపి ద్వివిధః సిద్ధః సాధ్యశ్చ సిద్ధోఽపి ద్వివిధః పదార్థస్య ప్రాణప్రదో విశేషాధానహేతుశ్చ. తత్రాద్యో జాతిః ఉక్తం హి వాక్యపదీయే; “న హి గౌః స్వరూపేణ గౌః, నాప్యగౌః, గోత్వాభిసంబంధాత్తు గౌః” ఇతి. ద్వితీయో గుణః, శుక్లాదినా హి లబ్ధసత్తాకం వస్తు విశిష్యతే. సాధ్యః పూర్వాపరీభూతావయవః క్రియారూపః. డిత్థాదిశబ్దానామన్త్యబుద్ధినిర్గ్రాహ్యం సంహృత

క్రమం స్వరూపం వక్త్రా యదృచ్ఛయా డిత్థాదిష్వర్థేషూపాధిత్వేన సన్నివేశ్యతే ఇతి సోయం సంజ్ఞారూపో యదృచ్ఛాత్మక ఇతి. “గౌః శుక్లః చలో డిత్థ ఇత్యాదౌ చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తి” ఇతి మహాభాష్యకారః, పరమాణ్వాదీనాం తు గుణమధ్యపాఠాత్పారిభాషికం గుణత్వం.

### ఉ పా ధి వి భా గ ము.

ఉపాధి రెండు విధములు. వస్తుధర్మము వక్తృయదృచ్ఛా సన్నివేశితము అని. వస్తుధర్మమును రెండు విధములు. సిద్ధము, సాధ్యము అని. సిద్ధవస్తు ధర్మమును ద్వివిధము. పదార్థమునకు ప్రాణప్రద మగునది యొకటి. విశేషము నాధానించుటలో హేతువు రెండవది. ప్రాణప్రద మగునది జాతి. రెండవది గుణము. సాధ్యమగు వస్తుధర్మము క్రియారూపము. సంజ్ఞారూపముగా నుండునది వక్తృయదృచ్ఛా సన్నివేశిత మయిన యుపాధి.




### జాతి

జటిలమయిన యీ సూత్రభాష నిట్లు విస్పష్టముగా గుర్తింపవచ్చును. వస్తుధర్మ మనునది వస్తువులందు నైసర్గికముగా నుండు జాతి, గుణ, క్రియా రూప ధర్మము. వక్తృయదృచ్ఛా సన్నివేశిత మగునది వాస్తవముగా వస్తువు లందుండదు. అయినను వ్యవహర్త యగు వ్యక్తి నిర్నిబంధనముగా దన యిచ్ఛానుసారమున నా యా వస్తువులందు దాని సన్నివేశింప జేయును. చైత్ర మైత్ర దేవదత్తాది నామ రూప మయిన సంజ్ఞగా నది యుండును.

వస్తుధర్మము సిద్ధ సాధ్య రూపమున నుండు ననుటలో సిద్ధమనునది పూర్వమే నిష్పన్నమై యున్నదని, సాధ్య మనునది నిష్పాదింప వలసి నట్టి దని గ్రహింప వలయును. సిద్ధవస్తు ధర్మములో ప్రాణప్రద మగునది జాతి. ప్రాణ ప్రదమనుట స్వరూపలాభ హేతు వని భావము. ప్రాణప్రదము వలె నుండు నది కావున నిది ప్రాణప్రదము. అది లేకున్న వస్తువునకు స్వరూపమే సిద్ధిం పదు. ప్రాణనమే ప్రాణము. అనగా వ్యవహార యోగ్యత. దానిని నిర్వ హించునది "ప్రాణం వ్యవహారయోగ్యతాం ప్రదదాతి సంపాదయతి" అని వ్యుత్పత్తి. ఆ వస్తు వుండు నంతవర కది సంబంధించి యుండును. నిఖిల వ్యక్తులందుండునట్టి జాతియె యిది. ఉపాధి జాతి యనునవి యర్థాంత రములు కావు. భర్తృహరి పదవాక్యముల తత్త్వము నిరూపించు వాక్య పదీయ గ్రంథమున నిది ప్రాణప్రద మగుటను నిరూపించినాడు. ఈ యంశ మున ప్రామాణిక సంవాద ముండుటయు గుర్తింప వచ్చును.

"న హి గౌః స్వరూపేణ గౌః, నాప్యగౌః
గోత్వాభిసంబంధాత్తు గౌః"

ఇది వాక్యపదీయ వాక్య మని యీ విషయమున ప్రామాణికముగా నుదాహరింతురు. ఈ రూపముననే వాక్యపదీయమున నిది కనబడుట లేదు. దీని యర్థమిది. గోవు స్వరూపమున తన వ్యక్తిరూపముగా "గోవు" అను వ్యవహార ప్రయోజకము కాదు. ఉపాధి రహిత మయిన గోవ్యక్తి యందు గోపదమును ప్రయోగించినచో ఘటము నందును గోపదమునే ప్రయో గింప వచ్చును కదా! ఏదో యొక స్వరూపమున నది రెండిటను గలదు. కాన వ్యక్తి ననుసరించి గోత్వరూపమగు జాతి యచట లేనందువలన నది గోవ్యవహారము సాధింప జాలదు. జాతి నభివ్యక్తము చేయు సాస్నాది విశేషములు లేనట్టి కేవలపిండమాత్రమున గోచరమగునట్టి దాని ననుసరించి గోవని వ్యవహరించుట శక్యము కాదు. కాఁగా "గోవు" అన్న వ్యవ హారమునకు వ్యక్తి ప్రయోజకము కాదని భావము. అది గోభిన్న మనియు వ్యవహరించుటకు శక్యము కాదు. అట్టి దానిని జూచి యశ్వమహిషాది వ్యవహార మొనర్పము. గోవనుటకు ననకపోవుటకును వ్యక్తి నిబంధనము కాదు. అశ్వాది జాత్యంతరము లచట కూడి యుండలేదు. కాఁగా జాతియే స్వరూపసిద్ధి హేతు వగుచున్నది. కాన గోత్వాది సంబంధముననే గోవు

గో వగును. గోత్వము కలదని గుర్తించిననే గోవు గోశబ్ద వ్యవహార్య మగు నని భావము. ఈ వస్తుధర్మము పదార్థమునకు స్వరూపసంపాదక మైనందున ప్రాణప్రద మగుచున్నది.

## గుణము

రెండవ వస్తుధర్మము విశేషాధానహేతువు. ఇది యితరవస్తువుల కన్న ప్రకృతమునకు వైలక్షణ్యమును సంపాదించును. ఇట్లు విశేషాధాయక మయిన యుపాధియె గుణము. ... జాతిచే వ్యవహార యోగ్యతను బొందిన వస్తువు సిద్ధస్వరూపము, లబ్ధసత్తాకము నగును. శుక్లత్వము నీలత్వము మొదలగు గుణములచే విశేషిత మయిన వస్తువు సజాతీయము లగు నితరవస్తువుల నుండి వేరుగా నగును. మొదట వస్తువునకు జాతిచే స్వరూపము సిద్ధమైన పిమ్మట సంబంధించి యుండు గుణము విశేషము నాధానించును. ఈ గుణ మనంతరము కలుగునే కాని మొదట జాతితో సహభావి కాదు. సహభావియే యయినచో "ఘటమున రూపము కలదు" అను ప్రతీతియే కుదరదు. గగనకుసుమము వలె నసద్వస్తు వెన్నడును విశేషితము కాలేదు కదా!

## క్రియ

సాధ్య మయిన యుపాధి క్రియారూపము. సాధ్యముగా బ్రతీయ మాన మగుటయే క్రియయొక్క రూపము. సాధ్యత్వమన "ఉత్పాద్య మానత్వము" అని వైయాకరణు లంగీకరించిరి. "వండుచున్నాడు" అని నప్పుడు స్థాలీసమ్మార్జనము చేయుట మొదలుగా (అధిశ్రయణాద్యవ తారణాంతము) దింపుట వఱకు ననేక పరిస్పందములు కలవు. వానిలోఁ గ్రియ యనునది యేది? పూర్వాపరీభూతావయవములు కల సమూహ మంతయు నొకే క్రియ యగును. ఒక క్రియలోఁ గొన్ని పూర్వావయవ ములు కొన్ని యపరావయవములు. ఇట్లు వానిలో నొక క్రమ మున్నది. ఈ క్రమోపలక్షితమయిన క్రియయె యిచట వివక్షితము, క్రియోపాధి యెల్లపుడును సాధ్యరూపముననే యుండును.

## యదృచ్ఛ - సంజ్ఞ - ద్రవ్యము.

వక్తృయదృచ్ఛా సన్నివేశిత మగునది నాల్గవ యుపాధి. వక్త యగువాడు తన యిచ్ఛానుసారమున సంజ్ఞారూపమగు నుపాధిని సన్నివే

శింప జేయును. ఒకని చైత్రు డని గాని మైత్రు డని గాని యెన్ని నప్పుడు ఆ నామశబ్దముల స్వరూపము అంత్యవర్ణబుద్ధి నిర్గ్రాహ్యముగ నుండును. ఉత్తరోత్తర వర్ణముల నుచ్చరించు సమయమందు పూర్వపూర్వ వర్ణములు వినాశము పొందును. అప్పుడు చైత్రాది శబ్దముల స్వరూపము తుదకు గల్గు వర్ణబుద్ధిచే స్పష్ట మగును. పూర్వపూర్వ వర్ణము నశించినను వాని వలన నొక సంస్కార ముత్తరోత్తర వర్ణమునం దుదయించును. ఆ యా వర్ణ సంస్కారముతో గూడుకొనిన బుద్ధి చైత్రాది సంజ్ఞాశబ్దరూపము నవగతము చేయును. తుదకు గోచరము లయిన యా వర్ణములందు గ్రమము లేదు. అందలి క్రమ మంతయు నుపసంహృత మగును. ఉచ్చారణ కాలములో గోచరించు క్రమము అనుసంధాన సమయము నం దుపయోగింపదు. ఆ క్రమమే యిచట నుండు ననుట విరుద్ధము కూడదు. వ్యంజకము లయిన ధ్వనులకు గ్రమ మున్నది. వ్యంగ్యమైన స్ఫోట రూపమున గ్రమము లేదు. ఇట్లి సంహృతక్రమ మయిన వర్ణసముదాయరూప మగు స్వరూపమును వక్త స్వతంత్రముగా గూర్చును. ఇది లోకవ్యవహారము సాధించునది యగును. వక్త ప్రవృత్తి నివృత్తులను బరిశీలింపకయే స్వతంత్రముగా నిట్లు వ్యవహరించును గాన యదృచ్ఛాశబ్ద మని దీని పేరు. దీనినే సంజ్ఞాశబ్ద మని ద్రవ్యశబ్ద మని యందురు.

ప్రాణపదమగు జాతి, విశేషాధానహేతు వయిన గుణము, సాధ్యమైన క్రియ, యదృచ్ఛాశబ్దము అని యుపాధి నాల్గు విధములుగా నిర్ణీతమయినది. మహార్థము గల యీ శాస్త్రసరణి ననుసరించియె మహాభాష్యకారుడు పతంజలి "పాణిని" సూత్రభాష్యము నందు "గౌః శుక్లః చలో డిత్థః" "ఇత్యాదౌ చతుష్టయీ శబ్దానాం ప్రవృత్తిః" అని యనినాడు. అర్థము లందలి శబ్దముల ప్రవృత్తి, ప్రవృత్తినిమిత్త భేదముల ననుసరించి యిట్లు నాల్గువిధములుగా నుండును. ఉపాధి నాల్గువిధములు. కాగా శబ్దమును నాల్గు విధము లగునని భావము.

## పరమాణుత్వము – జాతి.

ఈ చెప్పిన విధానము ననుసరించి చూడగా పరమాణుత్వము మొదలగునది జాతి యని చెప్పదగి యున్నది. అందుచే బరమాణ్వాది శబ్దములును జాతి శబ్దములె యగును. కాని వైశేషిక శాస్త్ర మందది గుణశబ్ద

మని వ్యవహార మున్నది. వాస్తవముగా నది ప్రాణప్రద మగుట వలన జాతి వాచకమే కావలయును. పరమాణ్వాదులను గుణమధ్యమునఁ జదించుట యుపపత్తి సహము కాదు. వారు చెప్పు గుణత్వము కేవలము పారిభాషికము మాత్రమే. పరిమాణము నాల్గు విధములు. అణు పరిమాణము, మహత్పరిమాణము, హ్రస్వపరిమాణము, దీర్ఘపరిమాణము నని. ఆ పరిమాణమునే పరమాణువనియు పరమమహత్తనియు జెప్పుట కలదు. పరమాణు పరిమాణము పరమాణు ద్రవ్యమునకు ప్రాణప్రదము. పరమాణు ద్రవ్యము పరమాణు పరిమాణము లేక స్వరూపమునే పొందనేరదు. అశ్వత్వము లేక అశ్వవ్యక్తి స్వరూపము పొంద జాలదు కదా! పరమాణు పరిమాణము లేక పరమాణు ద్రవ్యమునకు వేరొక పరిమాణ మేదేని యుండుచో బరమాణు ద్రవ్యస్వరూపము లుప్తమే యగును. ఇట్లె యాకాశాది విభుద్రవ్యము పరమమహత్పరిమాణము కలదిగా గ్రహింప వలయును. విభుద్రవ్యముల కన్నిటికి బరమ మహత్పరిమాణమే ప్రాణప్రదము. అందుచేఁ బరమాణుత్వమునకును, పరమమహత్త్వమునకు జాతిత్వమే యంగీకరింప వలయును. "గౌః స్వరూపేణ న గౌః నాప్యగౌః, గోత్వాభి సంబంధాత్తు గౌః" అని యన్నట్లుగా "పరమాణుః స్వరూపేణ న పరమాణుః, నాప్యపరమాణుః పరమాణుత్వ సంబంధాత్తు పరమాణుః" అని యుక్తిచే గ్రహింప వచ్చును. కాఁగా పరమాణుత్వము జాతియే యనుట యుక్తము. వైశేషికులు గుణమధ్యమునఁ బఠించుట స్వసిద్ధాంతానుసార మయిన పరిభాషా మాత్రమే.

★ గుణ క్రియా యదృచ్ఛానాం వస్తుత ఏక రూపాణామప్యాశ్రయ భేదా ద్భేద ఇవ లక్ష్యతే. యథా; ఏకస్య ముఖస్య ఖడ్గ ముకుర తైలాద్యాలంబన భేదాత్.

గుణక్రియా యదృచ్ఛ లనంతములు కదా! వ్యక్తియందు సంకేతము గ్రహించినచో నానంత్యవ్యభిచార దోషములు సంప్రాప్తము లయినట్లు గుణక్రియా యదృచ్ఛా త్రయమును గూడ ఆ దోషము లను బంధించునే! జాతి సర్వానుస్యూతమై యున్నందున నాదోషము లనుబంధింపక పోవచ్చును. ఘటశుక్లము, పటశుక్లము అని శుక్లగుణ మెన్నియో విధముల నున్నది. ఓదనపాకము, గుడపాకము నని క్రియ యనేకవిధముల నున్నది. చైత్రుని యదృచ్ఛ, మైత్రుని యదృచ్ఛ యని యదృచ్ఛయు నానా

యగును. ఇట్లు నానాత్వ మున్నప్పు డానంత్య వ్యభిచారము లెట్లు పరిహరింప నగును ?

గుణ క్రియా యదృచ్ఛలు వాస్తవముగా నేకరూపములె. ఆ శ్రయ భేదమున వాని యందు భేదమున్నట్లు కన్పడును. ముఖ మొక్కటియే యయినను అది ఖడ్గమున నొక విధముగాఁ బ్రతిబింబించును. తైలమున వేరొక విధముగాఁ బ్రతిబింబించును. ఆదర్శమున మరియొక విధముగా గోచరించును. ఖడ్గాలంబనమున ముఖము శ్యామముగా నుండును. తైలాలంబనమున స్నిగ్ధముగా నుండును. దర్పణాలంబనమున నుజ్జ్వలముగా నుండును. ఇట్లా యా యాలంబన భేదమున ముఖము నానారూపమున భాసించునే గాని యచట భేదమే లేదు. ఏకరూపమే కలదు. గుణ క్రియా యదృచ్ఛ లేకరూపములే యగుట స్వభావము.

★ హిమ పయః శంఖాద్యాశ్రయేషు పరమార్థతో భిన్నేషు శుక్లాదిషు యద్వశేన శుక్లః శుక్ల ఇత్యాద్యభిన్నాభిధాన ప్రత్యయోత్పత్తిః తత్ శుక్లత్వాది సామాన్యం గుడతండులాది పాకాదిష్వేవ మేవ పాకత్వాది. బాల వృద్ధ శుకాద్యుదీరితేషు డిత్థాది శబ్దేషు చ, ప్రతిక్షణంభిద్యమానేషు డిత్థాద్యర్థేషు వా డిత్థత్వాద్యస్తీతి సర్వేషాం శబ్దానాం జాతిరేవ ప్రవృత్తి నిమిత్తమిత్యన్యే.

జా తి మ త ము

ఇంతవరకు గారికలో నిరూపిత మయిన జాత్యాదిపక్షమును నిరూపించితిమి. "జాతిరేవ వా" యను జాతిపక్షమును నిరూపింప వలసి యున్నది. జాతిమాత్రమె సంకేతిత మని మీమాంసకమతము. గుణక్రియా యదృచ్ఛల కాశ్రయభేదమున భేద ముండుట కాదు. వాస్తవముగా వాని యందు భేదము కలదు. కావున నంతట జాతియే ప్రవృత్తి నిమిత్త మని మీమాంసక మతసారము.

హిమము నాశ్రయించి శుక్ల (తెలుపు) ముండును. శంఖాశ్రయముగా శుక్ల ముండును. జలాశ్రయముగా శుక్లమున్నది. క్షీరాశ్రయముగా శుక్ల మున్నది. ఇట్లే తత్తదాశ్రిత శుక్లము లెన్నో గలవు. హిమాశ్రయ శుక్లమె శంఖాశ్రయ శుక్లము కాదు. ఇట్లే యితర శుక్లములును భిన్నభిన్న

ములు. కావున గుణవ్యక్తులు వాని వాని యందు భిన్న భిన్నములై యగును. ఇట్లు భిన్నములై యయిన నభిన్నమయిన సంజ్ఞ లోకమున గలదు. "హిమ గుణము శుక్లమె పయోగుణము శుక్లమె శంఖగుణము శుక్లమె" యని ఇట్లు భిన్నమైన ప్రత్యయము, అభిన్నమయిన యభిధానము నహేతుకము కాదు. ఇందు హేతువు జాతియె. అదియె శుక్లత్వరూప మగు జాతి.

ఇట్లె గుడతండులాది పాకము లందును పాకత్వాది సామాన్యమును గుర్తింప వలయును. గుడపాకము తండులపాకము మొదలయిన పాకము లలో గుడపాకమె తండులపాకము కాదు. అవి వేరు వేరు. ఆ క్రియ లట్లు భిన్నములై నైనను "గుడమునకును పాకక్రియ కలదు. తండుల మునకును పాకక్రియ కలదు." అని యభిన్నాభిధాన మున్నది. ఏకవిధ మయిన జ్ఞానమును కలదు. "పాకః పాకః" అని యభిన్న మయిన యభి ధానము ప్రత్యయము నహేతుకములై యుండవు. అందును హేతువగునది జాతియె. అదియె పాకత్వాది సామాన్యము.

యదృచ్ఛా శబ్దము లందును జాతి యున్నది. బాలుడు చైత్రశబ్దము నుచ్చరించును. శుక ముచ్చరించును. వృద్ధుడు నుచ్చరించును. వారు వారు చ్చారణ మొనరించిన యా యా చైత్రశబ్దములు భిన్నభిన్నములై యగును. ఇట్లీ శబ్దములు భిన్నములే యయినను "ఆ చైత్రశబ్దమె యీ చైత్రశబ్ద" మని యభిన్నాభిధాన మున్నది. అభిన్న ప్రత్యయమును గలుగు చున్నది. ఈ యభిన్నాభిధాన ప్రత్యయము లహేతుకములు కావు. అందు హేతువు జాతి. అదియె చైత్రత్వాది సామాన్యము. దీనినే వేరొక విధమున జూడ వచ్చును. ఒకడు బాల్యమున చైత్రసంజ్ఞ పొందెను. అతడు కౌమారమున మారుచున్నాడు. యౌవనమున మారుచున్నాడు. ముసలితనమున మారు చున్నాడు. ప్రతిక్షణమున నా సంజ్ఞ మారుచుండుట ప్రసిద్ధము. ఇట్లెన్నె న్ని మార్పులు పొందినను "చైత్రుడు చైత్రుడు" అని అభిన్నాకారమయిన జ్ఞానము కలుగు చున్నది. ఇదియు నహేతుకము కాదు. ఇందలి హేతు వును జాతియే యగును. అదియె చైత్రత్వాది సామాన్యము. కాగా సర్వ శబ్దములకును జాతియె ప్రవృత్తినిమిత్తమని పర్యవసితము. *

---

* ఈ సందర్భమున నీ విషయము భావనీయము :- కావ్యప్రకాశ మూలమున

"గుణక్రియాయదృచ్ఛానాం వస్తుతః ఏకరూపాణామపి ఆశ్రయ భేదాత్ భేద ఇవ లక్ష్యతే. యథా ఏకస్య ముఖస్య ఖడ్గముకురతైలాద్యా లంబన భేదాత్.

హిమపయః శంఖాద్యాశ్రయేషు పరమార్థతో భిన్నేషు శుక్లాదిషు యద్వశేన శుక్లః శుక్ల ఇత్యాద్యభిన్నాభిధాన ప్రత్యయోత్పత్తిః తత్ శుక్లత్వాదిసామాన్యం గుడతండులాదిపాకాదిష్వేవమేవ పాకత్వాది. బాలవృద్ధ శుకాద్యుదీరితేషు డిత్థాదిశబ్దేషు చ ప్రతిక్షణం భిద్యమానేషు డిత్థాద్యర్థేషు వా డిత్థత్వాద్యస్తీతి సర్వేషాం శబ్దానాం జాతిరేవ ప్రవృత్తినిమిత్తమిత్యన్యే"

అను నీ గ్రంథము నంతను జాతిపక్షపరముగనే యన్వయించి వ్యాఖ్యానించిన వారు కలరు. కొందరు వ్యాఖ్యాతలు "హిమపయఃశంఖాద్యాశ్రయేషు" మొదలగు గ్రంథమునే జాతిపరముగా నన్వయించిరి. తత్పూర్వగ్రంథమును జాత్యాదిమతపరముగా నన్వయించినారు. ఇంతకు పూర్వము చూపిన యుపపాదన మీ విధానమునే యనుసరించియున్నది. కొందరు జాతిపరముగా నన్వయించుటలో గూడ ఔచిత్యస్వారస్యములు గోచరించుచున్నవి. దానిని పాఠకభ్రాత లీ విధముగా సంభావింపవచ్చును.

సర్వవిధము లయిన శబ్దములకు జాతి యొకటియే ప్రవృత్తినిమిత్తమని మీమాంసకు లంగీకరింతురు. వారిమతము నాక్షేపపురస్సరముగా గుర్తించుట సముచితము. ... ... ... గుణక్రియా యదృచ్ఛా శబ్దములు వాస్తవముగా నేకరూపములె. "శుక్లతరము, శుక్లతమము" అను రూపమున గుణాదులందు వాస్తవముగా రూపభేదము లేదు. ఐనను ఒక భేదము కనపడుచున్నది. సామాన్యవస్తువుల కన్న శంఖ మింకను తెలుపుగా నుండును. అందుచే శుక్లము శుక్లతరము శుక్లతమము అను భేదము భాసించుచునేయున్నది. అట్లే గమనములో పశుగమనముకన్న పక్షిగమనము వేగాధిక్యము కలిగి యుండును. అందుచే నచట గూడ రూపభేద మనుభవసిద్ధమై యుండుట యగోచరము కాదు. ఇట్లు రూపభేద మున్నందుననే గుణత్వజాతిని క్రియాత్వజాతిని కల్పించుట శక్యము కాదు. అనుగతమగు రూపము లేకున్నచో జాతి కల్పనము కుదురదు కదా! జాతి సంభ

వించు చోట తారతమ్యముండదు. గోవునందు గోత్వజాతి సంభావ్యము. అచట గోతరమని గోతమమని వ్యవహారము లేదు. అట్లే గుణత్వాది జాతిలో గూడ ననుగతరూప మున్న నే జాతికల్పన ముపపన్న మగును, ఇచట తారతమ్యము భాసించు చున్నందున జాతి నంగీకరించుటకు వలను పడదు. అని శంకాగ్రంథము.

ఈ విషయమున నిది సమాధాన గ్రంథము. గుణక్రియలలో దార తమ్య మవభాసించుట వాస్తవికము కాదు. గుణత్వాది జాత్యంగీకారములో నిది యనుపపత్తియు గాదు. అనుపపత్తిగా గనపడునది యనుపపత్త్యా భాసమె. శుక్లతరము శుక్లతమ మను భేద మాశ్రయము లోని వైమల్య తారతమ్యము ననుసరించి యుండును. అది యౌపాధికమె కాని వాస్త వికము కాదు. వాస్తవ భేదము గుణక్రియాదులలో లేనపుడు జాతి యశక్య కల్పన కాదు. కావుననే హిమపయః శంఖాదులందు శుక్ల మేకరూప ముగనె యవభాసించును. ఎచట నున్నను గుణక్రియాదు లేక రూపములే. ఏకరూపమగు దానికి భేదము గోచరించు నేని యది యౌపాధిసిద్ధమే. ఈ దృష్టాంతమున నా యంశము స్పష్టము కాగలదు. ఖడ్గముకుర తైలా ద్యాలంబనముల భేదముల వలన నొకటియె యనేకవిధముల గోచరిం చును. అంత మాత్రమున ముఖములో వైవిధ్యమున్నదనరాదు. ఇట్లు గుణ క్రియాదులలో దారతమ్యము లేకుండుట యనుభవసిద్ధమై యున్నది. కను కనే హిమపయఃశంఖాదుల నాశ్రయించిన గుణాదులు వేరు వేరుగా నున్నను "శుక్లః శుక్లః" అను శబ్దప్రయోగమును, అది యొకటియె యను నర్థజ్ఞాన మును గలుగు చున్నది. ఇట్లే గుడతండులాది పాకాదు లందును "ఆ పాకము లన్నియు నొకటి" అను నేకశబ్దప్రయోగము నవి యొకటియె యను నర్థజ్ఞానము కలుగు చున్నది. బాలవృద్ధశుకాదులు పలికిన చైత్రాది శబ్దములలో ప్రతిక్షణమును మార్పు పొందునట్టి చైత్రాది పదార్థము లందును జాతి యొక్కటియే యనుగతమై గోచరించు చున్నది. కావున వీని యన్నిటిలో జాతి యొక్కటియె ప్రవృత్తినిమిత్తము.

జాతిపక్షము మమ్మటాచార్యున కంతగా సమ్మతము కాదు. మహా భాష్యకారుడు పతంజలి యంగీకరించిన వాదమె మమ్మటున కభీష్టము. కేవలజాతిపక్షము ప్రాచీను లయిన కొందరి వైయాకరణులకు సమ్మతము.

★ తద్వాన్ అపోహో వా శబ్దార్థః కైశ్చిదుక్త ఇతి గ్రంథ గౌరవ భయాత్ ప్రకృతానుపయోగాచ్చ న దర్శితః.

ఈ విషయమున నిప్పటికి జాత్యాదిమతము కేవలజాతిమతము నని రెండు మతములు నిరూపించి నట్లయినది. ఇంకను రెండు మతములు కలవు. ఒకటి తార్కికమతము. వేరొకటి సౌగతు లయిన బౌద్ధుల మతము. ఆ మతములు గ్రంథగౌరవమును సంపాదించునవె. అంతగా నంగీకార్యములు కావు. ఆ మతములను స్పష్టముగా నిరూపించి చెప్పుట ప్రకృతమున నవసరమె యగునేని గ్రంథవిస్తరమున భీతి పడ నక్కరలేదు. ఐనను సంగ్రహితసారము నిట్లు గుర్తింప వచ్చును.

తా ర్కి క మ త ము.

తార్కికులు జాతివిశిష్ట వ్యక్తివాదులు "తద్వాన్, తత్-జాతి, జాతి మత్తు జాతివిశిష్టమైన వ్యక్తి. అదియే శబ్దార్థము. జాతి యర్థక్రియాకారి కాదు. ఎవడును ఘటత్వముచే జలానయనాది క్రియలను జేయలేడు. అందుచే జాతియందు సంకేతము నంగీకరించుట విఫలము. కేవల వ్యక్తి మాత్రమును శక్యము కాదు. వ్యక్తు లనంతము లగుట నానంత్యదోషము, సంప్రాప్త మగును. వ్యభిచారదోషమును సంక్రాంతమగును. కేవల జాతి మాత్రమును శక్యము కాదు. అట్లే యయిన వ్యక్తిప్రతీతి కలుగను గదా! ఆక్షేపమున వ్యక్తిప్రతీతి కలుగు ననుట సముచితము కాదు. ఆక్షేప లభ్యమైన యర్థము వృత్తిసముపస్థితము కానందున శాబ్దబోధలో భాసింపజనదు. కావున జాతివిశిష్టమునందే సంకేతము నంగీకరింప వలయును. అని,

సౌ గ తు ల మ త ము

సౌగతు లను బౌద్ధవిశేషు లపోహము నందు సంకేతము నంగీకరింతురు. అపోహ మతద్వ్యావృత్తి ఘట మను సంకేతము ఘటము కాని దానిని వ్యావర్తింపజేయుటలోనే యున్నది. "న సః, అసః అతస్మాద్వ్యావృ

ఆ వాదమునె యభిమానించి వ్యక్తివివేకము నందు మహిముడు పెద్ద ప్రణాలిక నిరూపించినాడు. మమ్మటుడు మహిమవాదము నంగీకరింపడు. కావుననే కొందరు జాతిపక్ష మంగీకరింతురని చెప్పి యీ వాదము నందు దన యనాస్థను మూలమునందు బ్రదర్శించినాడు.

వృత్తిః భేదః అతద్వ్యావృత్తిః ప్రపంచములోని పదార్థము లన్నియు క్షణి కములు. నిత్య మేక మనేకానుగత మగు సామాన్యము వాని యందు సంభ వింపదు. అట్టిదే యగు జాతియు సంభవింపదు. జాతి యనునది విచార సహము కాదు. కావున వస్తుతత్త్వము చెప్పుట కవకాశమే లేదు. "గోవు" అన్నచో గోవు కాని దాని నుండి వ్యావృత్తిని (పరిసరింపకపోవుట) సంపా దించుట యను నపోహమే శబ్దార్థము ఈ మతము లలంకారశాస్త్రమున నుపయోగులు కావు.

★ "స ముఖ్యోఽర్థ స్తత్ర ముఖ్యో వ్యాపారోఽస్యాభిధోచ్యతే." ౮

స ఇతి సాక్షాత్సంకేతితః. అస్యేతి శబ్దస్య

అ భి ధా వ్యా పా ర ము

సాక్షాత్సంకేతిత మయిన యర్థమునకే ముఖ్యార్థ మని పేరు. అంతియె కాని ముఖ్యమను వేరొక యర్థము లేదు. మొదటగా గోచరించు నదగుటచే నీ యర్థమునకు ముఖ్యమను పేరుపడన్నది. "ముఖమివ ముఖ్యః" అని ముఖ్యశబ్ద వ్యుత్పత్తి. శబ్దవ్యాపారము వలన గోచరించు అర్థము ముఖ్యము. హస్తాద్యవయవముల కన్న మొదటగా ముఖమె గోచరించు నట్లు లక్ష్య వ్యంగ్య తాత్పర్యార్థముల కన్న ముందుగా నీ యర్థమె గోచరించును. అట్టి సాక్షాత్సంకేతిత మయిన ముఖ్యార్థ విషయమైన శబ్దమునకు గల ముఖ్యవ్యా పార మభిధ యగును. ఈ యభిధా వ్యాపారమునకె శక్తియని వేరొక పేరు. సాక్షాత్సంకేతిత మయిన యర్థప్రతీత్యనుకూల మగు శబ్దవ్యాపార మభిధ యని చెప్పి నట్లయినది.

★ "ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్
అన్యోఽర్థో లక్ష్యతే యత్సా లక్షణారోపితా క్రియా"

"కర్మణి కుశలః" ఇత్యాదౌ దర్భ గ్రహణాద్యయోగాత్, "గంగాయాం ఘోషః" ఇత్యాదౌ చ గంగాదీనాం ఘోషాద్యా ధారత్వాసంభవాత్, ముఖ్యార్థస్య బాధే వివేచకత్వాదౌ, సామీ ప్యే చ, సంబంధే, రూఢితః - ప్రసిద్ధేః, తథా "గంగాతటే ఘోషః"

ఇత్యాదేః ప్రయోగాత్ యేషాం న తథా ప్రతిపత్తిః తేషాం పావనత్వా దీనాం ధర్మాణాం తథా ప్రతిపాదనాత్మనః ప్రయోజనాచ్చ, ముఖ్యేనాముఖ్యోఽర్థో లక్ష్యతే, యత్ స ఆరోపితః శబ్దవ్యాపారః సాంతరార్థనిష్ఠో లక్షణా.

## ల క్ష ణ

వాచకశబ్దమును నిరూపించిన పిమ్మట లాక్షణికశబ్దమును నిరూపింప వలయును. లక్ష్యార్థమును జెప్పవలసి యున్నది. లాక్షణికము లక్ష్యము అని రెండును లక్షణాస్వరూప నిరూపణ మొనర్చినగాని సుగమములు కావు. కావున నీ కారికలో లక్షణ నిరూపిత మగును. లక్ష్యార్థమును జెప్పు లాక్షణికశబ్దము నందున్న వ్యాపారము లక్షణ యగును.

ముఖ్యార్థబాధ ముఖ్యార్థసంబంధము నుండగా రూఢివలన గాని, ప్రయోజనము వలన గాని యన్యార్థము ప్రతిపాదింపబడునేని యప్పటి శబ్దవ్యాపారము లక్షణ యగును. ఇది యారోపితక్రియ. శబ్దమునందు సహజముగా నుండునది కాదు అర్థ ప్రతీత్యనుకూలముగా గల్పితము ఏ వ్యాపారమున శబ్ద మర్థమును లక్షితము చేయునో యా వ్యాపారము లక్షణ యని తేలినది.

ముఖ్యార్థబాధ ముఖ్యార్థయోగము రూఢిప్రయోజనములలో నేదియేని యొకటి యీ త్రయము లక్షణాహేతువు. రూఢిప్రయోజనములలో నన్యతర ముండవలయు ననుట లక్షణ ద్వివిధ మని చెప్పినట్లైనది. రూఢిలక్షణ అరూఢిలక్షణ యని. ముఖ్యార్థబాధ సంబంధ మనునవి రెండిటను సాధారణములు.

"కర్మణి కుశలః" అనునది రూఢిలక్షణ కుదాహరణము. "గంగాయాం ఘోషః" అనునది ప్రయోజన లక్షణ కుదాహరణము. "కుశాన్ లాతీతి కుశలః" దర్భలను గ్రహించు వాడని కుశలపదార్థము. కర్మయందు "కుశలః" అనుచోట దర్భగ్రహణ యోగ్యత యభిప్రేతము కాదు. దర్భగ్రహణ యోగ్యతా రూప మయిన ముఖ్యార్థ మచట బాధిత మయినది. అర్థము బాధిత మగుట యనగా బాధ కల యా యర్థమున కభిమతమగు వాక్యార్థములో ప్రవేశము కలుగక పోవుట. ఇట్లే "గంగాయాం ఘోషః" అను స్థలమున గూడ గంగాపదము యొక్క ప్రవాహ రూప మగు ముఖ్యా

ర్థము బాధిత మయినది. ఘోష మనగా గొల్లల గ్రామము. గ్రామము ప్రవాహమున నుండదు. అందుచే ముఖ్యార్థము బాధితము.

ఇట్లీ రెండు స్థలము లందును ముఖ్యార్థము బాధిత మయినందున వాక్యసార్థకతా సిద్ధికై వేరొక యర్థమును స్వీకరింప వలసి యున్నది. ఆ యర్థము ముఖ్యార్థమునకు సంబంధించి యుండుటయే యిష్టము. ముఖ్యాసంబద్ధ మభిప్రేతము కాదు. ఈ యంశమును సూచించుటకే కారికలో "తద్యోగే" యను పద మున్నది. లక్ష్యార్థము ముఖ్యార్థముతో నేమియు సంబంధము లేనిదే యగునేని గంగాపదమున యమునాతటాది ప్రతీతియు కలుగవలసి యుండును. కావున ముఖ్యార్థసంబంధము లక్ష్యార్థప్రతీతిలో హేతు వని ఫలితార్థము.

దర్భలను దీయుటలో నత్యంతము సావధానత యవసరము. దర్భాగ్రములు తీక్ష్ణముగా నుండుటచే వాని బాధ కలుగ కుండు నట్లు వివేచకత్వ మచట యవసర మగుచున్నది. ఈ వివేచకత్వ రూప మయిన సంబంధ ముండుటచే "కుశల" శబ్దము ప్రవీణుడను నర్థమున రూఢ మగుచున్నది. గంగా పదము సామీప్యసంబంధ ముండుట వలన గంగాతట మను నర్థమును లక్ష్యము చేయుచున్నది.

ఒక యర్థము ముఖ్యము. వేరొకటి యముఖ్యము. అముఖ్యార్థమునే గౌణ మందురు. గౌణ ముఖ్యముల వివేచనమవసర మయినపుడు ముఖ్యార్థమునకే వ్యవహార ముండవలయు నను నియమము కలదు. కవికి శబ్ద ప్రయోగము స్వాయత్తము. అతడు ముఖ్యపరిత్యాగము చేయుట యుక్తము కాదు కదా! అముఖ్యము నాశ్రయించుట యముఖ్యము కావున లక్షణావృత్తి నేల స్వీకరింపవలయును? అని యిచటి ప్రశ్న.

దీనికిది సమాధానము. "గంగాతటే ఘోషః" యని ముఖ్యశబ్దమునే ప్రయోగించితిమేని ప్రవాహమునకు గవ్యూతి దూరమున నున్న ఘోషమును గూడ "గంగాతటే ఘోషః" యని యనవలసి వచ్చును. అప్పుడు గంగా ప్రవాహము నందుండు శీతత్వము, పావనత్వము, మనోహరత్వము మొదలగు ప్రయోజనములు తటఘోషమున భాసింపవు. "గంగాయాం ఘోషః" అని చెప్పినచో ప్రవాహము నందలి శైత్య పావనత్వాదులు తటమునందు భాసింప గలవు. ప్రవాహమునకు దటమంతగా సన్నిధిలో నున్నట్లు గోచ

రించును గదా! కావున నిట్టి ప్రయోజనసిద్ధికై లక్షణావృత్తి నాశ్రయింప వలయును. ప్రయోజనము ముఖ్యశబ్ద ప్రయోగముతో సమకక్ష్యకము కాదు. ప్రయోజన మట్టిదే యైనచో లక్షణ యవసరము లేదు. ముఖ్యార్థాశ్రయణమున బ్రయోజనము లభింప కుండుట నముఖ్యార్థాశ్రయణమున లభించు టచే లక్షణావృత్తి నంగీకరించుట సముచితము.

లక్షణావృత్తి శబ్దవ్యాపారము. దీనినే శబ్దక్రియ యందురు. లక్షణ సాంతరార్థనిష్ఠ మయిన వ్యాపారము. అంతర మనగా వ్యవధానము. వ్యవధానముతో నుండునది సాంతరము. ముఖ్యార్థబాధ యుండుటచే వ్యవధానము కలదయినది. ముఖ్యార్థము వ్యవహితము కాదు. అది నిరంతరార్థము. నిరంతరార్థనిష్ఠమైన వ్యాపారము ఆరోపితము కాదు. సాంతరార్థ నిష్ఠమైన వ్యాపార మారోపిత మగును. ఇది శబ్దమునందు గల్పితమగు వ్యాపార మని భావము.

"గంగాయాం ఘోషః" అను చోట గంగాశబ్దమున గోచరించిన ప్రవాహము తీరము నుపలక్షితము చేయుచున్నది. కాన లక్షణ యర్థవ్యాపారమే యగును. ఐనను వాచ్యధర్మమును వాచకమునం దారోపించుట యను మర్యాద ననుసరించి యర్థవ్యాపారమును శబ్దము నందారోపించుచున్నారు. కావున శబ్దమును లాక్షణిక మగుచున్నది.

ప్రయోజన మూలక మయిన లక్షణయందే వ్యంజన యుండును, రూఢిమూలక లక్షణలో వ్యంజన యుండదు. స్వార్థము కన్న నతిరిక్తముగా వేరొక యర్థమునందు రూఢము లయిన లావణ్యాది పదములు ధ్వనిస్థానములు కావని ధ్వన్యాచార్యుడు నిర్ణయించినాడు. కుశల, అనులోమ, ప్రవీణ, మొదలయిన పదములు రూఢిలక్షణ కుదాహరణములు.

## స ం బ ం ధ ప ం చ క ము

ముఖ్యార్థసంబంధ మయిదు విధముల నుండునని పెద్దలనిరి. అభిధేయ సంబంధము - సాదృశ్యము - సమవాయము - వైపరీత్యము - క్రియాయోగము అని. వీని యుదాహరణముల నిట్లు గుర్తింప వలయును.

౧. ద్విరేఫాది శబ్దమునకు భ్రమర శబ్ద మభిధేయము. తత్సంబంధమున ద్విరేఫశబ్దముచే దుమ్మెద లక్షిత మగును. అభిధేయ సంబంధము నిమిత్తముగా నిచట లక్షణ ప్రసరించినది.

౨. "సింహో మాణవకః" అనునది సాదృశ్యము వలని లక్షణ కుదాహరణము. సింహసాదృశ్యము మాణవకుని యందుండుటను సాదృశ్య మున లక్షణయున్నది.

3. ఈ చెప్పిన సంబంధముల కన్న నితరమగు సంబంధము సమ వాయ సంబంధము. "గంగాయాం ఘోషః" అనునది సామీప్య సంబంధ మున లక్షణ కుదాహరణము. గంగాసామీప్య మిచట అవభాసించుట యున్నది గదా! సాహచర్య సంబంధమునకు "ఛత్రిణో యాంతి" అను నది యుదాహరణము. ఒకమార్గమున ఛత్రములు కలవారును లేనివారును జనునపుడు "ఛత్రిణో యాంతి" యని వ్యపదేశించినచో ఛత్రము కల వారి సాహచర్యమున లేనివారును లక్షితు లగుదురు.

౪. శత్రువు నుద్దేశించి పలుకు నప్పు "డుపకార మొనర్చితివి. సౌజ న్యము చూపితివి. చిరము జీవింపుము." అనినచో వైపరీత్యమున "నపక రించిన నీవు దుర్జనుడవు. చిరము జీవింపవు" అను నర్థము లక్షిత మగును.

౫. శత్రుఘ్నుడు కాని వానిని గూడ శత్రు హననక్రియా యోగ ముండుటను శత్రుఘ్నుడని వ్యపదేశించి నపుడు క్రియాయోగమున నర్థ ముపలక్షిత మగునని గ్రహింప వలయును.

## ల క్ష ణా భే ద ము లు

లక్షణ రెండువిధములు శుద్ధలక్షణ, గౌణలక్షణ యని. అందు శుద్ధ లక్షణ యుపాదానలక్షణ లక్షణలక్షణ యని ద్వివిధము. ఈ రెండును సారోపా సాధ్యవసాన భేదమున రెండువిధములై మొత్తము నాల్గు విధము లగును. గౌణీలక్షణ సారోప సాధ్యవసాన యని రెండువిధములు. మొత్తము లక్షణ యారు విధములు. ఇట్టి యీ లక్షణావిభాగము అర్థాంతరసంక్రమిత వాచ్యధ్వని మొదలగు ధ్వనివ్యవస్థలలో నుపకారక మగును. ఈ యంశము నిటుపై మమ్మటుఁడు నిరూపించును. ఈ లక్షణాశాఖను మొదట ద్వివిధ ముగా ఖ్యాపనము చేయుటకై యీ కారిక ప్రక్రాంతము.

★ "స్వసిద్ధయే పరాక్షేపః పరార్థం స్వసమర్పణం
ఉపాదానం లక్షణంచేత్యుక్తా శుద్ధైవసాద్విధా". ౧౦

"కుంతాః ప్రవిశంతి" "యష్టయః ప్రవిశంతి" ఇత్యాదౌ కుంతాదిభిరాత్మనః ప్రవేశసిద్ధ్యర్థం స్వసంయోగినః పురుషా ఆక్షిప్యంతే, తత ఉపాదానేనేయం లక్షణా.

"గౌరనుబంధ్య" ఇత్యాదౌ శ్రుతిచోదిత మనుబంధనం కథం మే స్యాత్? ఇతి జాత్యా వ్యక్తిరాక్షిప్యతే, నతు శబ్దే నోచ్యతే.

"విశేష్యం నాభిధాగచ్ఛేత్ క్షీణశక్తి ర్విశేషణే"

ఇతి న్యాయాత్. ఇత్యుపాదాన లక్షణాతు నోదాహర్తవ్యా. నహ్యత్ర ప్రయోజనమస్తి. నవా రూఢిరియం. వ్యక్త్యవినా భావిత్వాత్తు జాత్యా వ్యక్తిరాక్షిప్యతే. యథా; క్రియతామిత్యత్ర కర్తా 'కుర్వి'త్యత్ర కర్మ. 'ప్రవిశ పిండీం' ఇత్యాదౌ 'గృహం భక్షయ' ఇత్యాదిచ. "పీనో దేవదత్తో దివా న భుంక్తే" ఇత్యత్ర చ రాత్రిభోజనం న లక్ష్యతే. శ్రుతార్థాపత్తే రర్థాపత్తేర్వా విషయత్వాత్.

శుద్ధాలక్షణ, యుపాదానలక్షణ, లక్షణ లక్షణ యని రెండు విధములు. స్వసిద్ధికై పరాక్షేప మున్నచో నుపాదానము. పరార్థమై స్వసమర్పణ మున్నచో లక్షణము.

ఈ యర్థము నిట్లు వివరింప దగును. శక్యార్థమున కన్వయప్రవేశసిద్ధి కలుగుటకై స్వసంబద్ధ మయిన యర్థమును సామర్థ్యమున స్వీకరించుట యుపాదానలక్షణ యని భావము. స్వసంబద్ధమయిన యితరార్థమున కన్వయప్రవేశమును సంపాదించుటకై తన శక్యార్థమును బరిత్యాగము చేయుట లక్షణలక్షణ. కొంద ఱుపాదానలక్షణ యజహత్స్వార్థ యని, లక్షణలక్షణ జహత్స్వార్థ యని యందురు.

### ఉ పా దా న ల క్ష ణ

వీనిని సోదాహరణముగా వ్యాఖ్యానించుట సముచితముగా నుండును. "కుంతాః ప్రవిశంతి" "యష్టయః ప్రవిశంతి" ఈ రెండు నుపాదానలక్షణ కుదాహరణములు. "కుంతాః ప్రవిశంతి" యను వాక్యము నందు "కుంత" శబ్దమునకు "ఈటెలు" (ఆయుధవిశేషములు) ముఖ్యార్థము. కుంతములచేతనములు. వానికి ప్రవేశనము సంభవింపదు. స్వప్రవేశసిద్ధికై

కుంతములు తమ్ము ధరించు (స్వసంయోగి) పురుషులను లక్షింప జేయును. కుంతధారులగు పురుషులు ప్రవేశించుచున్నారని యవసిత మయిన యర్థము. ఇట్లె "యష్టయః ప్రవిశంతి" అను స్థలమున గూడ గ్రహింపవలయును. ఈ రెండు స్థలము లందును కుంత యష్టిశబ్దములు స్వార్థమును బరిత్యాగము చేయకయే పరార్థోపాదానము చేయుట యున్నందున నుపాదానలక్షణ యని గ్రహింప వలయును. స్వరూపోపాదానమున బ్రవర్తించుటచే నుపాదానలక్షణ యగుచున్నది.

జాతి పదార్థవాదు లగు మీమాంసకు లుపాదానలక్షణ వేరుగా నుదాహరింతురు. వారు చెప్పునది యుపాదానాభాసము. ఆవిషయమునం దుపాదానలక్షణ యన్నబుద్ధితో భ్రాంతు లయిన వారల నుపహసించుచు దీని స్వరూపమును జక్కగా వివేచన మొనర్చుటకు మమ్మటులు ప్రయత్నించినారు.

మీ మాం స క మ త ము

మీమాంసకు లిట్లందురు. "గౌరనుబంధ్యః" "అజోఽగ్నీషోమీయః" అను శ్రుతిలో గవాలంభరూప మయిన చోదన మున్నది. అది ప్రభుసమ్మిత మయిన యాదేశము. కాని జాతి యగు దాని కనుబంధన మెట్లు సిద్ధించును? గోపదమునకు గోజాతియందు శక్తియున్నది. సమగ్ర గోజాతి కనుబంధనము శక్యము కాదే! శ్రుతివిధానమునకు సామర్థ్యమును సంపాదింప వలయును. జాత్యర్థక మయిన గోపద మనుబంధన యోగ్య మయిన గోపిండము నాక్షిప్తము చేయునని యంగీకరింపవలయును. కాఁగా గోశబ్దము జాతిరూప మగు తన యర్థమును విడువకనే వ్యక్తిరూపమగు నితరార్థము నుపాదానము చేయుట యున్నది గావున నిదియు నుపాదానలక్షణయే యగును.

గోశబ్దము జాతిని చెప్పి వ్యక్తిని గూడ చెప్పు ననుట సంగతము కాదు. గోశబ్దమునకు గల యభిధాశక్తి జాతిరూపమగు నర్థమును బ్రతిపాదించి పిమ్మట వ్యక్తిరూపమగు నర్థమునందు బ్రసరింపదు. ఈ మీమాంసకన్యాయమును జూడుఁడు!

"విశేష్యం నాభిధాగచ్ఛేత్ క్షీణశక్తిర్విశేషణే" అభిధాశక్తి జాతిరూపమగు విశేషణమయిన యుపాధియందు క్షీణశక్తిక మగును, దాని

వ్యాపార మచట విరతమై పోవును. వ్యక్తిరూపము ధర్మియు నగు విశేష్యము పర్యంత మది గమింపదు. విశేషణము చెప్పుటలో శక్తి క్షీణము కాఁగా విశేష్యము వర కది ప్రసరింప జాలదు గదా!

"నాఽగృహీతవిశేషణా బుద్ధిః విశేష్యముపసంక్రామతి" అనియు న్యాయము కలదు. విశేషణజ్ఞానమును పొందని బుద్ధి విశేష్యమును సంక్రమింపదు. ముందుగా విశేషణజ్ఞానము కలిగియే తీరవలయునని నియమము. విశేషణజ్ఞానము కలుగుటకు పూర్వమే విశేష్యజ్ఞానము కలుగదు. విశేషణజ్ఞానమే మొదట గలుగును. మొదట విశేషణమునందు శబ్దశక్తి క్షయించుటచే విశేష్యము వరకది వ్యాపింపదు.

"అనన్యలభ్యః శబ్దార్థః"

అనునదియు మీమాంసక న్యాయము. అన్యలభ్యము శబ్దార్థము కాఁజాలదని తదర్థము. "గౌః" అను స్థలమున శబ్దార్థము జాతియే. వ్యక్తిరూపార్థము లక్షణచే గోచరించును. కాన నది గోశబ్దము యొక్క యర్థము కాదని పై న్యాయభావము. శబ్దబుద్ధికర్మలు విరతము లయినచో మరల వ్యాపారము కలవి కావు. కాన విశేషణము నందు విరతమయిన శబ్దశక్తి మరల వ్యక్తిరూప విశేష్యమును జెప్పఁజాలదు. కావున "గౌరనుబంధ్యః" యనునది యుపాదానలక్షణ యని మీమాంసక భావము. ఈ భావమునే ముకులభట్టాదులు గ్రహించినారు.

మీమాంసక మతసమీక్ష

కాని దీని నుపాదాన లక్షణోదాహరణముగ భావించుట కూడదు. "గౌరనుబంధ్యః" యను స్థలములో గోశబ్దమునకు వ్యక్తియందు లక్షణ చెప్పుటలో ప్రయోజన మేమియును లేదు. "కుంతాః ప్రవిశంతి" యను స్థలమునందు ప్రయోజన మున్నందుననే లక్షణ యంగీకృతము. ప్రయోజనము లేకున్న లక్షణ నంగీకరించుటకు వలను పడదు. ఒక్కొకచో ప్రయోజనము లేకపోయినను రూఢి యున్నందున లక్షణ నంగీకరించుట యున్నది. కాని యిచట రూఢియు లేదు. గోశబ్దము గోవ్యక్తియందు రూఢమని శాస్త్రకారు లనరు. "లక్ష్యార్థము కాక యితరార్థము నందును ఎప్పుడేని ప్రయోగముండుట లక్ష్యార్థబోధక ప్రయోగములె బహుళముగా నుండుట" యున్నచో రూఢియని కదా! వ్యవహారము. తైలమను పదము తిలల వికార

మయిన ద్రవము నంచె ప్రయుక్తము. అది యితరము లయిన నూనెలను గూడ తెలుపును. కావున అట్టివే రూఢము లగుచున్నవి. గోపదమునకు వ్యక్తి వినా యితరము నంచెప్పుటను ప్రయోగము లేదు. అందుచే బ్రకృతము నందు రూఢి లేదు. ప్రయోజనము కాని రూఢి కాని యుండుట లక్షణా బీజము, అది లేనందున నిచట లక్షణ లేదు.

గోవ్యక్తి యందు లక్షణ లేక పోయినను వ్యక్తి ప్రతీతి కలుగుట కవకాశమున్నది. వ్యక్త్యవినాభావము వలన జాతిచే వ్యక్తి యాక్షిప్త మగును. అవినాభావ మనగా వేరుగా నుండకపోవుట. వ్యక్తి లేక జాతి యుండదు. వ్యక్తి లేక యుండ నేరని జాతి వ్యక్తి ననుమింపజేయును. అవినాభావమున నాక్షిప్యమాణ మగుట యనేక స్థలములందు ప్రసిద్ధముగా నున్నది. "క్రియతాం" అని యుచ్చరించినచో నచట కర్తృపదము లేక పోయినను ఆ క్రియచే గర్త యాక్షిప్తు డగును. అట్లే "కురు" యని ప్రయోగించినచో గర్మ యాక్షిప్త మగును. "ప్రవిశ" యన్నచో "గృహం" అని "పిండీం" అన్నచో "భక్షయ" యని యాక్షిప్త మగును. అవినాభావమున నాక్షిప్తమగుట యిట్లు ప్రసిద్ధముగనే యున్నది.

మకులభట్టు మతము

"పీనో దేవదత్తః దివా న భుంక్తే" యని యొక యుదాహరణము కలదు. దేవదత్తుడు బలిసియున్నాడు. పగలు భోజనము చేయడు. అని తదర్థము. ఈ స్థలము నందు ముకులభట్టు ఉపాదాన లక్షణ యని భావించినాడు. తదభిప్రాయము నీ విధముగా గుర్తింప వలయును.

పగటి పూట భోజనము చేయని వానికి పీనత్వ ముపపన్నము కాదు. ఉపపన్నము కాని యంశము తన యుపపత్తిసిద్ధికై యర్థాంతర మవగమింపజేయును. "దేవదత్తుడు రాత్రి భోజనము చేయుచున్నా డను నర్థాంతర మచట పీనత్వము నుపపన్నము చేయుచున్నది. రాత్రి భోజనము కారణము. పీనత్వము కార్యము. కారణము లేక కార్యము కలుగదు. రాత్రిభోజన మర్థాపత్తిచే నిచట లభించును. అర్థాపత్తి యను నది యర్థము నవభాసింపజేయు ప్రమాణములలో నొకటి.

అర్థాపత్తి రెండు విధములు. శ్రుతార్థాపత్తి, యర్థాపత్తి యని. ఉపపత్తిని సూచించు శబ్దము నధ్యాహరించినచో నా శబ్దము ద్వారమున నర్థము

లభించును. కావున నది శ్రుతార్థాపత్తియగును. భోజనము లేక పీనత్వము కుదురదు. దేవదత్తుఁడు దివాభోజనము చేయఁడని నిశ్చితమె కావున నతడు రాత్రియందు భుజించు నని శబ్దములను కల్పించినచో శ్రుతార్థాపత్తి యగును. ఇట్లు శబ్దముల కల్పనము లేక కేవల మనుపపన్న మయిన యర్థమున నుపపత్తిని సూచించు నర్థమును లభింపఁ జేసికొన్నచో నర్థాపత్తి యగును. శ్రుతార్థాపత్తి కాని యర్థాపత్తి కాని ఏదయినను రాత్రిభోజనము నాక్షిప్తము చేయును. స్వసిద్ధికై పరాక్షేపమిచట నున్నది కాన ఉపాదానలక్షణ యగును. అని

ముకుల మత, విమర్శ

కాని మమ్మటుఁ డిచట ఉపాదానలక్షణ నంగీకరింపడు. అర్థాపత్తి ప్రమాణముననే రాత్రిభోజన రూప మయిన యర్థము లభించునపుడు లక్షణాకల్పనము యుక్తము కాదు. రాత్రి భోజనరూప మయిన శబ్దాధ్యాహారము కాని యర్థాధ్యాహారము కాని యిచట క్లుప్తమై యున్నందున ఉపాదానలక్షణ యనుట యుక్తము కాదు. అర్థాపత్తినే కొందరు దృష్టార్థాపత్తి యనుచున్నారు. అర్థాపత్తి ననుమాన ప్రమాణము నందే కొంద రంతర్భవింప జేసి నా రనునది విషయాంతరము.

★ "గంగాయాం ఘోష" ఇత్యత్ర తటస్య ఘోషాధికరణత్వ సిద్ధయే గంగాశబ్దః స్వార్థమర్పయతి. ఇత్యేవమాదా లక్షణేనైషా లక్షణా.

"గంగాయాం ఘోషః" అనునది లక్షణలక్షణ కుదాహరణము. "పరార్థం స్వసమర్పణం" అని లక్షణలక్షణకు లక్షణము. "గంగాయాం ఘోషః" అను వాక్యమున గంగాపదమునకు ప్రవాహము ముఖ్యార్థము. ప్రవాహము నందు ఘోష ముండదు. ప్రవాహము ఘోషాధికరణము కాదని యర్థము. కావున గంగాపదము ప్రవాహరూప మయిన స్వార్థమును విడచి తటరూప మయిన యర్థమును లక్ష్యము చేయుచున్నది. కాఁగా తటము ఘోషాధికరణమని సిద్ధ మగును. ఉపాదాన లక్షణలో ముఖ్యార్థము లక్ష్యార్థము రెండు నుండును. లక్షణలక్షణలోఁ గేవలము లక్ష్యార్థమె యుండును, ఇది వీని భేదము.

* ఉభయ రూపా చేయంశుద్ధా, ఉపచారేణా మిశ్రితత్వాత్ అనయోర్లక్ష్యస్య లక్షకస్యచ న భేద రూపం తాటస్థ్యం. తటాదీనాం గంగా దిశబ్దైః ప్రతిపాదనే తత్వ ప్రతిపత్తౌహి ప్రతిపిపాదయిషిత ప్రయోజన సంప్రత్యయః. గంగా సంబంధమాత్ర ప్రతీతౌతు గంగాతటే ఘోష ఇతి ముఖ్యశబ్దాభిధానాల్లక్షణాయాః కో భేదః?

ఉపాదానలక్షణ, లక్షణలక్షణ అను నీద్వివిధ లక్షణ శుద్ధ లక్షణ యని వ్యవహారము. ఈ రెండిటిలో నుపచారము లేదు. ఉపచారమున మిశ్రితము కాకుండుట శుద్ధి యని సంక్షేపార్థము. సాదృశ్యరూప మగు సంబంధమున ప్రవృత్తి యుండుట కుపచారమని పేరు. అత్యంతము వేరుగా నున్న రెండు పదార్థములకు సాదృశ్యాతిశయమహిమచే భేద ప్రతీతిని గప్పిపుచ్చుట యుపచార మగునని పెద్దలు కొందరు నిర్వచనము చేసినారు. శుద్ధోదాహరణములలో సాదృశ్యము లేదు. గౌణోదాహరణము లందే యుపచారము భాసించును. ఈ విషయము మున్ముందు విశద మగును. సాదృశ్యసంబంధ మున్నచో గౌణీలక్షణ యని, తదితర సంబంధ మున్నచో శుద్ధలక్షణ యని, మూలముననే నిరుక్త మగును. ఉపచార మిశ్రణామిశ్రణముల ననుసరించి వీని భేదములను గుర్తింప వలయునే కాని యితర విధమున భేదము సిద్ధింప దని మమ్మటాశయము. అభిధావృత్తిమాతృకను రచించిన ముకులభట్టు గౌణీ శుద్ధా లక్షణల కన్యవిధమున భేదము నభిమానించినాడు. అట్టి భేదకథనము మమ్మటునకు సమ్మతము కాదు.

## ముకుల మతము

ముకులభట్టు భావ మిట్లుండును. "గౌర్వాహీకః" అను గౌణి యుదాహరణమున వాచ్యార్థ లక్ష్యార్థములకు సాదృశ్యసంబంధ ద్వారమున నభేదము గోచరించును. శుద్ధాలక్షణలో వాచ్యార్థ లక్ష్యార్థములకు భేదమె గోచరించును. దీనినే యౌదాసీన్యమని భేదప్రతీతిరూపము అన్యోన్యాభావస్వభావము వయిన తాటస్థ్యమని, మాధ్యస్థ్యమని యందురు. గౌణిశుద్ధలలో భేదక ధర్మము (భేదమును బోధించు ధర్మము) అంతియ కాని యుపచారమిశ్రణ ముండుట, లేక పోవుట కాదు. ఈయభిప్రాయమునే యిట్లు

విస్పష్టముగా [illegible] గాని
లక్ష్యలక్షణములో [illegible] శక్యార్థ
లక్ష్యార్థములకు [illegible] ఆరోపము
నందు భేదము [illegible] ”
“[illegible] శక్యార్థ
లక్ష్యార్థముల [illegible] అను
లక్షణోదాహరణములో [illegible] ప్రతీత
మగును. [illegible] తటస్థమె
భేదకధర్మము అని

ఉత్తరపక్షము

ఈ వాద ముచితము కాదు. “గంగాయాం ఘోషః” యను లక్ష
ణోదాహరణములో గూడ అభేదమే భాసించును. తాటస్థ్యము భాసిం
పదు. ఇచట గూడ తాటస్థ్యసంభావనమే యుండునేని యాదృశ వ్యవహార
కౌతూహల మున్నను భేదప్రథ యనుభావ్యమే యగును. గంగాది బోధ
కము లయిన గంగాదిశబ్దములు తటాదికములను బ్రతిపాదించి నపుడు తత్త్వ
ప్రతిపత్తి కలుగ వలయును. తత్త్వమనగా తాదాత్మ్యము. తటాదులు
గంగాత్వాది రూపము లనుట. శక్యార్థ లక్ష్యార్థము లయిన గంగాతీరముల
కభేదజ్ఞానమే కలుగ వలయును. అప్పుడే ప్రతిపాదింపదలచిన ప్రయో
జనము లవభాసించును. లక్షణాద్వారమున గంగాశబ్దముచే గంగాతట
ప్రతీతి కలిగినపుడు గంగాగత మయిన శీతలత పవిత్రత మొదలయిన ధర్మ
ముల జ్ఞానము లక్ష్యమునందు సన్నిహితమై యవభాసించును. ఈ శీతత్వ
పావనత్వాదులు ప్రతిపాదయిషిత ప్రయోజనములు. ఇవి భేదప్రతీతి
యున్నచో గలుగవు. “అన్యత్ర అన్యశబ్దప్రయోగః ఇతరధర్మప్రాప్త్యర్థః”
అని న్యాయము. ఒకచో వేరొక శబ్దప్రయోగ మున్నచో నా యా ధర్మము
లవభాసించును. తీరార్థమున గంగాశబ్దప్రయోగము గంగాగత శీతలత్వాది
ప్రయోజన ప్రతీతికి గదా! కావున గంగాత్వజ్ఞానము కలిగిననే ప్రయో
జనములు గోచరించును. గంగాసంబంధ మాత్రము గోచరించినను తీర
మాత్రప్రతీతి కలిగినను శైత్యాది ప్రతీతి యుండదు. గంగాతీర శబ్దమును
బ్రయోగింపక “గంగాతటే ఘోషః” అని ముఖ్యశబ్దమునే ప్రయోగించి

నచో బ్రయోజనము లవభాసింపవు. "గంగాయాం ఘోషః" యన్నచోట తీరత్వాది ప్రతీతి యున్నను శీతత్వాదులను గోచరించు నేని "తీరే ఘోషః" అనియె చెప్పవచ్చును గదా! గంగాశబ్దమున తటము ప్రతిపాదితమై గంగా సంబంధము తటమున గోచరించు నేని "గంగాతటే ఘోషః" అనియె చెప్పవచ్చును కదా! ఇట్టి ముఖ్యశబ్దమునఁ గూడ ప్రయోజన ప్రతీతి యున్నపుడు లక్షణ నాశ్రయింపవలసిన యవసరమేమి? ముఖ్యశబ్దము కన్న లాక్షణికశబ్దప్రయోగమున భేద మున్నదని యంగీకరింపవలయును. లాక్షణికమునందు బ్రయోజనప్రతీతి యున్నది. గంగాత్వప్రత్యయము కలిగిననే ప్రయోజనము లవభాసించును. కాఁగా శుద్ధభేదమునఁ గూడ అభేద ప్రతీతి యుండుటచే తాటస్థ్యము భేదకము కాదని యుపచారమిశ్రణమె భేదకమని భావము.

### సారోపాసాధ్యవసానికాభేదములు.

శబ్దము మూడు విధములు. అర్థమును మూడు విధములు. శబ్దము అభిధా లక్షణా వ్యంజనా వృత్తుల ననుసరించి యర్థవిశేషమును ప్రతిపాదించు ననియు నిరూపితము. కాని భోజరాజాదు లిట్లందురు. "శబ్దము అభిధావృత్తి – గౌణీవృత్తి – లక్షణావృత్తి యను వృత్తుల నాధారించుకొని యర్థవిశేషప్రత్యాయనము చేయును. కాఁగా గౌణవృత్తి ననుసరించి యర్థమును గోచరింపజేయుటలో నిమిత్తమగు శబ్దమును గలదు" అని. కాన శబ్దార్థముల త్రైవిధ్యకథన మెట్లు సంగతమగును?. ఈ యంశమును హృదయమున నుంచుకొని గౌణీవృత్తిని లక్షణలో నంతర్భవింపఁజేయ దలచి సూత్రకారుఁడు భంగ్యంతరమున లక్షణాభేదమును నిరూపించుచున్నాడు.

★ "సారోపాన్యాతు యత్రోక్తౌ విషయీ విషయస్తథా"

ఆరోప్యమాణః ఆరోపవిషయశ్చ యత్రానపహ్నుతభేదౌ సామానాధికరణ్యేన నిర్దిశ్యేతే సా లక్షణా సారోపా.

"విషయ్యంతః కృతేఽన్యస్మిన్ సా స్యాత్సాధ్యవసానికా."

విషయిణా – ఆరోప్యమాణేన, అంతఃకృతే – నిగీర్ణే, అన్యస్మిన్ – ఆరోపవిషయే సతి సాధ్యవసానా స్యాత్.

## సారోపము

విషయి విషయము అను రెండు నెచట నిరూపితము లగునో యచట సారోపలక్షణ. అది శుద్ధాలక్షణ కన్న భిన్నము. "గౌర్వాహీకః" అను లక్ష్యమున దీని గుర్తింప వలయును. "బాహీకుడు గోవు" అని తదర్థము. విషయికి ఆరోప్యమాణమని విషయమునకు ఆరోప్యవిషయమని పేరు. గోవు ఆరోప్యమాణము. బాహీకుఁ డారోపవిషయము. ఆరోప్యమాణ మారోప విషయ మను రెండును గోత్వ బాహీకత్వ రూప మయిన తమ తమ ధర్మ యుతముగా నిర్దేశింపబడునేని సారోప లక్షణ యగును. ఈ నిర్దేశములందు విషయి విషయముల వైధర్మ్యము స్పష్టప్రకాశము కావలయును. గోత్వబాహీకత్వ రూప మయిన స్వలక్షణ యుగల విశేషములను గప్పి పుచ్చక వాని స్ఫురణ ముందు నట్లుపన్యసింపవలయును. ఆ రెండింటిని శబ్దముచే స్పష్టముగాఁ బ్రతిపాదింప వలయును. సామానాధికరణ్యమున వాని నిర్దేశింపవలయును. (సమాన విభక్తిక పదములచే ననుట. వైయధికరణ్య ప్రకటనమున అర్థనిర్దేశమును సామానాధికరణ్య విధానమున శాబ్దనిర్దేశమును కుదురుకొనును.) ఇట్లున్నచో సారోపలక్షణ యగును. చెప్పఁ బోవు సాధ్యవసాన లక్షణ కన్న భేద మీ విధమున సిద్ధించును.

## సాధ్యవసానిక

ఇది యుపచారమిశ్ర మయిన సాధ్యవసానాలక్షణము. ఆరోప్యమాణము విషయి యప్రకృత పర్యాయము లని, ఆరోపవిషయము, విషయము ప్రకృత పర్యాయములని స్థూలముగా గుర్తింపవలయును. ఆరోప్యమాణ మగు విషయిచే నారోపవిషయము నిగీర్ణము (అంతర్హితము) అయినచో సాధ్యవసానిక యగును. ఆరోపమునకుఁ బాత్రమయిన విషయము ఆరోప్యమాణమునందు లీనమగు నేని యా విషయి విషయముల భేదప్రతీతి యవభాసింపదేని సాధ్యవసానలక్షణ యన్నమాట. అధ్యవసాన మనగా నిశ్చయజ్ఞానము. ఇది "అదికాని దాని యందు అదియే" యను నధ్యాసరూపము. అధ్యవసానము కలది సాధ్యవసాన. విషయనిగరణమున విషయ్యభేద ప్రతిపత్తి యధ్యవసానము. అది యుండుట సాధ్యవసాన యని భావము. విషయి మాత్రమె యిచట నుండును. కాని విషయము నిర్దిష్టము కాదు. "విషయిణా విషయతిరోభావః "అధ్యవసానపదార్థః" "విషయివాచకపదేనైవ

విషయప్రతిపాదన పర్యవసానము" అని కొందరు చెప్పు లక్షణము. ఈ సాధ్యవసాన సాదృశ్యహేతుకము. అతిశయోక్తి కిది బీజము.

★ "భేదావిమౌ చ సాదృశ్యాత్సంబంధాంతరతస్తథా
గౌణౌ శుద్ధౌ చ విజ్ఞేయౌ-"

ఇమౌ సారోపాధ్యవసానరూపౌ సాదృశ్యహేతూ భేదౌ 'గౌర్వాహీకః' ఇత్యత్ర 'గౌరయమ్' ఇత్యత్ర చ. అత్ర హి స్వార్థసహచారిణో గుణా జాడ్యమాంద్యాదయో లక్ష్యమాణా అపి గోశబ్దస్య పరార్థాభిధానే ప్రవృత్తినిమిత్తత్వముపయాంతి ఇతి కేచిత్. స్వార్థసహచారిగుణాభేదేన పరార్థగతా గుణా ఏవ లక్ష్యంతే ఇత్యపరే. ఉక్తం చాన్యత్ర;

"అభిధేయావినాభూతప్రతీతిర్లక్షణోచ్యతే
లక్ష్యమాణగుణైర్యోగాద్వృత్తేరిష్టా తు గౌణతా"

ఇతి. అవినాభావోऽత్ర సంబంధమాత్రం న తు నాంతరీయకత్వమ్ తత్త్వే హి 'మంచాః క్రోశంతి' ఇత్యాదౌ న లక్షణా స్యాత్. అవినాభావే చాక్షేపేణైవ సిద్ధేర్లక్షణాయా నోపయోగ ఇత్యుక్తమ్.

గౌణ శుద్ధ సంజ్ఞలు.

సారోప సాధ్యవసాన యను నీ రెండు లక్షణాభేదములును ప్రత్యేకము "గౌణౌ శుద్ధౌ" యని భేదద్వయము కలదని యీ కారిక చెప్పును. ఈ సారోప సాధ్యవసాన రూపములయిన భేదములు సాదృశ్య నిబంధనము లగునేని గౌణము లగును. "గౌర్వాహీకః గౌరయమ్" అనునవి యుదాహరణములు. స్వార్థసహచారి గుణములనుండి ప్రాప్తము లయిన వగుటచే నివి గౌణము లని వ్యవహరింతురు. ఉపమానము నందలి గుణములతో సమానము లయిన గుణము లుండుట యను లక్షణ నాధారించుకొని యుపమేయము నందు నుపమాన శబ్దము నారోపించినచో గౌణము అని భావము.

సాదృశ్యేతర సంబంధము లున్నచో శుద్ధాభేదము లగును. గౌణిలో సాదృశ్యము మాత్ర ముపయోగించు చుండును. ఇందట్లు కాదు. కార్యకారణభావము జన్యజనకభావము మొదలయిన సంబంధము లిందు రూపము సంపాదించును.

వాచ్యార్థమున కిచట బాధ యున్నది. కావున ముఖ్యార్థ సంబంధ మయిన యర్థమును గ్రహింప వలయును. స్వార్థ మయిన గోత్వమునకు సహచారు లయిన జాడ్యమాంద్యాది గుణముల రూప మయిన యర్థము లక్ష్యార్థము. ఈ లక్ష్యార్థమునే ప్రవృత్తి నిమిత్తముగా జేసికొని గోశబ్ద మభిధచే బాహీకార్థము నుపపాదించును. లక్షణచే జాడ్యాదులను అభిధచే బాహీకుని చెప్పు ననుటచే లక్షణాభిధా వృత్తి ద్వయమవసరమని తేలినది. ఈ రెండు వృత్తులచే జాడ్యమాంద్యాదివదభిన్నుడు బాహీకుడు * అని బోధ కలుగును. అని

ఈ పక్షము మమ్మట పాదుల కిష్టము కాదు. అందిది బీజము. గోశబ్దమునకు బాహీకార్థము నందు సంకేతము లేదు. కావుననే గోశబ్దము బాహీకార్థము నభిధచే బ్రతిపాదించుటకు సమర్థము కాదు. ఇంకను జాడ్యమాంద్యాదులు లక్ష్యములు కదా! లక్ష్యార్థమున కెచ్చటను సంకేత ముండదు. కాన నవి ప్రవృత్తి నిమిత్తములు కానేరవు. గోగతజాడ్యాదులు బాహీకునం దుండు ననుటయు యుక్తము కాదు. ఒక యర్థమునందు లక్షణ, వేరొక యర్థము నం దభిధ యను యత్న గౌరవము దోషము. అసమ్మత మయిన యర్థము ననుసరించి యభిధ ప్రవర్తించుటయు దోషము.

ద్వితీయమతము :— స్వార్థసహచారిగుణాభేదమునఁ బరార్థగతము లయిన గుణములె లక్ష్యమాణము లగును. కాని పరార్థ మభిహితము కాదని కొందరందురు. తదభిప్రాయ మిట్లు వివరింప వచ్చును. స్వార్థము గోత్వము. జాడ్యమాంద్యాదిగుణములు తత్సహచరులు (సంబద్ధములు కూడి యుండు నవి) వానికి బాహీక సంబద్ధము లయిన జాడ్యమాంద్యాది గుణములతో నభేదము కలుగును. ఈ యభేదమున బరార్థ (బాహీక) గత జాడ్యమాం

* "గౌర్బాహీకః" బాహీక దేశపురుషుడు పశువు. అని యర్థము. పంజాబుదేశము బాహీకదేశము. అచటి మానవుడు బాహీకుడు. అని కొంద రందురు. బాహీకదేశమునకే "ఆష్టక్క" దేశమను పేరు కలదని హేమచంద్రు డనుచున్నాడు. బాహీకుడు జర్తిక జాతీయుడు. "జాఠ" అని ప్రసిద్ధి కలదట. బాహీకులు ధర్మబాహ్యులు. అశుచులు. నిందితవృత్తులును "బహిర్భవో బాహీకః" అను వ్యుత్పత్తిని బట్టి శాస్త్రీయాచార బహిర్భూతుఁడు బాహీకుడు అని కొందరందురు.

ద్యాది గుణములే గోశబ్దముచే లక్ష్యమాణము లగును. అంతియే కాని పూర్వమతము నందు వలె పరార్థ మభిధచే ప్రతిపాదితము కాదు. లక్ష్యమాణ గుణాశ్రయమున బాహీకార్థ మవభాసించును. కాఁగా గోగత జాడ్యమాంద్యాది గుణసదృశ జాడ్యమాంద్యాది గుణవంతుఁడు బాహీకుఁడని బోధ కలుగును.

ఈ పక్షమును మమ్మటుని కిష్టము కాదు. గోశబ్దమునకు "జాడ్యమాంద్యాది గుణములు" అని లక్ష్యార్థము కదా! బాహీకశబ్దమునకు బాహీక దేశనివాసి యని యర్థము. కాఁగా "గౌర్బాహీకః" యను వాక్యమునకు "జాడ్యమాంద్యాదిగుణములు బాహీకుఁడు" అని యర్థము లభించును. ఇది సంగతమా? అందుచే వీనికి సహప్రయోగ ముపపన్నము కాదు. దీని యుపపత్తికై జాతి వ్యక్తి నాక్షేపించినట్లు (గోచరింపఁజేయుట) గుణములు గుణి నాక్షేపింప వచ్చునన్న యూహతో జాడ్యాదిగుణములు జాడ్యాదిగుణవంతు నాక్షేపించునని యాక్షేపము నాశ్రయింప వలసి యున్నది. కాఁగా గౌరవదోషము వాటిల్లును. ఇందు పరార్థప్రతీతిలో నభిధ నంగీకరించుట లేనందు వలన పూర్వమువలె యత్నగౌరవము లేదు కదా! ఇట్టి పక్షము నం దరుచి యున్నది.

మూఁడవ పక్షము :— ఇది మమ్మట పక్షము. కావున స్వమతము. సాధారణ గుణాశ్రయముగా పరార్థమే లక్ష్య మగును. అని యీ పక్ష రూపము. దీనిభావ మిది. గోగత జాడ్యమాంద్యాది గుణములు బాహీకగత జాడ్యమాంద్యాది గుణసదృశములు. రెండిటియందును సాధారణగుణములు. వీని నాశ్రయించి పరార్థమయిన బాహీకుఁడె గోశబ్దమున లక్ష్యమాణుఁ డగును. జాడ్యమాంద్యాది గుణవిశిష్టము నందే లక్షణ. ఇట్లు పరార్థమే లక్ష్య మగును. జడిమాది గుణములు లక్ష్యము లగుననుట కాదు. పరార్థ మభిధీయమాన మగుననుటయు గాదు. కావున పై దోషము లేవియు వాటిల్లవు.

శబ్దారోప పూర్వక మయిన యర్థారోపము లక్షణ యని కొందరందురు. అర్థారోప పురస్సర మగు శబ్దారోపమె లక్షణయని యన్యులందురు. సమప్రాధాన్య ముండుట వలన రెండిటి యారోపమె లక్షణ యని విజ్ఞుల వచనము. కావ్యవ్యవహారమున నంతట శబ్దార్థము లవినాభావులు. కావున నిదియె సమీచీన సరణి.

యనుమానోత్థాపకమె యగును గాని లక్షణాహేతువు గాఁజాలదు. కాన నిం దవినాభావశబ్దము నాంతరీయకార్థము కాదు. (‘‘అంతరేణ=వినా అంతరం, నాంతరమేవ నాంతరీయకం) పిదకేకస్వ కెయ్యట యుండదో యది నాంతరీయకము. అవినాభావి యని భావము. నాంతరీయకత్వము, వ్యాప్తి ప్రతిబంధము, అనౌపాధికము, సంబంధము, అవినాభావము, అపృథగ్భావము అనునవి యేకార్థములే. అయిన నవినాభావము సామాన్యముగా సంబంధమాత్రమె. అట్లు గాక వ్యాప్తిరూపార్థమునే గ్రహించితిమో ‘‘మంచాః క్రోశంతి’’ మంచేలాక్రోశించుచున్నవి. అనుచోట మంచశబ్దమునకు మంచస్థపురుషులందు లక్షణ యుండదు పోవును. మంచ అచేతనము లగుట నాక్రోశనము సంభవింప దందున క్రోశనసిద్ధికై మంచస్థపురుషుల యందు లక్షణ నంగీకరించుట యభీష్టము. మంచపురుషుల కవినాభావము లేదు కదా! నిత్య మచట పురుషుఁడు డునేమి? ‘‘యత్ర యత్ర మంచాః తత్ర తత్ర పురుషాః’’ అను వ్యాప్తి యచట లేదు. వ్యాప్తిరూప మగు నవినాభావమాక్షేపముననే సిద్ధించును ఆక్షిప్తమున లక్షణ యవసరమె కాదు. చూడుడు! గోపదమునకు గోత్వ మర్థము. గోత్వము గోవ్యక్తి విడిచి యుండదు. ఆ రెండిటి కవినాభావ మున్నది గోవ్యక్తి వినా జాతి యుండ నేరక గోవ్యక్తి నాక్షేపమున గోచరింప జేయును గదా! అవినాభావము వ్యాప్తి రూపమే యగునో లక్షణ యవసరము కాదని తదుపయోగమే లేదని ‘‘గౌరనుబంధ్యః’’ యను స్థలమున నిరూపితమె యయినది. కాఁగా ‘‘గౌర్వాహీకః’’ యను స్థలమున మమ్మటులు నిర్ణయించిన యర్థము ప్రాచీనుల సూక్తితో సంవాదము పొందు చున్నదని నిర్గలితార్థము.

★ ‘‘ఆయుర్ఘృతం, ఆయురేవేదం’’ ఇత్యాదౌ చ సాదృశ్యా దన్యత్ కార్యకారణభావాది సంబంధాంతరం. ఏవమాదౌ చ కార్యకారణభావాది లక్షణ పూర్వే ఆరోపాధ్యవసానే. అత్ర గౌణభేద యోర్భేదేఽపి తాద్రూప్యప్రతీతిః సర్వథైవాభేదావగమశ్చ ప్రయోజనం. శుద్ధభేదయోస్త్వన్యవైలక్షణ్యేనావ్యభిచారేణ చ కార్యకారిత్వాది ప్రయోజనం క్వచిత్ తాదర్థ్యాదుపచారః యథా; ఇంద్రార్థా స్థూణేంద్రః. క్వచిత్ స్వస్వామిభావాత్. యథా; రాజకీయః పురుషో రాజా. క్వచిదవయవావయవిభావాత్, యథా; అగ్రహస్త

ఇత్యత్రాగ్రమాత్రేఽవయవే హస్తః. క్వచిత్ తాత్కర్మ్యాత్,
యథా; అతక్షా తక్షా.

— "లక్షణా తేన షడ్విధా"

ఆద్యభేదాభ్యాం సహ.

## సాదృశ్యేతర సంబంధములు.

ఇప్పటికి ప్రఘట్టమున "గౌర్వాహీకః, గౌరయం" అనునవి సాదృశ్యసంబంధ మూలక గౌణీలక్షణయొక్క సారోప సాధ్యవసానోదాహరణము లని నిశ్చిత మయినది. సాదృశ్యభిన్నము లయిన సంబంధములు మూలముగా శుద్ధాలక్షణ యొక్క సారోప సాధ్యవసానోదాహరణముల నిరూపింపవలయును.

"ఆయుర్ఘృతం యశస్త్యాగః భయం చోరేః సుఖం క్రియా
వైరం ద్యూతం గురుర్జ్ఞానం శ్రేయస్తీర్థనిషేవణం"

అనుచోట ౧. "ఆయుర్ఘృతం" అనునది శుద్ధసారోపలక్షణోదాహరణము. ఇందాయువు జన్యము. ఘృతము జనకము. రెండిటికి జన్యజనకభావ సంబంధము కలదు. ఈ ద్వయమున కభేదములక్షణచే గ్రహింపవలయును. ఘృత మాయుర్జనక మగుట వలన నాయుశ్శబ్దమున లక్షిత మగుచున్నది. ఘృత మాయురభిన్న మని యర్థబోధ కలుగును.

౨. "ఆయురేవేదం" అనునది శుద్ధసాధ్యవసాన లక్షణోదాహరణము. 'ఇదం' శబ్దము పురోవృత్తిత్వరూపమున ఘృతమును బోధించునే కాని ఘృతత్వరూపమున బోధింపదు. కావుననే విషయవాచక పద మున్నదని శంకింప నవసరము లేదు. ఈ మొదలయిన వక్ష్యమాణోదాహరణములందు సాదృశ్యము కన్న నితరమగు కార్యకారణ భావాది సంబంధాంతర మున్నది. ఇట్టి యీ యుదాహరణములందు కార్యకారణభావాది స్వరూప మయిన సాదృశ్యేతర సంబంధము హేతువుగా సారోపము అధ్యవసానము నుపపన్నము లగుచున్నవి.

## గౌణిలోని ప్రయోజనము

ఇచట నుపచారమిశ్ర యగు లక్షణలో గౌణీభేదము లయిన సారోప సాధ్యవసానల ప్రయోజనము చెప్పవలసి యున్నది. "గౌర్వా

హీకః" అను సారోపలో తాద్రూప్యప్రతీతి ప్రయోజనము. "గౌరయం" అను సాధ్యవసానలో సర్వవిధముల నభేదప్రతీతి ప్రయోజనము. సారోపలో సాదృశ్యసంబంధమున గోవునకు బాహీకునకు తాద్రూప్య మవగత మగును. సాధ్యవసానలో గోవునకు నెదుట నున్న పిండమునకును (పదార్థము, బాహీకుడు) సర్వప్రకారముల భేదప్రతీతి లేకుండగనే యభేదము భాసించును. ఈ సారోపసాధ్యవసానలలో రెండిటను "గౌః" "బాహీకః" "గౌః" "అయం" అని పదద్వయ నిరూపిత మయిన భేదము (వైధర్మ్యము) భాసించుచున్నను తాద్రూప్యము సర్వథాఽభేదము ప్రయోజనముగా గోచరించును. (తస్య రూపం తద్రూపం తద్రూపస్య భావః తాద్రూప్యం) రెండు రూపములు వేరుగా నున్నను విషయిరూపమె విషయము నందవ భాసించుట తాద్రూప్యము. రెండిటి కెట్టి భేదమును గోచరింపక పోవుట యభేదప్రతీతి.

### శుద్ధలోని ప్రయోజనము

సాదృశ్యేతర సంబంధమున సిద్ధము లగు శుద్ధ సారోప సాధ్యవసాన లందిట్లు ప్రయోజన ముండును. "ఆయుర్ఘృతం, ఆయురేవేదం" అను చోట కార్యకారణ భావ సంబంధ మున్నది. సారోపలో నన్యవిలక్షణముగా ఘృతము కార్యకారి యగునని గోచరించును. "ఘృత మాయుష్యమును బుట్టించును. క్షీరాదిక మిట్లు కాదు. కాన క్షీరాదుల కన్న నాయుర్జననమున ఘృతము విలక్షణము" అని యవభాసము. సాధ్యవసానలో నవ్యభిచరితముగ (అవశ్యముగ, నియమముగ) ఘృతము కార్యకారి యగుట భాసించును. పూర్వమువాని వలె నీ రెండు నభేదప్రతీతి పూర్వకముగనె ప్రయోజనము నభివ్యంజనము చేయును.

### ఇతర సంబంధములు

సాదృశ్యేతర సంబంధము లనేకములు కలవు. ౧. తాదర్థ్యసంబంధము. ౨. స్వస్వామిభావసంబంధము. ౩. అవయవావయవిభావ సంబంధము. ౪. తాత్కర్మ్యసంబంధము. ఇట్టి యితరములు. వీనియుదాహరణము లిట్లుండును.

౧. తాదర్థ్యము "తస్మై ఇదం తదర్థం, తదర్థస్య భావః తాదర్థ్యం" దాని కొఱకగు నది తదర్థము తదర్థమగుట తాదర్థ్యము. ఉపకార్యోపకా

రక భావరూప మయిన సంబంధ మిందుండునని తాత్పర్యము. ఇంద్రార్థము లయిన స్థూణములను "ఇంద్రా" అందురు. ఇది దీని యుదాహరణము. యజ్ఞకర్మలో నింద్రునికై స్థూణములను నివేదింతురు. స్థూణ మనగా స్తంభ విశేషము. అది యింద్రపూజనార్థమై నివేదితమగు చున్నందున "ఇంద్ర" నామమున వ్యవహరించుట యున్నది. ఇంద్రపూజా ప్రయోజనికి స్థూణమును "ఇంద్ర" మనుట యుపచారము. లక్షణచే సమానాధికరణముగా ప్రయోగ మున్నది కదా! కాంగా నింద్రార్థస్థూణము లందింద్ర పదప్రయోగము లాక్షణిక మనియు నచట తాదర్థ్య రూపసంబంధమున లక్షణ ప్రవర్తించిన దనియు గ్రహింప వలయును. ఇష్టప్రదత్వము ఇంద్రునకు వలె పూజ్యత్వము అవశ్యము పూజ్యమానత్వము నను ప్రయోజన మిచట వ్యంగ్యము.

౨. స్వస్వామిభావము. ఇదియే సేవ్యసేవక భావము. కొన్ని యెడల నీ సంబంధమును వివక్షితము. స్వామి యగు రాజు సేవకుఁడు సచివుఁడు మొదలయిన రాజకీయ పురుషులను "రాజు" అని యనుట కలదు. రాజునకు నా రాజకీయపురుషునకు గల సేవ్యసేవక భావసంబంధమున నట్టి లాక్షణిక పదప్రయోగ ముపపన్నము. సేవ్యమానత్వము, అవశ్యసేవ్యమానత్వము అలంఘనీయాజ్ఞత్వ మింము ప్రయోజనము.

౩. అవయవావయవిభావము. ఇదియె యంగాంగి భావము. "అగ్రహస్త మనుచోట అగ్రమాత్రావయవము నందు హస్త మను ప్రయోగము కలదు. అగ్రం చ తత్ హస్తశ్చ అగ్రహస్తః యని కర్మ ధారయ సమాస విగ్రహము. హస్తమనఁగాఁ జాచిన చేయి. ఇరువదినాలు గంగుళముల ప్రమాణము కలది. దాని యగ్రభాగ మాత్ర మయిన యవయవమునందు (కేవలము ముంజేయి యందు) ఇట్టి హస్తపద ప్రయోగము లాక్షణికము. హస్తావయవమునసే హస్తవ్యాపారము చేయుటను బలాధిక్యము ప్రయోజనముగా వ్యంగ్య మగును. కొంద రగ్రహస్త మనునది యఖండపద మందురు.

౪. తాత్కార్మ్యము. తత్కార్మకారిత్వరూప మయిన సంబంధ మునను లక్షణ యున్నది. (అతక్ష తక్ష) వడ్రంగి కాని వాని వడ్రంగి యనుట. తక్ష వడ్రంగి. ఈ పదము జాతివిశేషము నందు రూఢము. ఒకొ్క

కుండు తా నాజాతికి సంబంధింపకపోయినను జీవనమునకై యీ జాతివ్యాపారము నాశ్రయించుటచే నా జాతినామమున పిలువబడును. దారుకర్మలో ప్రవీణుడయిన నిపుణుడగు బ్రాహ్మణుడును "వడ్రంగి." ఆ కర్మనైపుణ్యము వ్యంగ్యమగు ప్రయోజనము.

ఈ నిరూపితసంబంధములే కాక యితర సంబంధములును గలవు. "ఏకశతం షష్ట్యర్థాః" సంబంధములు నూటికి పై నొకటి యని విజ్ఞుల వచనము. మానము ధారణము ఆధిపత్యము స్థానము మొదలయిన సంబంధములు నిర్దేశించి యుదాహరించుట గ్రంథగౌరవము. సాదృశ్యేతరసంబంధము లెన్నియున్నను శుద్ధలక్షణ యనియె గ్రహింప వలయును. వీని యందు నన్నిట సారోపసాధ్యవసానము లుండుననియు దెలియునది.

## ల క్ష ణా షా డ్వి ధ్య ము.

ఈ యంశముతో లక్షణావిషయ ముపసంహృత మగును. ఈచెప్పిన ప్రకారమున లక్షణ షడ్విధ యగును. శుద్ధ, గౌణి, సారోప, సాధ్యవసాన, ప్రయోజన లక్షణ భేదములచే నిది యారు విధములు "సారోపాన్యాతు" అని భేదచతుష్టయమె కలదు. కాని మొదట నిరూపించిన ఉపాదానలక్షణ లక్షణలక్షణ భేదముల రెండిటిని గలుపుకొనినచో నారు భేదము లగును.

ఇట్లే విభాగములను గుర్తింప నగును. లక్షణ మొదట రెండు విధములు. శుద్ధాలక్షణ, గౌణీలక్షణ యని. శుద్ధాలక్షణ నాలుగు విధములు. ఉపాదాన లక్షణ, లక్షణలక్షణ, సారోపలక్షణ సాధ్యవసానలక్షణ యని. గౌణిలక్షణయు రెండు విధములు, సారోప సాధ్యవసానయని. ఈ భేదనామముల నిట్లు వివిక్తముగా గ్రహింపవచ్చును.

౧. శుద్ధ ఉపాదాన లక్షణ
౨. శుద్ధ లక్షణ లక్షణ
౩. సారోప శుద్ధాలక్షణ
౪. సాధ్యవసాన శుద్ధాలక్షణ
౫. సారోప గౌణోపచార లక్షణ
౬. సాధ్యవసాన గౌణోపచార లక్షణ

రూఢిలక్షణ యని వేరొకటి కలదు. దానినే నిరూఢలక్షణ యం దురు. ఈ యంశము ముందు స్పష్ట మగును. ఇచటి లక్షణాషాడ్విధ్య కథనము ప్రయోజన లక్షణా భేదకథన పరమని గ్రహింపనగును. వస్తుతస్తు రూఢిలక్షణ ప్రయోజనలక్షణ యన్న భేద మవసరము కాదు. లక్షణోత్థాన ములో రూఢిప్రయోజనములు హేతువులే కాని విభాజకములు కావు.

భే ద ప్ర యో జ న ము

ఒక విషయము నిచట గుర్తింప వలయును. లక్షణ ప్రదర్శించిన మాత్రముననె లాక్షణిక శబ్దనిరూపణము చేసి నట్లగును. ఆరువిధమూ లని వేరుగా జెప్పుట యవసరము కాదు. అయిన నట్లు కథనము కావ్యభేదము లం దవి యుపయోగించునని సూచన. చూడుడు. ఉపాదాన లక్షణ యర్థాంతర సంక్రమిత వాచ్య ధ్వనిలో లక్షణలక్షణ యత్యంతతిరస్కృత వాచ్య ధ్వనిలో గౌణ సారోప రూపకాలంకారములో గౌణ సాధ్యవసాన మొదటి యతిశయోక్తిభేదములో నుపయోగించును. శుద్ధలోని సారోప సాధ్యవసానలు వ్యంగ్యవిశేషమును సూచించుటలో నుపకారకములు. ఈ రెండు భేదములు హేత్వలంకారమున ప్రయోజకము లని కొందరి భావము.

★ సా చ:

"వ్యంగ్యేన రహితా రూఢౌ సహితా తు ప్రయోజనే"

ప్రయోజనం హి వ్యంజన వ్యాపార గమ్యమేవ.

"తచ్చ గూఢమగూఢం వా"-తచ్చేతి వ్యంగ్యం గూఢం యథా;

ముఖం వికసితస్మితం వశితవక్రిమ ప్రేక్షితం
సముచ్ఛలిత విభ్రమా గతిరపాస్తసంస్థా మతిః
ఉరో ముకులితస్తనం జఘనమంసబంధోద్ధురం
బతేందువదనాతనౌ తరుణిమోద్గమో మోదతే.

అగూఢం యథా;

శ్రీః (శ్రీ) పరిచయాజ్జడా అపి భవంత్యభిజ్ఞా విదగ్ధ చరితానాం
ఉపదిశతి కామినీనాం యౌవన మద ఏవ లలితాని

అత్రోపదిశతీత్యనాయాసేన శిక్షాదానమభిధేయవత్ స్ఫుటం ప్రతీయతే.

—: “తదేషా కథితా త్రిధా.”

అవ్యంగ్యా, గూఢవ్యంగ్యా, అగూఢవ్యంగ్యా చ.

“తద్భూర్లాక్షణికః :—

శబ్ద ఇతి సంబధ్యతే. తద్భూస్తదాశ్రయః.

—: తత్ర వ్యాపారో వ్యంజనాత్మకః”

### లక్షణలోని వ్యంగ్యము.

ఇట్టి విధమున లక్షణ షడ్విధ యని నిరూపితము. వ్యంజన కృతముగా నీ లక్షణకు భేదత్రయ మున్నది. అది యిక నిరూపణీయము.

ఇంతవరకు లక్షణాపరీక్ష యయినది. వ్యంజనము లక్షణా మూలము. ఆ వ్యంజనను ప్రతిష్ఠింప వలసి యున్నది. తదుపక్రమ మెట్లన్నట్లు భావింప వలయును. రూఢి యుండగా నా లక్షణ వ్యంగ్యార్థ రహితముగా నుండును. ప్రసిద్ధనిబంధనముగా కుశలాదిపదములను ప్రయోగించి నపుడు లక్షణ వ్యంగ్యయుక్తము కాదు. రూఢిలక్షణలో లక్ష్య లక్షక భావము వాచ్యవాచకభావ ప్రాయముగనే యుండును. ప్రయోజన ముండునేని లక్షణ వ్యంగ్యార్థసహితముగా నుండును. ప్రయోజనవతి లక్షణలో వ్యంగ్య మవశ్యముగా నుండును. ఆ ప్రయోజనము వ్యంజన వ్యాపారైక సమధిగమ్యమే కావలయును గదా! ప్రయోజనము వ్యంగ్యమేకార్థములు. ఫలసాహిత్యమున వ్యంగ్య సాహిత్య మని తేలినది. లక్షణలోని ఫలము వ్యంజనద్వారముననే గోచరింప వలయును. అందలి యాఫలము వ్యంగ్యము.

### తద్భేదములు.

లక్షణలో ఫలీభూతముగా నుండు వ్యంగ్య మొకచో గూఢముగా నుండును. వేరొకచోట నగూఢముగా నుండును. లక్షణా భేద ప్రయోజకము లయిన యారోపాదికము భేదము కలదయినట్లు వ్యంగ్యము కూడ నైన చెప్పిన విధమున భేదము కల దగును. కావ్యభావనా పరిపక్వమతు లయిన సహృదయులకు మాత్రము గోచర మగునది గూఢవ్యంగ్యము. అట్లు కాని దగూఢవ్యంగ్యము. గూఢవ్యంగ్య మున్నచో ధ్వని యని. యగూఢ మున్నచో గుణీభూత మని గ్రహింప వచ్చును.

## గూఢవ్యంగ్యము.

ఒక తారుణ్యశాలి యొక కమనీయకామిని జూచి యిట్లు వర్ణించు చున్నాడు. ఈ పద్యము లక్షణామూలధ్వని యుదాహరణము. ఈ చంద్ర వదన శరీరము నందు తారుణ్యావిర్భావ మత్యంతము పరిస్ఫీతమై యున్నది కదా! ఆమె ముఖమున స్మితము వికసించినది. చూపు వక్రిమను వశీకరించు కొనినది. గమనములో విభ్రమములు సముచ్ఛలితము లగుచున్నవి. మతి నియతస్థితిని విడిచినది. ఉరమున స్తనములు ముకుళితము లయినవి. జఘనము (కటిపురోభాగము. ఊరుమూలభాగము) అంసబంధ మనకు తగి యున్నది. ఇది సామాన్యముగా శబ్దార్థము. ఇందు లక్ష్యాంశ మేది? వ్యంగ్యాంశ మేది? అందలి గూఢత యెట్టిది? వీని నిక ప్రతిపాదింపవలయును.

వికాసము పుష్పధర్మము. అది స్మితమున నుపపన్నము కాదు. కాన ముఖ్యార్థభంగము. కొంత యుబలాటముతోఁ గూడిన యవస్థ యుండుట లక్ష్యము. సంకోచ మేమియు లేకుండుట యను సాధర్మ్యము సంబంధము. పుష్పము నందు వలె ముఖమున సౌరభాదు లుండుట వ్యంగ్య మయిన ఫలము. వశీతవక్రియ వశీతత్వము చేతనస్వభావము; అది నయనక్రియ యయిన వక్రిమలో ఘటింపదు. కాన ముఖ్యార్థ బాధ. వక్రిమలు స్వాధీనము లయిన వని స్వాధీనత లక్ష్యము. తా నభిలషించిన విషయముల నవగాహనము చేసికొనుట యను సాధర్మ్యము సంబంధము. తగిన తరుణునిపై ననురాగము కలదని వ్యంగ్యము. సముచ్ఛలితవిభ్రమ = సముచ్ఛలనము కదలిక మూర్తవస్తువుల ధర్మము. భావవిశేష మయిన విభ్రమము నందది యుపపన్నము కాక పోవుట ముఖ్యార్థబాధ. విభ్రమము లతిశయముగా నున్నవనుట లక్ష్యము. అనతిశయితమున నుచ్ఛలన ముండదు గావున నిచట సముచ్ఛలనమై యుండుటచే, కార్యకారణభావము సంబంధము. ఎదురుబడి యభియోగించి పొందఁ దగి యున్నదని వ్యంగ్యము. అపాస్తసంస్థ = సంస్థ తనకు సంబంధించి యుండు నవస్థ. తత్పరిత్యాగము చేతనధర్మము. చిత్త వృత్తిరూప మయిన మతిలో నది సంభవింపదు. తత్సమయమున వైదగ్ధ్య ముండుట లక్ష్యము. కార్యకారణభావము సంబంధము. పెద్దల సమీపమున వ్యలీకగోపనము వ్యంగ్యము. ముకులితస్తన = ముకులనము పుష్పధర్మము: స్తనము లందది బాధితము. అంగనాస్తనముల ముకులనము స్తనముల జృంభణ

మున కున్ముఖములుగా నుండుటను లక్ష్యము చేయును. అవయవముల యపరిస్ఫుట రూప మయిన సాధర్మ్యము సంబంధము. మహోన్నతియ ముండుట వ్యంగ్యార్థము. అంసబంధోత్సుర = అంసబంధ మనునది దేహ స్వభావము. కేవల మొక యవయవమునకుఁ గుదురదు. జఘనము మాత్రము మాంసలము (కండకలది) గా నున్నదని లక్ష్యము. గుణగుణిభావము సంబంధము. ఉపభోగ యోగ్య మయిన వయస్సు కలిగి యుండుట వ్యంగ్యము. తరుణిమోద్గమ = ఉద్గమ ము[illegible] మూర్తధర్మము. అది తారుణ్యమున నెట్లుండును? దాన మొ[illegible] ప్రథమసమున్నతి లక్ష్యము. కార్యకారణభావము సంబంధము. ఉన్న[illegible]కి యుద్గమనము శక్యము కాదు కదా! అవయవములు విస్పష్టములుగా [illegible] వని వ్యంగ్యము.

మోదతే = మోదమును చేతనస్వభావము. తరుణిమోద్గమమును సం దది సంభవింపదు. కాన ప్రకటప్రసారత లక్ష్యము. సామాన్యవిశేషభావము సంబంధము. చిత్తమునకు బ్రసరించు స్వభావ ముండునప్పుడే సుఖానుభవ ముండును. ఆ యౌవనారంభ మితరసాధారణము కాదని వ్యంగ్యము. ఇట్టి యర్థమంతయు గూఢముగఁ జమత్కరించుచున్నది. ఇది కావ్యభావనా పరిపక్వహృదయులకు గాని గోచరింపదు. కావున నిది గూఢవ్యంగ్యము

## అగూఢ వ్యంగ్యము

ఒక్కొక చోట లక్ష్యార్థము వాచ్యాయమానముగా నుండుటచే ఝటితి ప్రతీత మగును. అట్టి స్థలమందు వ్యంగ్యము అగూఢము.

పామరజనులును స్త్రీప్రథమ పరిచయము వలననే చతురుల వ్యవహారములను దెలిసికొన గలరు. స్త్రీల కట్టి యా లలితములను యౌవన మదమే యుపదేశించును. స్త్రీలకు దారుణ్య ప్రాదుర్భావముననే విలాసములు స్వభావసిద్ధము లగును. వారి ప్రథమపరిచయముననె మందబుద్ధులు కూడ అదివరలో దమకు దెలియని యభ్యస్తములు కాని విలాసుల విలాస చేష్టితముల కలవడుదురు. ఈ పద్యము నందు "స్త్రీపరిచయా" త్తను చోట "శ్రీపరిచయా" త్తని పాఠ మున్నది. ఎంతటి యనభిజ్ఞు లయినను శ్రీదేవి యభినవసంబంధమున విదగ్ధవ్యవహారవిదులు కాగలరని భావము.

ఈ పద్యమునం దుపదేశ మనునది యాచార్యుని ధర్మము. శబ్దాది ప్రయోగము ద్వారా యది చేతనధర్మము. తారుణ్యమునందమున కుపపన్నము

కాదు. అజ్ఞాతజ్ఞాపనము చేయుట యనునది లక్ష్యము. సామాన్యవిశేష భావము సంబంధము. అనాయాసముగా నది సంపన్న మగుట వ్యంగ్యము. ఇది సహృదయునకు గాని యసహృదయునకు గాని వాచ్యార్థము వలె గోచరించును గాన అగూఢమని గ్రహింప వలెను.

### త్రివిధ వ్యంగ్యము

అవ్యంగ్యము గూఢవ్యంగ్యము అగూఢవ్యంగ్యమన్న భేద మున్నంద మన లక్షణ త్రివిధ మయినది. రూఢిమూల మయినచో నవ్యంగ్యము ప్రయోజన మూలమున గూఢవ్యంగ్య మగూఢవ్యంగ్యము నని మూడు విధము లగుట స్పష్టము.

### లాక్షణిక శబ్దము

పూర్వోపదిష్ట మయినది లాక్షణికశబ్దము. దాని స్వరూపమునె లక్షింప వలయును. ప్రసంగవశమున నవాంతర భేద సహితముగా లక్షణ నిరూపిత మయినది. లాక్షణిక శబ్ద మిందు నిర్వాచిత మగును. వ్యంగ్యార్థ సముద్భూతి లాక్షణిక నిబంధన మనియు నిందు సూక్త మగును. తద్భూః= తదాశ్రయము. లక్షణాశ్రయ మయిన శబ్దము లాక్షణిక శబ్దము. పూర్వము చెప్పిన వ్యంగ్యమున కుత్పత్తిస్థాన మయిన శబ్దము లాక్షణిక మనియు భావము. "గంగాయాం ఘోషః" యనుచోట ప్రవాహరూపార్థము లక్షణాశ్రయ మయిన బ్లుపచరితము. తద్వాచక మయిన శబ్దము లక్షణా రూప వ్యాపారాశ్రయ మని భావము. ఇట్లు లాక్షణిక శబ్దమును నిరూపించుటచే "లాక్షణిక శబ్దప్రతిపాద్యము లక్ష్యార్థ మని" లక్ష్యార్థ లక్షణము కూడ చెప్పి నట్లయినది.

★ కుత ఇత్యాహ;

"యస్య ప్రతీతిమాధాతుం లక్షణా సముపాస్యతే
ఫలే శబ్దైకగమ్యేఽత్ర వ్యంజనాన్నాపరా క్రియా."

ప్రయోజన ప్రతిపిపాదయిషయా యత్రలక్షణయా శబ్దప్రయోగ స్తత్ర నాన్యత స్తత్ప్రతీతిః అపి తు తస్మాదేవ శబ్దాత్. న చాత్ర వ్యంజనాదృతేఽన్యోవ్యాపారః.

లక్షణామూలవ్యంజన

ఇట్లింతదనుక ప్రథమోల్లాసమున లక్షణావృత్తి నిరూపిత మయినది. ఇక క్రమ ప్రాప్త మయిన వ్యంజనావృత్తిని నిరూపింప వలసి యున్నది. అనంతరము వ్యంజకశబ్ద ప్రతిపాదన మపేక్షితము. వ్యంజన శబ్దార్థమూల మని రెండు విధములు. అందర్థమూలము శబ్దలక్షణమున నుపయుక్తము కాదు. అది తృతీయోల్లాసమున వివేచనీయము కాగలదు. శబ్దమూల వ్యంజన యభిధామూలముగా లక్షణామూలముగా ద్వివిధమని ప్రసిద్ధి. ప్రకృతక్రమమున నభిధామూలమునకు ప్రాధాన్య మున్నది. దానినే మొదట నిరూపించుట సముచితము. అయిన నిచట లక్షణామూలవ్యంజనయె నిరూపణము పొందును. లక్షణామూలము స్థూలముగా సుజ్ఞానము. లక్షణా ప్రయోజన నిర్వాహక మగుట సుబోధము. అందుచే దత్ప్రస్తావన మిచట రూపము పొందును. .........లాక్షణిక శబ్దమె వ్యంగ్యార్థ ప్రకాశక మయినచో నా రెండిటి వ్యాపార మెట్టిది? ఈ వ్యాపారము లక్షణయె యగునో వ్యంగ్యము లక్షణీయమె యగు నేమొ? అను శంకానివృత్తికై యిది యవసరప్రాప్తము.

లాక్షణిక శబ్దము నందు ప్రయోజన ప్రకాశనానుకూల మయిన వ్యాపారము వ్యంజనాత్మకముగా నుండును. వ్యంగ్యరూప మయిన యర్థము యొక్క ప్రతీతిని సంపాదించుటకు లక్షణాశక్తిని స్వీకరించు చున్నారు కదా! అట్టి స్థలములందు లాక్షణికశబ్దము మాత్రమె నిరూపించు నా ప్రయోజన విషయమై వ్యంజనాతిరిక్త మగు వ్యాపార మేమియు లేదు.*

వ్యంజనయె వ్యంగ్యము నిరూపించును. ఏల! ఇందు ప్రమాణమేమి? ప్రతిజ్ఞామాత్రమున నిష్టము సిద్ధించు నేమి? లక్షణయె వ్యంగ్యమును నిరూపింపదా! ఏతత్సమాధానముగా నిది యవతార్యము. "యస్యప్రతీతి" యని లక్షణావృత్తి ప్రయోజనైకప్రాణ మని యీ కారికావిష్కారము.

* "తద్భూల్లాక్షణికః" "తత్ర వ్యాపారో వ్యంజనాత్మకః" యను స్థలము లందు "తత్ తత్ర" పదములను లక్షణా లక్షక పరముగ గొందరును, వ్యంగ్యార్థ పరముగ గొందరును సమన్వయము ప్రవర్తించిరి. ఆ రెండు భావములను జూపుట యుక్తమని తోచినది. ఇందలి యౌచిత్యము విజ్ఞులకు భావనీయము.

ఇందు లక్షణాపదము లక్షకశబ్దపదము. "గంగాయాం ఘోషః" యను చోట శీతత్వ పావనత్వాది రూప మయిన ప్రయోజనమున కనుభవ రూప మయిన ప్రతీతి నాధానించుటకు (కలుగఁజేయుటకు) వాచకశబ్ద మున్నను దాని విడచి లక్షకశబ్దము నంగీకరించు చున్నారు. వేరొక గతి లేనందున లాక్షణిక శబ్దమునే గతిగా నాశ్రయించుట వలన ఫలము శబ్దైకగమ్య మయి నది. ఆ ఫల మనుమానాది గమ్యము కాదు. అట్టి ఫలము విషయమై వ్యంజనా వ్యాపారము కన్న నితర వ్యాపార మేదియు లేదు. శబ్దము వలననే ప్రయోజన ప్రతిపత్తి కలుగుటచే వృత్త్యంతర కల్పన మవసర మయ్యెను. ఆ వ్యంగ్య ప్రతీతి యశాబ్దమె యని తలచినచో లక్షణకు మూల హానియే యగును లాక్షణిక ప్రయోగము నిష్ఫల మగును.

ప్రయోజనమును బ్రతిపాదింప వలెనని కదా! లాక్షణికశబ్దమును బ్రయోగించుట. ఏ వాక్యమున నట్టి ప్రయోగ మున్నదో యచట ప్రమా ణాంతరమున బ్రయోజన సంప్రత్యయము కలుగదు. లాక్షణిక శబ్దముననే యది యుదయించును. అచట వ్యంజన కాక యితర వ్యాపార మేదియులేదు.

★ తథా హి:

"నాభిధా సమయాభావాత్" :—

గంగాయాం ఘోష ఇత్యాదౌ యే పావనత్వాదయో ధర్మాస్తటాదౌ ప్రతీయంతే న తత్ర గంగాదిశబ్దాః సంకేతితాః.

అభిధ సమర్థము కాదు

ఏల లేదు! ప్రయోజన ప్రతిపాదనమున క్లుప్త మయిన యభిధాది వ్యాపారమె సమర్థము కాకూడదేమి? వ్యంజనయే యేల కావలయును? ఇందు యుక్తి నిర్వచింప వలసి యున్నది. ప్రమాణాంతర గోచరము కాని ఘోషము నందలి యతిపవిత్రత్వాది విషయమున శబ్దమున కితరవ్యాపారము యుక్తము కాదు. తత్సామీప్యాది హేతువుచే తద్ధర్మకత్వ మనుమానిం చుట యనైకాంతికి మగును. దీని నిట్లు విశదముగా గుర్తింప గలము.

"నాభిధా సమయాభావాత్."

సమయము = సంకేతము. అది లేనందున నభిధ ప్రయోజన ప్రతి పాదనము నందు ప్రవర్తింపదు. అభిధ సంకేత సహాయ మున్ననే ప్రవర్తిం

చును. "గంగాయాం ఘోషః" అనుచోట గంగాపద ప్రయోగమున ప్రయోజనముగా తటమున గోచరించు ముఖ్యార్థ సమవాయ మయిన శైత్య పావనత్వాది ధర్మములు అభిధా గోచరములు కావు. వాని యందు గంగా శబ్దమునకు సంకేతము లేదు. ప్రవాహము నందె యభిధా సంకేతము. "గంగాది పదనిష్ఠ సంకేత విషయము కానందున పావనత్వాది ప్రయోజనము గంగాపదాభిధా ప్రతిపాద్యము కాదు." అను ననుమానరచనచే దీని నిర్ణయింప వచ్చును.

★ —: "హేత్వభావాన్న లక్షణా"

ముఖ్యార్థబాధాదిత్రయం హేతుః. తథా చ

"లక్ష్యం న ముఖ్యం నాప్యత్ర బాధో యోగః ఫలేన నో
న ప్రయోజన మేతస్మిన్ న చ శబ్దః స్ఖలద్గతిః"

యథా; గంగాశబ్దః స్రోతసి సబాధ ఇతి తటం లక్షయతి, తద్వద్యది తటేఽపి సబాధః స్యాత్తత్ప్రయోజనం లక్షయేత్. న చ తటం ముఖ్యోఽర్థః. నాప్యత్ర బాధః. న చ గంగాశబ్దార్థస్య తటస్య పావనత్వాద్యైర్లక్షణీయైస్సంబంధః. నాపి ప్రయోజనే లక్ష్యే కించిత్ప్రయోజనం. నాపి గంగాశబ్దస్తటమివ ప్రయోజనం ప్రతిపాదయితు మసమర్థః.

లక్షణ సమర్థము కాదు

పయుక్తోదాహరణము నందు గంగాశబ్దమునకు తీరమున లక్షణ నంగీకరింప వలసి వచ్చినది కదా! ఆ గంగాశబ్దమునకే మరల శైత్య పావనత్వ రూపార్థము నందును లక్షణ నంగీకరింప రాదా? వ్యంజనా కల్పన మేల? అని కొందరు వాదింతురు. వారి మతమును మనమున నాశంకించి నిరాకరింప వలసి యున్నది. లక్షణ యా యర్థమున బ్రసరింపదని సిద్ధాంతింప వలసి యున్నది. అందుకై యీ సూత్రి మవసర సంభావ్యము.

"హేత్వభావాన్న లక్షణా"

శైత్యాది ప్రయోజనము నందు లక్షణకు ప్రసరము లేదు. "హేత్వభావాత్" అనునది యిందు హేతువు. లక్షణాహేతువు లిచట లేనందున

లక్షణ ప్రసరింపదు. ఇందిట్లనుమాన రచన చేయవచ్చును. "పావనత్వాదికము గంగాపద లక్షణాప్రతిపాద్యము కాదు. లక్షణాసామగ్రి లేనందు వలన" అని. తాత్పర్యమను వృత్తి పూర్వమే నిరస్త మయినది. ఆ తాత్పర్యము నిందుపయుక్తము కాదు. అందనుమాన మిట్లుండును. "పావనత్వాదికము తాత్పర్య వృత్తి ప్రతిపాద్యము కాదు. గంగాది పదసంసర్గము కన్న నది వేరగుట వలన" అని. ముఖ్యార్థ బాధాదిత్రయము లక్షణాహేతువు. ముఖ్యార్థబాధ, ముఖ్యార్థసంబంధము, రూఢిప్రయోజనములలో నన్యతరము. ఈ త్రయము లక్షణాహేతువు.

ఈ హేతుత్రయములో నేదియు నిచట లేదు. ఈ యంశమునీ కారిక యుపపాదించును.

లక్ష్యం న ముఖ్యం ............ శబ్దః స్ఖలద్గతిః.

మొదట ముఖ్యార్థ మనునది యుండుట యనంతరము తద్బాధ, పిమ్మట ముఖ్యార్థములో నితరార్థమునకు సంబంధ ముండుట, ప్రయోజన ముండుట, శబ్దము స్ఖలద్గతి యగుట యను నివి లక్షణలో సామగ్రి. ఇట్టి సామగ్రి యేదియు ప్రకృతాంశమున లేదని కారికలోని వాక్యపంచక పరిపాటిచే నిరస్త మగును.

"గంగాయాం ఘోషః" యనుచోట లక్ష్యమయిన తీరరూపార్థము గంగా శబ్దమునకు ముఖ్యార్థము కాదు. శీతత్వాది ప్రయోజనము లక్షణాగమ్య మగునెడల లక్ష్యార్థమే (తీరమే) ముఖ్యార్థ మయ్యెడిది. లక్ష్యము ముఖ్యార్థము కాదు. తీరరూపార్థము నందు బాధ యేదియు లేదు. "గంగా తీరమున ఘోష మున్నది." యను నర్థములో నేమియు ననుపపత్తి లేదు. తీరము ముఖ్యార్థము కాదు. అందు బాధయు లేదు. అనుటచే మొదట లక్షణాబీజము లేమి సూచిత మయినది. లక్ష్యమయిన తీరమునకు శీతత్వాది ప్రయోజనముతో సంబంధము లేదు. పావనత్వమునకు తీరమునకు సాక్షాత్సంబంధ మేదియు లేదు. ఫలము ప్రవాహసమవేతమే కాని తీరసమవేతము కాదు. సాక్షాత్సంబంధమే లక్షణాప్రయోజకము. ఈ యుక్తిచే రెండవ హేతువు నిరస్త మయినది. ఇంక మూడవది, ఈ శైత్యాదికము లక్ష్య మయినచో నిందు వేరొక ప్రయోజన మేమియుఁ గల్పింప వీలు లేదు. ప్రయోజన మందు ప్రయోజనాంతర ముండదు. ముఖ్యార్థబాధ తత్సంబం

౪. వేరొక ప్రయోజన మిచట సంభవింపదు.

౫. గంగాశబ్ద మీ విషయమున స్ఖలద్గతి కాదు.

కావున లక్షణా శంకాంకుర మునకు నవకాశము లేదు.

అట్లయినను లక్షణ నంగీకరించినచో మొదటి లక్షణను సమూలము ఛేదించు దురంత మగు దోషాంతరము వాటిల్లును. ఈ యంశ మింక విస్తృత మగును.

★ "ఏవమప్యనవస్థా స్యాత్ యా మూలక్షయకారిణీ"

ఏవమపి ప్రయోజనం చేల్లక్ష్యతే తత్ప్రయోజనాంతరేణ తదపి ప్రయోజనాంతరేణేతి ప్రకృతాప్రతీతికృదనవస్థా భవేత్.

అనవస్థా దోషము

తీరనిష్ఠ మగు శైత్యపావనత్వాదికము లక్ష్యమే యగు నన్నచో మూలక్షయ మొనరించు అనవస్థ యను దోషము కల్గును. తీరనిష్ఠ శైత్య పావనత్వాదికము లక్ష్య మన్నప్పుడు ఘోషనిష్ఠ మయిన పావనత్వాదిక మచట ప్రయోజన మని యంగీకరింప వలసి యుండును. ఆఘోషనిష్ఠ ప్రయోజన మెట్లు భాసించును? అభిధచే నది గోచరింపదు గదా! పూర్వము వలె లక్షణచే భాసించు నన వలయును. అపుడదియు లక్ష్య మగును. అదియు లక్ష్య మగుచో నందొక ప్రయోజన ముండవలయును గదా! అదియు లక్షణాలభ్యమె యనవలసి వచ్చును. అందును ప్రయోజనాంతర మపేక్షితము. ఆ ప్రయోజనమును లక్ష్యమే కావలయును. అందును వేరొక ప్రయోజనము. అందును మరియొక ప్రయోజనము. ఇట్లనంత కల్పనములో విశ్రాంతి యేది? అప్పుడు ప్రకృతప్రతీతి యుండదు. అది ప్రతిబద్ధ మగును. ఇట్లు ప్రకృత లక్షణా జ్ఞప్తిని ప్రతిబంధించు నవస్థ వాటిల్లును. విత్తు ముందా? చెట్టు ముందా? విత్తునకు చెట్టు. చెట్టుకు విత్తు. ఇట్టి స్థలము లందును అనవస్థ యున్నది. కాని యట్టి స్థలము లం దనవస్థ దోషము కాదందురు. కాని ప్రకృత కల్పనము మూలక్షతి నాపాదించును గదా! మూలక్షయ కారిణి ననవస్థ నంగీకరించుట దురవస్థ కదా! కాన ప్రయోజనము లక్ష్య మగు ననుట పొసఁగదు.

★ నను పావనత్వాదిధర్మయుక్తమేవ తటం లక్ష్యతే. గంగాయాస్తటే ఘోష ఇత్యతోఽధికస్యార్థస్య ప్రతిపత్తిశ్చ ప్రయోజనమితి విశిష్టే లక్షణా, తత్కిం వ్యంజనయా? ఇత్యాహ;

"ప్రయోజనేన సహితం లక్షణీయం న యుజ్యతే"

కుత ఇత్యాహ:

"జ్ఞానస్య విషయో హ్యన్యః ఫలమన్యదుదాహృతం"

ప్రత్యక్షాదేర్నీలాదిర్విషయః. ఫలం తు ప్రకటతా సంవిత్తిర్వా.

"విశిష్టే లక్షణా నైవం;"—

నిగదేన వ్యాఖ్యాతం.

—"విశేషాః స్యుస్తు లక్షితే"

లక్షితే తటాదౌ యే విశేషాః పావనత్వాదయస్తే చాభిధా తాత్పర్య లక్షణాభ్యో వ్యాపారాంతరేణ గమ్యాః. తచ్చ వ్యంజన ధ్వనన ద్యోతనాది శబ్దవాచ్యమవశ్యమేషితవ్యం.

### విశిష్టలక్షణా వాదము

విశిష్టలక్షణ నంగీకరించినచో వ్యంజన నంగీకరింప వలసిన యవసరము లేదు. అపుడు వ్యంజన ప్రయాసము వ్యర్థము కాగలదు. అని కొందరందురు. వారి భావ మిట్లుండును శీతత్వాది రూప మయిన కేవల ప్రయోజనమును లక్ష్యముగా నంగీకరించి నపుడు పూర్వము చెప్పిన దోషము వాటిల్ల వచ్చును. విశిష్టలక్షణలో నా దోషము వాటిల్లదు. శీతత్వ పావనత్వాది ప్రయోజన సహిత మయిన తటము లక్ష్యమగు గావుత. మొదట తటము లక్షిత మగుట అనంతరము శీతత్వాదు లవభాసించుట యన్న పూర్వ పశ్చాద్భావ మిందు లేదు. ప్రయోజన విశిష్టముగా తటమె లక్షితమగును. "అందు వేరొక ప్రయోజన ముండవలెను, కదా!" యన నక్కరలేదు. "గంగాయాః తటే ఘోషః" అను ముఖ్యశబ్ద ప్రయోగమున కన్న నిం దధికార్థలాభ ముండుట వైలక్షణ్యము కదా! అదియె యిందు ప్రయోజనము. కావున విశిష్టమునందు లక్షణ సముచితము కాగా వ్యంజన వలన నేమి ప్రయోజనము? అని. ఈ వాదము మమ్మటున కభిమతము కాదు. తన్నిరాస మునకై యిది భావనీయము.

## విశిష్ట లక్షణా నిరాకరణము

ప్రయోజన సహిత మయిన లక్ష్యము నంగీకరించుట యుక్తము కాదు. అది ప్రమాణసాధ్యమును కాదు. "గంగాయాం ఘోషః" యనుచోట శైత్యపావనత్వాది ప్రయోజనము లక్ష్యకోటిలో బ్రవేశింప నర్హము కాదని నిరూపితమె. ఇపుడు శైత్యపావనత్వాది విశిష్టమగు తటము లక్ష్య మగు ననుటలో ముఖ్యప్రయోగమున లభింపని వైశిష్ట్యము ప్రయోజనము కావచ్చును. కాని యది సుఘటము కాదు. ప్రయోజనము లక్షణీయము అను దానికి సహానవస్థానము కుదురదు కదా! చూడుండు!

ప్రయోజన సహితముగనె లక్ష్యము నంగీకరించుట యుక్తము కాదనుటలో నిది హేతువు. జ్ఞానవిషయము వేరు. ఫలమును వేరు. అని ప్రసిద్ధము. అని కారికార్థము. జ్ఞానమునకు విషయ మగునది జ్ఞానము కన్న వే రయినట్లు జ్ఞానమునకు ఫలముగా నుండునదియు జ్ఞానము కన్న నన్యము. ఈ యంశము నిట్లు దృష్టాంతమున విశదముగా గుర్తింప వచ్చును. మీమాంసకులలో భాట్టమతానుయాయు లిట్లందురు. "ఘటజ్ఞానము కలుగగనే ఘటము జ్ఞాత మయినదని జ్ఞాతత యనుసంధానింప బడును. కాఁగా జ్ఞానము కలుగగనే జ్ఞాతత యను నొక ధర్మ ముదయించునని యూహింపవల యును. ఆ జ్ఞాతత యనునది యా జ్ఞానమునకుఁ బూర్వము పుట్టలేదు. జ్ఞానము పుట్టిన పిమ్మట పుట్టినది. కాన నది జ్ఞానమున బుట్టునని నిశ్చయింప వచ్చును. ఈ జ్ఞాతత యనునది ఘటధర్మము ఘటజ్ఞానమునకు ఫలమును, ఇంతకును ఇది సారము. ఘటము జ్ఞానవిషయము. జ్ఞాతత యనునది ఫలము. ఈ రెండును భిన్నభిన్నములు. ప్రత్యక్షాది జ్ఞానమునకు నీలాదికము విష యము. ప్రకటత ఫలము. ప్రకటత జ్ఞాతత పర్యాయములు.

నైయాయికులును విషయ ఫలములకు భేదము నంగీకరింతురు. ప్రత్య క్షాది జ్ఞానమునకు నీలాదికము విషయము కాఁగా "సంవిత్తి" ఫలమని యందురు. తదభిప్రాయమిది. ఘటజ్ఞానము కలుగగనే "ఘట జ్ఞానవా నహం" "నేను ఘటజ్ఞానము కలవాఁడను." అను నాకారము కల యను వ్యవసాయ ముదయించును. ఈ యనువ్యవసాయమునకే సంవిత్తి యని పేరు. ఈ సంవిత్తి జ్ఞాతృధర్మము.

మీమాంసకమతమున జ్ఞాతత (ప్రాకట్యము) విషయవర్తి ధర్మము, నైయాయికమతమునందు సంవిత్తి విషయస్ఫురణ సమనంతరమున గలుగునది. ఆత్మధర్మము. ఈ సంవిత్తియు జ్ఞానమునకు ఫలరూపము. ప్రకటతయైనను సంవిత్తియైనను జ్ఞానఫలమే.

ప్రత్యక్షాది జ్ఞానమునకు విషయమయిన నీలాదికము ప్రత్యక్షాది విజ్ఞానమునకు ఫలమయిన ఘటాదిజ్ఞాతత (ఘటాదిసంవిత్తి) కన్న భిన్నమయినట్లు లక్షణాజన్య జ్ఞానమున కన్న తత్ఫలమయిన శైత్యపావనత్వాది జ్ఞానమునకు భిన్నత్వమున్నదే కాని తాదాత్మ్యమేమాత్రము నుపపన్నము కాదని నిష్కర్షము గ్రహింపవచ్చును. "విశిష్టే లక్షణా నైవం" ఈ చెప్పిన విధమున విశిష్టమునందు లక్షణ యుక్తము కాదు.

పావనత్వాది విశేషములు లక్ష్యములు కాకపోయినచో వాని ప్రతీతి యెట్లు కలుగును? ఈ యాశంకకై యిది "విశేషాః స్యుస్తు లక్షితే" తటాదికము లక్షితము కాగా విశేషములయిన పావనత్వాదులు ప్రతీయమానములగును. లక్ష్యప్రతీతి సమనంతరము ప్రయోజనప్రతీతి నియమమున్నది గదా! ఆ విశేషము అభిధచే గోచరించవు. తాత్పర్యవృత్తిచే గోచరించవు. లక్షణచే గోచరింపవు. కావున వ్యాపారాంతరము నవశ్య మంగీకరించి తీరవలయును. ఆ వ్యాపార మభిధాదులకన్న భిన్నము. అదియే వ్యంజన. వ్యంజనకే ధ్వననము, ద్యోతనము ప్రత్యాయనము మొదలగు పేర్లు కలవు. ఇష్టము లేకపోయినను దీని నంగీకరింప వలసి యున్నది.

ఈ యంశ మిచట ననుసంధేయము. లక్షణయందు ప్రయోజనప్రతీతి రెండు విధముల నుండును. ఒకధర్మిచే వేరొక ధర్మి లక్ష్యమాణమయినపుడు ముఖ్యార్థధర్మములు అభిధా తాత్పర్య లక్షణాతిరిక్తముగా నాల్గవ కక్ష్యలో ప్రతీయమానములై ప్రయోజనము లగును. అపుడు విషయ ఫలములకు భేదముండును గాన విశిష్టలక్షణాశంక యుదయింపదు. ఇది యొక విధము.

ముఖ్యార్థ ధర్మముచే నముఖ్యార్థధర్మము లక్షిత మయినపుడు ప్రయోజనముగా ధర్మాంతర ముండదు. ఆ ముఖ్యార్థధర్మమునకే సాతిశయత్వము ప్రతీత మగును. అపుడదియే ప్రయోజనము. ఆ సాతిశయత్వప్రతీతియు చతుర్థకక్ష్యైకగోచరము కాన విశిష్టలక్షణ కుదురదు.

పదార్థావబోధనములో నభిధ ప్రథమకక్ష్య. తాత్పర్యము ద్వితీయ కక్ష్య. లక్షణ తృతీయకక్ష్య. వ్యంజన చతుర్థకక్ష్య. అర్థాంతర ప్రతిభాస పవిత్రిత మయిన ప్రతిపత్తృ ప్రతిభాసము సహాయముగా వ్యంజన సముల్లసించు ననుట ముందు సూచిత మగును.

వాచక లక్షక వ్యంజకము లను శబ్దత్రయమును జెప్పునపుడు అభిధా లక్షణా వ్యంజనలను మూఁడు వ్యాపారములే యుద్దిష్టములు. తాత్పర్య మనునది యచట లేదు. ఇచట తాత్పర్యమును స్మరించుట "తాత్పర్యార్థోపి కేషు చిత్" అను కారికాంశమున సూచించిన మతాంతరము నుద్దేశించిన దని గుర్తింప వలయును.

★ ఏవం లక్షణామూలం వ్యంజకత్వముక్తం. అభిధామూలం త్వాహ.

"అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియంత్రితే
సంయోగాద్యైరవాచ్యార్థ ధీకృద్వ్యాపృతిరంజనం"
సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా
అర్థః ప్రకరణం లింగం శబ్దస్యాన్యస్య సన్నిధిః
సామర్థ్యమౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః
శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః.

ఇత్యుక్తదిశా సశంఖచక్రో హరిః, అశంఖచక్రో హరిరిత్యుచ్యతే. రామలక్ష్మణావితి దాశరథౌ. రామార్జునగతిస్తయోరితి భార్గవకార్తవీర్యయోః, స్థాణుం భజ! భవచ్ఛిదే ఇతి హరే. సర్వం జానాతి దేవ ఇతి యుష్మదర్థే, కుపితో మకరధ్వజ ఇతి కామే. దేవస్య పురారాతేరితి శంభౌ. మధునా మత్తః కోకిల ఇతి వసంతే. పాతు వో దయితాముఖమితి సాముఖ్యే. భాత్యత్ర పరమేశ్వర ఇతి రాజధానీరూపాద్దేశాద్రాజని. చిత్రభానుర్విభాతీతి దినే రవౌ, రాత్రౌ వహ్నౌ. మిత్రం భాతీతి సుహృది. మిత్రో భాతీతి రవౌ. ఇంద్రశత్రురిత్యాదౌ వేద ఏవ న కావ్యే స్వరో విశేషప్రతీతికృత్. ఆదిగ్రహణాత్:

ఏతావన్మాత్రస్తనికా ఏతావన్మాత్రాభ్యామక్షిపత్రాభ్యాం
ఏతావన్మాత్రావస్థా ఏతావన్మాత్రైః దివసైః.
ఇత్యాదావభినయాదయః.

లాక్షణికము వేరు. వ్యంజకము వేరు. లాక్షణికమునకే వ్యంజకత్వము కలదని భ్రమ పడరాదు. ఇంతవరకు లక్షణామూల మయిన వ్యంజకత్వము నిరూపిత మయినది. అభిధామూలమగు వ్యంజకత్వమును జెప్పవలసి యున్నది. వ్యంజకత్వము వ్యంజన. ఈ వ్యంజన యందు వ్యంగ్యార్థవిశిష్టోపస్థితి యే మాత్రము శంకాస్పదమే కాదు.

## వాచకత్వ నియంత్రణము

శబ్దములలో గొన్ని నానార్థక శబ్దములు కలవు. "హరి" మొదలగునవి బహ్వర్థములను జెప్పు పదములు. ఒక వాక్యములో నున్న యనేకార్థక శబ్దము తన యర్థముల నన్నిటిని నొకట జెప్పదు. ఆ సందర్భానుకూల మయిన యొక యర్థము మాత్ర మచట గోచరించును. ఇతరము లవభాసింపవు. ఆ యనేకార్థశబ్దము యొక్క యర్థాభిధాయకతాశక్తి వక్ష్యమాణ సంయోగాదులచే నియంత్రణము కలదగును. అది శృంఖలిత మగును. అనేకార్థములను బోధించు నా శక్తిని సంయోగాదు లడ్డగించును. కావున నన్యార్థములు స్ఫురింపవు. అయిన నట్టి స్థలములందు భావుకుల ప్రతిభాసము ననుసరించి నిరుద్ధ మయిన యర్థాంతరమును బుద్ధిగోచర మగును. అట్టియెడల ననభిధేయ మయిన యర్థాంతర ధీ జనక మయిన వ్యాపారము వ్యంజన వ్యాపారమె కాని యన్యము లేదు.

నానార్థకస్థలము లందా శబ్దమునకు స్వసంబంధి సర్వార్థము లందును సంకేతము సమానముగా నుండును. నియమిత మయిన యర్థమును ప్రత్యాయనము చేయుట కవకాశము లేదు. మొదట నా యర్థమే యేల భాసింపవలయును? మరొక యర్థమేల భాసింపరాదు? అని సందేహము కలుగును. అపుడా శబ్దములే సంయోగాది సహాయము కలవయినచో నియతార్థ ప్రత్యాయనము చేయగలవు. ప్రకరణాదిక మే యర్థమున దాత్పర్యగ్రాహక మగునో యా యర్థమే ప్రథమమున నభిధచే గోచరించును. ఇతరార్థముల నప్పుడభిధ చెప్పలేదు. అయినను సంవిధాన సౌందర్యమున నర్థాంతరబోధ కలుగుటలో వ్యంజనయే వ్యాపార మని భావము.

## సంయోగాదులు

శబ్ద మనేకార్థ మయిన నభిధను ప్రతినియతార్థమునందు నియమించునీ సంయోగాదులెవ్వి? ఈ విషయమున నభియుక్తుల సంవాదము ననుసరించి

సంయోగాదుల గుర్తించుట యుక్తము. భర్తృహరి పూజ్యపాదు లీ సంయోగాదుల నిర్దేశించిరి.

౧. సంయోగము ౨. విప్రయోగము ౩. సాహచర్యము
౪. విరోధిత ౫. అర్థము ౬. ప్రకరణము
౭. లింగము ౮. అన్యశబ్దసన్నిధి ౯. సామర్థ్యము
౧౦. ఔచితి ౧౧. దేశము ౧౨. కాలము
౧౩. వ్యక్తి ౧౪. స్వరము

ఇత్యాదులు శబ్దార్థమున కనవచ్ఛేద మున్నపుడు విశేషస్మృతి హేతువు లగును. విశేషార్థము నివి స్మరింప జేయును. వివక్షిత మయిన యర్థము నివి సంపాదించునని భావము. అనవచ్ఛేద మనగా ననేకత్వము. నానార్థక శబ్దము వలన నానార్థములు భాసించును గావున నందు సందర్భానుకూలమగు విశేషార్థము నివి స్మరింప జేయును. ఇచటి యనవచ్ఛేద పదమునకు గొందరు తాత్పర్యసందేహమని యర్థము చెప్పుదురు. నానార్థక శబ్దమున కనేకార్థములలో నే యర్థమునందుc దాత్పర్యము కలదో? యని సందేహము కలిగినప్పుడు సంయోగాదులు తాత్పర్య నిశ్చయ హేతువు లగునని భావము. "అనవచ్ఛేదము నియంత్రణము లేకపోవుట" అని కొందరి దృష్టి. నానార్థకశబ్దము యొక్క యర్థమునకు నియంత్రణము లేకపోవుట ప్రసక్తమయినపుడు సంయోగాదు లా నియంత్రణము (అవచ్ఛేదము) సంపాదించు నని తాత్పర్యము.

ఈ సంయోగాదుల స్వరూపలక్ష్యముల నిట్లు గుర్తింప వచ్చును.

౧. సంయోగము :— ప్రసిద్ధ సంబంధము. ద్రవ్యము ద్రవ్యమునకు గల సంబంధము సంయోగము. అది కొన్ని యెడల నర్థవిశేషహేతు వగును. "సశంఖచక్రో హరిః" సశంఖచక్రుడు హరి యనునది యుదాహరణము. శంఖచక్రముల సంయోగము హరికిc గలదని యర్థము. ఈ శంఖ చక్ర సంయోగము హరిపదాభిధను నియంత్రణము చేయును. హరిపదమునకు యముడు, వాయువు, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు, విష్ణువు, సింహము, కిరణము, అశ్వము, శుకము, సర్పము, మర్కటము, కప్ప యని నానార్థములు గలవు. అయినను శంఖచక్ర సంయోగమున నానార్థక మయిన హరి

పదము విష్ణురూపార్థము నం దభిధానియంత్రణము కలదగును. తదితరార్థము లందు శంఖాదిసంయోగము ప్రసిద్ధము కాదు కదా!

౨. విప్రయోగము :— ప్రసిద్ధమగు సంయోగ సంబంధము లేక పోవుట. ఇదియు నర్థవిశేష హేతువు. "అశంఖచక్రో హరిః" అశంఖ చక్రుఁడగు హరి, యనునది యుదాహరణము. శంఖచక్రముల సంయోగము హరికి లేదని యర్థము. ఈ శంఖచక్ర సంయోగాభావము హరిపదము నానార్థ మయినను విష్ణురూపార్థము నందె నియమించును. వియోగము సంయోగపూర్వక మగుట ప్రసిద్ధము కదా! ఒకప్పు డున్న శంఖచక్ర సంయోగ మిప్పుడు లేదని దీని భావము. శంఖచక్రవియోగమును విష్ణువు కాని వాని యందుండదు.

౩. సాహచర్యము :— సహచరత్వము కూడి యుండుట. ప్రసిద్ధ మయిన పరస్పరసాపేక్షత లేక పోవుటయు సాహచర్యమే. "రామలక్ష్మణౌ" రామలక్ష్మణు లనునది యుదాహరణము. లక్ష్మణసాహచర్యము రామ పదాభిధా నియమనము చేయును. రామపదమునకు దశరథపుత్రుఁ డయిన శ్రీరాముడు, పరశురాముడు, బలరాముఁడని యర్థము లనేకము లున్నవి. అయిన నది దాశరథి యందు నియంత్రిత మగును.

౪. విరోధము :— సహానవస్థానము కూడి యుండక పోవుట, వధ్యఘాతక భావమును విరోధమే. "ఛాయాతపములు" అనునది సహానవ స్థానరూప విరోధోదాహరణము. ఛాయా పదమునకు నీడ; సూర్యభార్య యని నానార్థము లున్నవి. ఆతపముతో కూడి యుండక పోవుట యను సహానవస్థాన విరోధము ఛాయాపదమును నీడ (ఆతపాభావము) అన్న యర్థము నందు నియమించును.

"రామార్జున గతి స్తయోః" "వారిది రామార్జునగతి" యనునది వధ్యఘాతక భావ విరోధోదాహరణము. ఇందు రామపదము నానార్థము. అర్జునపదమును నానార్థము. కార్తవీర్యార్జునుడు, పాండవార్జునుఁడు, అర్జున వృక్షము ఇత్యాదు లర్జునార్థములు. రామపదమున కర్థము నియమిత మయిన గాని యర్జునపదార్థము తెలియదు. అర్జునపదార్థము నియతమయిననే రామ పదార్థము తెలియును. కాని, యెదుట కనుపడు వారిద్దరు ప్రసిద్ధ విరోధము కలవారగుట వలన వారు "రామార్జున సదృశాచారము కలవారు." అని

యర్థము కలుగును. ప్రస్తావవశమున నీ విరోధము గోచరము కాగా, ఏ రామునకు ఏ యర్జునునకు విరోధము కలదో యా రామార్జునులే యనగా: పరశురామ కార్తవీర్యార్జునులే యిచట గోచరింతురు. రామార్జున శబ్దాభిధ పరశురామ కార్తవీర్యార్థము లం దేక సమయము నందే నియమనము పొందును.

౫. అర్థము :— ప్రయోజనము "స్థాణుంభజ! భవచ్ఛిదే" "సంసార నాశమునకై స్థాణువుని సేవింపుము." అని యుదాహరణము. ఇందు స్థాణుపద మనేకార్థకము. శివుడు, కొయ్య, మేకు అని నానార్థములు కలవు. సంసారనాశరూప మయిన ప్రయోజనవశాన స్థాణుపదాభిధ శివార్థమున నియంత్రిత మగును.

౬. ప్రకరణము :— వక్తృ శ్రోతృ బుద్ధిస్థత చెప్పువానికి వినువానికిని బుద్ధిగతమై యున్న ధర్మము. అప్పటి ప్రస్తుతమున కనుగుణ మయిన సందర్భము ప్రకరణము. "సర్వం జానాతి దేవః" దేవుడంతయు తెలియును. అని యుదాహరణము. దేవపదమునకు దేవత రాజు, మేఘము నని నానార్థము లున్నవి. అయినను ప్రకరణము రాజార్థము నం దభిధా నియమనమున చేయును: ఇచట దూత రాజును సంబోధించును. రాజదూతల సంవాద మిచట ప్రకరణము. ఈ యంశమున వక్తకు శ్రోతకును రాజు మాత్రమె బుద్ధిగతుడు.

౭. లింగము :— అసాధారణ చిహ్నము. పరపక్షము లం దుండని ధర్మము. సంయోగాతిరిక్త సంబంధమున నుండునది. "కుపితో మకరధ్వజః" "మకరధ్వజుడు కోపించెను." అని యుదాహరణము. మకరధ్వజ పదమునకు సముద్రుడు మన్మథుడు నని నానార్థములు. కోపలక్షణ మయిన లింగము మన్మథునకే కలదు. అచేతన మగుట సముద్రమున కది లేదు. సముద్ర వ్యావృత్తి మయిన కోపధర్మము మకరధ్వజపదాభిధాశక్తిని మన్మథుని యందే నియమించు చున్నది.

౮. అన్యశబ్దసన్నిధి :— శబ్దాంతర సన్నిధాన మభిధా నియామక మగును. నియతార్థక మయిన శబ్దాంతరముతో సామానాధికరణ్య ముండుట "దేవస్య పురారాతేః" "పురారాతి యగు దేవునకు" అని దీని యుదాహరణము. ఇందు దేవపదము నానార్థకము. పురారాతి పదము

శివరూపార్థము నందు నియతము. అట్లు నియతార్థ మయిన పురారాతి పదముయొక్క సాన్నిధ్యము నానార్థక మయిన దేవశబ్దమును శంకరార్థము నందు నియమించు చున్నది.

౯. సామర్థ్యము:—కారణమగుట "మధునామత్తః కోకిలః" కోకిల మధుమత్త మయినదని దీని యుదాహరణము. మధుశబ్ద మిందు నానార్థము. వసంతుడు, తేనె ఇత్యాదులు తదర్థములు. అయినను మధుశబ్దము వసంతార్థము నందె నియంత్రిత మగుచున్నది. కోకిల మద జనన సామర్థ్యము వసంతునకే కలదు. మద్యాదుల కా సామర్థ్యము లేదు. కాన వసంతుడే మధు శబ్ద వాచ్యుడు.

౧౦. ఔచితి :— యోగ్యత. "పాతు వో దయితా ముఖం" దయితా ముఖము మమ్ము రక్షించు గావుత!" యని యుదాహరణము. ముఖ శబ్ద మనేకార్థము. వదనము సామ్ముఖ్యము, ఉపాయము ప్రారంభము ఇత్యాదులు తదర్థములు. ఈ యర్థములందు యోగ్యత గల సాముఖ్య రూపార్థమె ప్రకృతోపయోగి. ఉత్కంఠితు డయిన ప్రియునకు ప్రియా సాముఖ్యమె (అనుకూల్యము) మనోరథ మీడేర్చును. అనుకూల్యము లేక పోయినచో కేవల దయితా వదనము మనోరథ సాధనము కా జాలదు. కాన ప్రకృతము నందిట్టి యోగ్యత ముఖశబ్దము నానుకూల్యార్థము నందు నియమించు చున్నది. ఇందౌచితి కలదు.

౧౧. దేశము :— ఇదియు నియామకము "భాత్యత్ర పరమేశ్వరః" ఇచట పరమేశ్వరుఁడు భాసించుచున్నాడు. అని యుదాహరణము. పరమే శ్వరశబ్దము జగదీశ్వరుడు భూపాలకుడు అని నానార్థకము. అయినను "అత్ర" "ఇచట" యని రాజధాని రూపదేశమున రాజార్థమునందే నియం త్రిత మగును.

౧౨. కాలము :— "చిత్రభానుర్విభాతి" చిత్రభానుడు విభాసించు చున్నాడు. అని యుదాహరణము. చిత్రభానుశబ్దము సూర్యుడు అగ్ని యని నానార్థము. పై వాక్యము పగలు పలికిన దయినచో సూర్యుడన్న యర్థమున నభిధా నియమనము రాత్రివచన మయినచో వహ్నిరూపార్థమున నభిధా నియమన ముండును. ఇట్టి నియమనము కాలకృత మని స్పష్టము.

౧౩. వ్యక్తి:— పుంనపుంసకాది లింగమునకు వ్యక్తి యని పరిభాష. మిత్రశబ్దము పుంలింగ మయినచో సూర్యార్థలాభము. నపుంసకలింగ మయినచో సుహృదర్థ లాభము కలుగును. మిత్ర శబ్దము నానార్థ మయినను లింగనిర్దేశమున నర్థవిశేషమునందు నియంత్రిత మగును.

౧౪. స్వరము:— ఉదాత్తము అనుదాత్తము స్వరితము నను స్వరము వేదమునందే విశేషప్రతీతి కలుగజేయును. కావ్యమున నది విశేష ప్రతీతికారి కాదు. కావ్యమున స్వరము నత్యంత మాదరింప నవసరము లేదు. ఉదాత్తాది స్వరములు కావ్యమున నర్థవిశేష నియామకములు కావు. కొన్నియెడల కొంతగా శ్లేషాదులలో నది సమాదరణీయము. "ఇంద్రశత్రు ర్వర్ధస్వ" అన్న వైదిక పదమున ఇంద్రశత్రు వనునది స్వరవిశేషమును బట్టి నానార్థక మగును. "ఇంద్రః శత్రుః యస్య స ఇంద్రశత్రుః" అని బహువ్రీహి సమాస మయినచో మొదటి పద ముదాత్తస్వరము కలదగును. "ఇంద్రస్య శత్రుః ఇంద్రశత్రుః" అని షష్ఠీబహువ్రీహి యయినచో చివరి పద ముదాత్తమగును. ఇట్లు వ్యాకరణము నిరూపించుచున్నది. అద్యుదాత్త మయినచో ఇంద్రుడు శాతనము (మారణము) చేయువాడని యర్థము. అంతోదాత్త మయినచో ఇంద్రుడు శాతనము పొందువాడని యర్థము లభించును. ఉచ్చారణము నందలి స్వరమును బట్టి యర్థము మారును కావున స్వరమచట అర్థవిశేషము నాపాదించును.

సంయోగాది పరిగణనములో "స్వరాదయః" అని యున్నది. అది గ్రహణముచే నభినయము అపదేశము పాఠధర్మము మొదలగు వానిని గ్రహింప వచ్చును. హృదయమున హస్తాదికము నుంచి యభిమతమును నిర్దేశించుట యుపదేశము.

అభినయోదాహరణము

సౌందర్యాతిశయశాలిని నాయిక యొకతె కనపడగనే గుణవిశేషముల గుర్తించి సానురాగుడయిన యొకడడుగగా దూతి యిట్లు పలుకు చున్నది. ఇంతింత స్తనములు కలది. ఇంతలేసి కన్నులు కలది. ఇంతటి యవస్థ కలదై ఈ మాత్రపు వత్సరాల వయసు కలది యింతకే యిట్లయిన దను సామాన్యార్థము కల యీ పద్యమున ఇంతింత ఇంతలేసి ఇంతటి ఈమాత్రము అను పదముల యర్థ మభినయవిశేషమున దెలియదగినది.

స్తనాకారములను సూచించునట్లుగ ముకుళాకార హస్తాభినయమును నేత్ర పరిమాణము సూచించుటకు పద్మదళాకారాభినయమును వ్రేళ్ళపై లెక్క పెట్టుటతో వత్సరగణనము నభినయించి ప్రదర్శింప వలయును. ఇట్టభినయము నర్థవిశేషమును గోచరింప చేయును. ఇట్లితరము లభ్యూహ్యములు.

★ ఇత్థం సంయోగాదిభిరర్థాంతరాభిధాయకత్వే నివారితేఽప్యనేకార్థస్య శబ్దస్య యత్క్వచిదర్థాంతరప్రతిపాదనం తత్ర నాభిధా నియమనాత్తస్యాః న చ లక్షణా ముఖ్యార్థబాధాద్యభావాత్. అపి త్వంజనం వ్యంజనమేవ వ్యాపారః యథా:

భద్రాత్మనో దురధిరోహతనోర్విశాల
వంశోన్నతేః కృతశిలీముఖసంగ్రహస్య
యస్యానుపప్లుతగతేః పరవారణస్య
దానాంబుసేకసుభగః సతతం కరోఽభూత్.

ఇట్లర్థాంతరాభిధాయకత్వమును సంయోగాదులు నివారణము చేసినను మహాకవిప్రయోగము లందొకొక్కచోట నానార్థకశబ్దమున కర్థాంతర ప్రతిపాదన ముండును. ఆ యర్థాంతరప్రతిపాదనమున నభిధ సమర్థము కాదు. అభిధ సంయోగాదులచే ప్రకృతార్థము నందు నియమిత మయినందు వలన నర్థాంతరము నవగమింపఁ జేయలేదు. ముఖ్యార్థబాధ మొదలగు హేతు త్రయము లేనందువలన లక్షణయుఁ బ్రసరింపజాలదు. కావున నా యర్థ విషయమున వ్యంజనయె వ్యాపారము. ఈ యుదాహరణము నందిది భావనీయము.

అభిధామూల శాబ్ద వ్యంజన

ఇది యొక రాజు వర్ణనము. తత్పక్షమున నీ భావమును దెలియ వలయును. ఆ రాజ ప్రకృతి కళ్యాణమనోహరము. అతని శరీర మప్రధృష్యము. ఇతరు లెవ్వరును పరాజితము చేయజాలరు. అతని వంశోన్నతి గొప్పది. విఖ్యాతి కలది. అతఁడు శరసంచాలనము నందధికముగా నభ్యాసము చేసినాడు. అతడదుష్టమానవులకు హితకారి, శత్రునివారకుడు. అతని హస్త మెల్లప్పుడును దానోదకధారల సేచనముచే రమణీయమై యున్నది. ప్రకర

ణానుసారమున నీ శ్లోకము రాజప్రశంసాపరమైన యీ యర్థమును ప్రతిపాదించునది యైనను నానార్థ శబ్దప్రయోగము నిమిత్తముగా నర్థాంతరము గోచరించును.

గజపక్ష మయిన యీ యర్థాంతర మిట్లుండును. ఆ మహాగజము భద్రజాతీయము. గజములందు భద్ర మంద్ర మృగాది జాతి భేదములు కలవు. ఆ గజశరీరము సమున్నత మయినందు వలన దురారోహము. దాని పృష్ఠదండోన్నతి యత్యంతము విశాలము. మదధార లధికముగా నున్నందున భ్రమరముల ననేకముగా నది యాకర్షించు చున్నది. దాని గమనమనుద్ధతము ధీరమును. అది యుత్కృష్ట మయిన వారణము. దాని తొండ మెల్లపుడు మదధారానేకమున సుభగముగా నున్నది.

ఇందు రాజవర్ణనము ప్రకృతము. ప్రకరణాది వశమున "భద్రాత్మనః" మొదలగు పదముల యభిధ రాజాన్వయ యోగ్య మయిన యర్థము నందు నియమిత మగుచున్నది. అయినను సహృదయుల సంస్కార బలమున నిరూపించిన విధముగా గజరూపార్థమును గోచరించును. అది శబ్దశక్తి మూల మయిన ధ్వనన వ్యాపారముననే భాసించును. రాజసంబంధి యర్థమభిధ వలనను గజసంబంధి యర్థము వ్యంజన వలనను గోచరించును. ఇందలి రెండవ యర్థమును కవితాత్పర్య విషయమే యయినను ఆ తాత్పర్యగ్రాహకము లయిన ప్రకరణాదులు లేనందు వలన వ్యంగ్యబోధ విషయమే యగును. రాజార్థము గోచరింపగా గజార్థమును గోచరించుట యత్యంత మసంబద్ధము కాదు. రాజగజార్థముల సంబంధములో నుపమానోపమేయభావము భాసించును. అదియు వ్యంగ్యమే. ఇట్టి స్థలములందుపమ గోచరించుచున్నట్లు సహృదయాస్వాద మున్నది గదా?

★ "తద్యుక్తో వ్యంజకః శబ్దః"—

తద్యుక్తో వ్యంజన యుక్తః

—"యతోఽర్థాంతర యుక్తథా."

"అర్థోఽపి వ్యంజక స్తత్ర సహకారితయా మతః"

తథేతి వ్యంజకః.

ఇతి శ్రీ కావ్యప్రకాశే శబ్దనిర్ణయో నామ ద్వితీయ ఉల్లాసః.

ఇంతకు గొంతగా వ్యంజన నిరూపిత మయినది. తద్వారా వ్యంజక శబ్దమును నిరూపింప వలయును.

## శ బ్దా ర్థ వ్యం జ క త

ఇంతవరకు నిరూపించిన వ్యంజన యుక్త మయిన శబ్దము వ్యంజకము. ఈ వ్యంజక శబ్దము నాశ్రయించిన వ్యంజన వ్యంగ్యమును భాసింప జేయును. శబ్దము వ్యంజక మయినట్లు అర్థమును వ్యంజక మని యిందు నిరూపిత మగును. శబ్దము వ్యంజక మయిన స్థలము లందా శబ్దార్థ మజాగళ స్తనరీతి వ్యర్థము కాదు. అర్థాంతర సంబంధ మున్నందువలన శబ్దము వ్యంజక మయినది కదా! ఇట్లే యర్థము నర్థాంతరసంబంధము కలుగుట వ్యంజక మగును. కావున నర్థమును పూర్వము చెప్పిన వ్యంజనము నందు సహకారిగా నుండునని మాకు సమ్మతము. ఈసర్వశస్థలము లందర్థము సహ కారి యగు టచే వ్యంజన శబ్దశక్తిమూల మనియె వ్యవస్థ. శబ్దమువలన గాని యర్థము వలనగాని ప్రధానముగా వ్యంజన వ్యాపారము ప్రతీత మయిన చోట ధ్వని తత్తన్మూలకమగుట నిరూపిత మగును. ప్రధానము ననుసరించి వ్యపదేశము లుండును గదా! "భద్రాత్మనః" యను నుదాహరణము నందు ప్రధానముగా బరిగ్రహించిన శబ్దమునకే యర్థము సహకారి యగుటచే నర్థమునకు వ్యంజకత్వము విహిత మయినదని సిద్ధార్థము.

ప్రయోగయోగ్యే విషయే ప్రయోజ్యం
శక్తిత్రయం యః క్షమతే ప్రయోక్తుం
సాహిత్య సామ్రాజ్యధురంధరః సన్
నిష్కంటకాం సంపదమశ్నుతే సః.

ప్రయోగయోగ్య విషయమున ప్రయోగింపవలసిన శక్తిత్రయమును ప్రయోగించుటకు సమర్థుడు సాహిత్య సామ్రాజ్య ధురంధరుడై నిష్కంటక మగు సంపదను పొందగలడని సాహితీ బ్రహ్మణ్యులు నిర్దేశించిరి.

ఇది ద్వితీయోల్లాసము.

# శ్రీ మమ్మటాచార్య కృత

# కావ్య ప్రకాశము

## తృతీయోల్లాసము

శ్రీ మమ్మటాచార్యులు పూర్వోల్లాసమున మొదట శబ్దార్థముల స్వరూపమును జెప్పినారు. వాచకము లాక్షణికము వ్యంజక మని శబ్దము త్రివిధ మగుట సాక్షాన్నిరూపితము. వాచ్యము లక్ష్యము వ్యంజక మని యర్థము త్రివిధ మగుట శబ్దనిరూపణ ప్రసంగమున నిరూపితము. వాచక లక్షకోభయ పర్యాలోచన పూర్వకముగా శబ్దమునకు వ్యంజకత్వ ముట్టంకిత మయినది. ఇప్పు డనభివ్యక్త మయిన యర్థస్వరూప వివేచనము స్మరింప జేసి యర్థవ్యంజన యవసరప్రాప్త మగుట దాని నీ తృతీయమున రూపింప వలయును. అర్థమునకును వ్యంజకతను సమర్థింప వలయును. ఇట్లు తృతీయోల్లాస సంగతి గుర్తింప జేయుటకు మమ్మటు లిట్లుపక్రమించు చున్నారు.

★ "అర్థాః ప్రోక్తాః పురా తేషాం"—

అర్థా వాచ్య లక్ష్య వ్యంగ్యాః. తేషాం వాచక లక్షక వ్యంజ కానాం.

— "అర్థవ్యంజకతోచ్యతే"

కీదృశీ! ఇత్యాహ;

"వక్తృబోద్ధవ్య కాకూనాం వాక్యవాచ్యాన్యసన్నిధేః
ప్రస్తావదేశ కాలాదేః వైశిష్ట్యాత్ప్రతి భాజుషాం
యోఽర్థస్యాన్యార్థధీహేతుర్వ్యాపారో వ్యక్తిరేవసా"

బోద్ధవ్యః ప్రతిపాద్యః కాకుః ధ్వనేర్వికారః ప్రస్తావః ప్రకరణం అర్థస్యవాచ్యలక్ష్యవ్యంగ్యాత్మనః. క్రమేణోదాహరణాని.

వాచక లాక్షణిక వ్యంజకము లను శబ్దములకు వాచ్య లక్ష్య వ్యంగ్యములను నర్థములు ద్వితీయోల్లాసమున సూక్తము లయినవి. ఇపుడిక నర్థ వ్యంజకతను జెప్పవలసి యున్నది.

"అర్థవ్యంజకతోచ్యతే"

ఇది మమ్మటాచార్య ప్రతిజ్ఞ. త్రివిధ మయిన వాచ్యలక్ష్యవ్యంగ్య రూపార్థమునకు వ్యంజకతను అనగా; వ్యంజకత్వనామధ్యమును లక్షణోదాహరణములతో విశద మొనరింతుము.

ద్వితీయోల్లాసమునందు "సర్వేషాం ప్రాయశోఽర్థానాం వ్యంజకత్వమపీష్యతే" యనుచోట అర్థవ్యంజకత నిరూపితమె కదా! మరల నిప్పు డారంభింప వగినది యేమి? ఆ యర్థవ్యంజన కింరూపమో? యింను సువ్యాఖ్యాత మగును. శబ్దవ్యంజన స్వరూప మొక విధమున సునిరూపితమె. నియంత్రితార్థజనకత్వము శబ్దవ్యంజనా స్వరూపము, కని యభిప్రాయమిది. వ్యంగ్యార్థము శబ్దవిశేషమున నియంత్రిత మయినప్పుడు శబ్దవ్యంజన కదా! అట్టి స్థలము లందు తాదృశశబ్ద విశేషమునకు పర్యాయశబ్దము ను ప్రయోగించిన నా వ్యంగ్యార్థము నశించును. చూడుడు! "భద్రాత్మనో దురధిరోహతనోః" అను నుదాహరణము నందు భద్రాత్మ శబ్దము శ్లేషద్వారమున నభిధచే రాజవ్యక్తిని బ్రతిపాదించినది వ్యంజనచే గజరూప మయిన ద్వితీయార్థమును ద్యోతనము చేసినది. భద్రశబ్దము గజజాతి విశేషమున రూఢము కదా! అచట "భద్రాత్మనః" యను పదమును తొలగించి "కల్యాణాత్మనః" యను పదమును ప్రయోగించినచో శ్లేషహాని కలుగును. కాన వ్యంజన నశించును. అందుచే పరివృత్తిని సహింపనిశబ్దము వ్యంజనను ప్రతిపాదించినచో శబ్దవ్యంజన యని తేలినది. వక్తృబోద్ధవ్యాది వైశిష్ట్యమున బ్రతిభాశాలి సహృదయుల కన్యార్థావగమనమును బ్రతిపాదించునది యర్థవ్యంజన యని తత్స్వరూపమును నిశ్చయింప వలయును. అందుకై యీ కారికార్థము సమర్థము.

### వక్తృబోద్ధవ్యాదులు

వక్త, బోద్ధవ్యుడు, కాకువు, వాక్యము, వాచ్యము, అన్యసన్నిధి, ప్రస్తావము, దేశము, కాలము, చేష్ట మొదలగు వాని వైశిష్ట్యమువలన, నవనవోన్మేషశాలి ప్రజ్ఞారూప మయిన ప్రతిభా స్వరూపులగు వారికి కావ్యవాసనా వాసితాంతరంగులయిన సహృదయులకు నవీనార్థప్రతిపాదక మయిన వాచ్యలక్ష్యవ్యంగ్యరూప త్రివిధార్థమునకు సంబంధించిన వ్యాపారము వ్యంజన వ్యాపారమె. రమణీయ నవీనార్థ స్ఫురణము సహృదయుల హృద

యములఁగాని కలుగదు. వాచ్యార్థమును బామరులు ననాయాసమునఁ దెలియఁగలరు. వ్యంగ్యసంవేదన వైదగ్ధ్యమున గతిపయసహృదయులు మాత్రమె యధికారులు. వక్తృబోద్ధవ్యాది వైలక్షణ్య మున్నను బ్రతిభామయ సంస్కార హీనులు వ్యంగ్యార్థము తెలియుటకు సమర్థులు కారు. కావున వైయాకరణాదుల కట్లు రసప్రతీతి యుండదని కొందరి ప్రామాణికుల వచనము. సవాసనులకే రసానుభవ ముండును. నిర్వాసనులు మందిరమందలి కుడ్యాశ్మసన్నిభు లని సహృదయసూక్తము. వక్త్రాది వైలక్షణ్యము హేతువుగా బ్రతిభాశాలురకన్యార్థ సంవేదన మిచ్చు వ్యాపార మర్థవ్యంజన యని సారాంశము.

౧. వక్త : ఇతరులకు దెలియుటకై వాక్యప్రయోగ మొనరించువాఁడు వక్త. కవి వక్త. తన్నిబద్ధనాయకుఁడును వక్త.

౨. బోద్ధవ్యుడు : ఎవనికి బోధించుటకై వక్త వాక్యములను బ్రయోగించునో యాతఁడు బోద్ధవ్యుఁడు. ప్రతిపాద్యుడని భావము. మూలములోని బోద్ధవ్యపదమున బోధనీయార్థభ్రమ కలుగ రాదని మూలకర్తయె ప్రతిపాద్యుడని యర్థము నుడివెను.

౩. కాకువు : ధ్వనివికారము. దీనిచే వక్తయొక్క శోకహర్షాదుల నూహింప వచ్చును. "కాయత్యర్థాంతరమితి కాకుః" అని కాకుపద వ్యుత్పత్తి. అర్థాంతరము నవగమింప జేయునదని భావము. ప్రకృతార్థము కన్న నర్థాంతరమున శబ్దము చలించు స్వభావము కలదగుట కాకువు. "ఈషదర్థే కు శబ్దః తస్య కాదేశః కుః భూమిః హృదయస్థ వస్తు ప్రతీతేః ఈషద్భూమిః కాకుః" హృదయగతమయిన వస్తుప్రతీతిని గొంతగా సూచించునది కాకువు. ఇట్లు కాకుపదార్థము గుర్తించునది.

౪. వాక్యము : పదముల సమూహము వాక్యము.

౫. వాచ్యము : శబ్దార్థము వాచ్యము.

౬. అన్యసన్నిధి : వక్తృబోద్ధవ్యులకన్న నితరు డన్యుడు. ఆతని సన్నిధానము సామీప్యమన్యసన్నిధి. తద్వైశిష్ట్యము నర్థవిశేషము ద్యోతనము చేయును.

౭. ప్రస్తావము : ప్రకరణము. ఒక్కొక్క సందర్భవశమున గూడ నర్థాంతరప్రత్యయ ముదయించును.

౯. దేశము: నిర్జనముగానుండు ప్రదేశము మొదలగునది దేశము.

౧౦. కాలము: పగలు రాత్రి ప్రాతస్సాయములు మొదలగు కాలము. వీని వైలక్షణ్యమున సహృదయుల కర్థాంతరము గోచరించును. ఇట్టి స్థలములం దర్థాంతరప్రత్యయము గలుగ జేయు వ్యాపార మర్థమునకు సంబంధించినదే గాని శబ్దసంబంధి కాదు. ఈ వ్యాపార మభిధ కాదు. లక్షణ కాదు. తాత్పర్యము కాదు. వ్యంజన వ్యాపారమె. ఒక్కొక్క స్థలమున వీనిలో నొకటి రెండు మూడు కలిసి యుండవచ్చును. అట్టి సంకరస్థలము నందేది యుద్భటముగా నుండునో (ప్రధానము) దాని ననుసరించి యచట వ్యవహార మూహ్యము.

★ అతిపృథులం జలకుంభం గృహీత్వాసమాగతాస్మి సఖి! త్వరితం
శ్రమ స్వేద సలిల నిశ్వాస నిస్సహా విశ్రామ్యామి క్షణం.

అత్ర చౌర్య రతగోపనం గమ్యతే.

ఇక వీని యుదాహరణములను క్రమముగా నిట్లు తెలియందగును.

### వ క్తృ వై శి ష్ట్య ము

ఇది వక్తృవైశిష్ట్యమున వాచ్యార్థము వ్యంజక మగుట కుదాహరణము. ఒక తరుణి యొకనాడు నదీమార్గమున కేగినది. అపు డచట నామెను వలచి వేచి యున్న యుపనాయకుఁ డుపభోగించినాఁడు. అపుడా తరుణి సద్యోభుక్త ముక్త, ఆమెకు స్వేద ముదయించినది. శ్రమ కలిగినది. ఇంక నుపభోగ చిహ్నములు పట్టినవి. గృహమునకు వచ్చిన పిమ్మట నా తరుణి వాని దాచి యాచి తన చెలియను వంచన చేయుట కిట్లనును.

సఖీ! పెద్ద జలకుంభము పట్టి వేగముగా వచ్చితిని. శ్రమకలిగినది. చెమట పట్టినది, నిశ్వాసనిస్సహ నయితిని. క్షణము విశ్రమించెదనే! ఇది వాచ్యార్థము. దీనిని సామాన్యముగా గుర్తించిన వారి వలన నామె కేమియు మాట రాదు. కాని యామె యతిచారిణి యని, దుఃశీల యని యా వక్త్రి స్వభావమును గుర్తించి నప్పు డర్థాంతరము భావుకసహృదయుల కవభాసించును. సఖీ! నిజము! నిన్ను వంచన చేయుదునా? అతిపృథుల మయిన కుంభము కదా! అది దుర్వహము. ఇంక నది నిండు కుంభ మగుట దుర్వాహతరము. నా యంతట నేనే వచ్చితిని. ఎవరును సహాయము లేరు కదా!

అందును మెల్లగ వచ్చితినా యేమి? త్వరితముగ వచ్చితిని, మధ్యమార్గములో నేనేమియు విశ్రమింప లేదు. నాకేక శ్రమ కలుగదేమి? ఇంటి బయట నేను క్షణమేని యుండుదాన నేమి? కనుక నెంతయో యలసట గలుగును గదా! నా సుకుమారాంగత నీ వెరిగినదే యయ్యెను! చూచితివా? శ్రమచే నెంతటి నీటిపోత మొదలిం బట్టినదో! అబ్బా! అమ్మా! ఇంక క్షణము విశ్రమించెదనె! ఇంతటి జలకుంభము మోసికొని యొక్కతెనే వేగముగా వచ్చితిని గాన నాకీ శ్రమ కలిగినది. నీ వన్యథా శంకింపకుమా! అను నీ వ్యంగ్యము శబ్దపరివృత్తి యున్నను గలుగును. కాన నిందలి వ్యాపారము శబ్దముది కాదు. అర్థసంబంధమే. ఇందావక్త్రి కామిని యసతీచరితము కలదని మొదట ప్రమాణాంతరమున నవగతము కావలయును. పిమ్మట "వ్యభిచారిణి యిట్లు పలుకు చున్నద"ని వక్త్రివైశిష్ట్యమున చౌర్యరత గోపనము చేయుట గోచరించును. అట్టి రతము సరిత్తీరమున లతాకుడుంగమున నే సంభవించును. ఇది ప్రతిభాశాలురకే యవభాసించు ననుట పునరుక్తము కారాదు.

★ ఔన్నిద్ర్యం దౌర్బల్యం చింతాఽలసత్వం సనిశ్వసితం
మమ మందభాగిన్యాః కృతే సఖి! త్వామప్యహహ! పరిభవతి

అత్ర దూత్యాస్తత్కాముకోపభోగో వ్యజ్యతే.

### బోద్ధవ్య వైశిష్ట్యము

బోద్ధవ్య వైశిష్ట్యమున వాచ్యము వ్యంజక మగుట కిది యుదాహరణము.* ఒక సౌందర్యగర్విత యొక సుభగు నభిలషించినది. ఆ ధన్యునే యామె దూతియు నభిలషించినది. అంతియే కాదు. ఉపభోగ ప్రత్యుపభోగముల పొందినది. ఆ చిన్నె లన్నియు నా దూతి నంటినవి. ఈ సంయోగమును నాయిక గుర్తించినది. ఇక దూతి నుద్దేశించి యిట్లు పలుకును. నిశ్వాసముతో బాటు నిద్రలేమి, దుర్బలత, చింత, అలసత్వము ఇవి మందభాగ్య నయిన నా నిమిత్తమై ఆయ్యో! నిన్ను కూడ బాధించు చున్నవి గదే! నే నేమో విరహోత్కంఠిత నయితిని. అందుచే నిత్యము దీర్ఘము నిశ్వసింతును. అనిమీలిత నయిన నగుదును. క్షీణశరీర నయితిని, ఆ శఠునే యనవరతము ధ్యానించుటలో నిమగ్న నయితిని. శిథిలావయవ నయితిని.

పాపము! నీవో! నా పనికై యిట్టి నన్ను విడచి యా సుఖిని నాథు ప్రసన్నుని చేయుటకై నానావస్థను నా యవస్థను పొందితివి గదే! సఖీ! ఇది వాచ్య మగు నర్థము. ఇంత మాత్రమున నిందు విశేషము లేదు. భోక్తవ్య మాతి. అది యింతకు బూర్వమే స్పష్ట మయ్యె నంత్ర. దానితో నిద్రలేక పోవుట మొదలగు చేష్టావైశిష్ట్యమును నాయిక చూచినది. ఇట్టి మాతినాయ కోపభోగమును సూచించు చున్నది. నీ వా శఠ కాముకునితో విహరించి తివి. అందుననే యీ నిద్రలేక పోవుట. ఈ పని వాక్యార్థము. ఈ దీర్ఘనిశ్వాసము. ఈ నిరంతరనిశ్వాసము. ఈ యాలసత్వము. నీవు నీపని సాధించు కొంటివి. నీ వమందభాగ్యవు. నేను నిన్ను నమ్మి పంపితిని. ఇట్లు మందభాగ్య నయితిని. నీవు సఖివా! నీకేమి? లేదు! నీ కనుభవము. నాకు పరిభవము. నీ వింత పని చేయుదువా? ఇట్టి యీ వ్యంగ్యము మాతిస్వభా వము గుర్తించిన రసికులకే తెలియును.

★ తథాభూతాం దృష్ట్వా నృపసదసి పాంచాలతనయాం
వనే వ్యాధైః సార్ధం సుచిరముషితం వల్కలధరైః
విరాటస్యావాసే స్థితమనుచితారంభనిభృతం
గురుః ఖేదం ఖిన్నే మయి భజతి నాద్యాపి కురుషు

అత్ర మయి న యోగ్యః ఖేదః. కురుషు తు యోగ్య ఇతి కాక్వా ప్రకాశ్యతే. న చ వాచ్య సిద్ధ్యంగమత్ర కాకురితి గుణీభూత వ్యంగ్యత్వం శంక్యం ప్రశ్నమాత్రేణాపి కాకోర్విశ్రాంతేః.

## కాకువైశిష్ట్యము

కాకువైశిష్ట్యమున వాచ్యార్థము వ్యంజక మగుట కిది యుదాహర ణము. భట్టనారాయణరచిత వేణీసంహార నాటకప్రథమాంకమున నీ శ్లోక మున్నది. అందు సహదేవుఁడు భీమునితో "ఆర్యా! మీ రిట్లు సంభృతక్రోధు లయినచో నన్నగారు ధర్మరాజు కిప్పుడు ఖిన్ను లగుదురేమో!" అని యనునయించు నపుడు భీముఁ డిట్లనును. "ఏమీ! గురు వన్న ఖిన్ను డగునా? గురువులకు ఖేదపడుటయుఁ దెలియు నేమి!" అనియని యీ శ్లోక మును వ్యాహరించెను. "పాంచాలి" తనయ ద్రౌపది రాజుల సభలో వస్త్రాకర్షణ కేశాకర్షణ పరిభవము పొందుటను వల్కలములను ధరించి

మన మందరము వనములో వ్యాఘులతో సమముగా సుచిర ముండుటను, విరటుని కొలువున ననుచితారంభమున రహస్యముగా నివసించుటను యుధిష్ఠిరుడు చూచియు ఖిన్నుడ నయిన నా విషయమున ఖేదము పడును. కౌరవుల విషయమై యిప్పటికిని ఈ దురవస్థ యందును ఖేదము పొందఁడు'' అని యీ పద్యమున సోపహాస కాకువుచే లభించు వాక్యార్థము ''గురువు యుధిష్ఠిరునకు నాయందు ఖేద మనుచితము కాదు. కౌరవులందే ఖేదము యుక్తము'' అని వ్యంగ్యార్థము. ఈ పద్యమున ''మయి, కురుషు'' నా యందు కౌరవుల యందు'' ఈ పదద్వయము కాకుస్థానము. వీనిని ధ్వని వికార విశేషముతో నుచ్చరించి నపుడు రెండు స్థలముల యందును ప్రశ్న మాత్రమును సూచించి విశ్రాంత మయిన పిమ్మట తద్వైశిష్ట్యము కలిగిన సహృదయునకు ''ఖిన్నునిపై ఖేదపడుట యుక్తము కా నందున యుధిష్ఠిర ఖేదము నాయం దుచితము కాదు. అనేకాపరాధము లాచరించిన కౌరవుల యందే యుచితము.'' అని వ్యంగ్యము భాసించును. ఇది భీముని క్రోధప్రకర్షము సూచించును.

ఇందొకటి, శంకింప వలయును. ఖేదానౌచిత్యరూప మయిన వ్యంగ్యార్థము వాచ్యార్థమునకే శోభనత్వము సంపాదించునదై సాధక మగుచున్నది. ''నాయందు ఖేదము, కౌరవు లందది లేమి. ఇది పాత్రాపాత్ర వైపరీత్యము. ఇట్టి వాక్యార్థ మయుక్త మగుట సరిగా పర్యవసిత మగుట లేదు. తత్పర్యవసానము సంపాదించుటకు వ్యంగ్యము నర్పించు కాకువు సమర్థ మయినది. ఇట్లు కాకువు వాచ్యసిద్ధిలో నంగము కాఁగా తద్ద్వార మయిన వ్యంగ్యమును వాచ్యసిద్ధ్యంగమే యయినది. గుణీభూత మయినది. ఇందలి వచనము కుపితుఁ డుద్ధతుఁడు నయిన భీమునిది. అందుచే నది విపర్యయము నందు పర్యవసింప వలయును. అది కాకువ్యంగ్య మయిన ప్రశ్నరూపార్థము లేక సంభవింపదు. కాకువ్యతిరేకముగా వివక్షిత వాచ్యమే సిద్ధింపదు. కాకువు నాశ్రయింప కున్న వాచ్యసమన్వయము ఘటింపదు. కాకు వనునది యొక శబ్దధర్మము కదా! శబ్దస్పృష్టము శబ్దోక్తమే యగును. అర్థము వాచ్య సామర్థ్యాక్షిప్త మయి నందు వలన, వ్యంగ్య మయినను వాచక శబ్దస్పృష్ట మయినందున గుణీభూత మగును కదా! కాఁగా నిది గుణీభూత వ్యంగ్యోదాహరణమే కాని ధ్వన్యుదాహరణ మెట్లగును? ప్రధాన ధ్వన్యుదాహరణ ప్రస్తావమున నీ ప్రసక్తి యేల? అని.

సమాధానము :— కాకు విందు క్రోధప్రకర్షకము. క్రోధము రౌద్ర రస స్థాయిభావము. కాఁగా కాకువు రసమున కంతరంగ మయినది. వ్యంగ్య మయిన రౌద్రరసమె యిచట ప్రధానము. వాచ్యార్థము దాని కంగము కావున నిచట గుణీభూతవ్యంగ్య మని యాశంకింప నవసరము లేదు. "నాద్యాపి కురుషు ఖేదం భజతి" ఇప్పటికి కురువుల విషయమై ఖేదము పొందఁడా?" యనుచోట గల నఞ్ (నిషేధము) ప్రశ్న కాకువును వాక్యార్థ ప్రతీతి యందే పర్యవసానము పొందును. ఏ కాకువు లేక వాక్యార్థబోధయే పర్యవసానము పొందదో, అట్టి కాకువు నిరూపించిన (కాకువుచే నాక్షిప్త మయిన) వ్యంగ్యార్థము గుణీభూత మగును. కాని యిట్టి స్థలములందు గాదు. ఈ స్థలము నందు కాకువు వ్యంగ్యార్థమును నిరూపింపకనే కేవల ప్రశ్న మాత్రము చేతనే విశ్రాంతము కాఁగలదు. ఇచట కాకువునకు రెండు సామర్థ్యము లున్నవి. కేవలము ప్రశ్నమాత్రార్థమును రూపించుట యొకటి, వ్యంగ్యార్థమును నిరూపించుట మరియొకటి, వ్యంగ్యనిరపేక్ష మయిన ప్రశ్నమాత్రార్థమున గూడ వాక్యార్థము పర్యవసానము పొందును. ఇట్లు వాక్యార్థ పర్యవసాన మున్నను వ్యంగ్యార్థము, రమణీయతా నిదానముగా స్ఫురించును. ఆ వ్యంగ్యార్థము చేతనే వాక్యార్థపర్యవసానము కలుగ వలె నని లేదు. ఈ వ్యంగ్యార్థము లేకున్నను వాక్యార్థమునకు పర్యవసాన మున్నందున వ్యంగ్యము గుణీభూత మగుట లేదు. ఏ వ్యంగ్యార్థము లేక వాచ్యార్థము పర్యవసన్నము కాదో ఆ వ్యంగ్యార్థముననే వాచ్యార్థము సిద్ధము కావలసి యున్నపుడు, అట్టి వ్యంగ్యార్థ మట్టి వాచ్యసిద్ధిలో నుపకరించినందున వాచ్యసిద్ధ్యంగము కావచ్చును కాని యిచట నట్టి విధానము లేదు. "మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్" మొదలుగా గల యొక పద్యము వాచ్యసిద్ధ్యంగరూప గుణీభూత వ్యంగ్యోదాహరణముగా మున్ముందు రాఁగలదు. అది కుపిత భీమసేన వచనము. "కౌరవశతమును మథించెదను. దుర్యోధనుని తొడలను గదచే చూర్ణము చేసెదను. దుశ్శాసన వక్షోరక్తమును త్రాగెదను." అని తత్పూర్వ ముద్ధతుఁ డయిన భీమసేనుఁడు ప్రతిజ్ఞ చేసినాఁడు. ఇప్పుడు "మథింపను, చూర్ణము చేయను, త్రాగను" అని పలుకుట పరస్పర విరుద్ధము. పూర్వాపర బాధితము. కావున పూర్వార్థ సిద్ధికై "మథింపనా? చూర్ణము చేయనా?? త్రాగనా??? అని కాకువు

వలన నభివ్యంగ్య మగు "అవశ్యము మథింతును, అవశ్యము చూర్ణము చేయుదును అవశ్యము త్రాగెదను." అను నర్థము నాశ్రయింప వలయును. కాఁగా నిచట వ్యంగ్యము వాచ్యసిద్ధ్యంగ మగును. ఆ వ్యంగ్యము లేక ఆ వాచ్య మచట వేరు విధమున సిద్ధము కా నందున నట్లంగీకరింప వలయును. ఇచట నట్లు కాదు. అందుచే నిచట గుణీభూత శంక కవకాశము లేదు. ఈ విషయము మరల నిరూపిత మగును.

★ తదాముమగండస్థలనిమితాం దృష్టిం ననయస్యన్యత్ర
ఇదానీం సైవాహంతౌచ కపోలౌ న సా దృష్టిః

అత్ర మత్సఖీం కపోల ప్రతిబింబితాం పశ్యతస్తే దృష్టిరన్యై వాభూత్. చలితాయాం తు తస్యాం అన్యైవ జాతా. ఇత్యహో ప్రచ్ఛన్న కాముకత్వం తే ఇతి వ్యజ్యతే.

## వా క్య వై శి ష్ట్య ము

వాక్యవైశిష్ట్యమున వాచ్యము వ్యంజకమగుట కిది యుదాహరణము. ఒక నాయకునకు ధీరగంభీర యయిన ప్రియురాలు కలదు. ఒకనాఁడొక సౌందర్యాభిమానిని వారి యింటికి వచ్చినది. తన ప్రియురాలి దగ్గరగా కూర్చొనినది. ఆ సౌందర్యదేవతపై నాయకున కభిలాష యున్నది. అనిమేష నయనాలతో జూడ దలచి నాఁడు. కాని నికటమున తన నాయిక యున్నది గదా! ఆమె యేమయిన ననునేమో? ఆమె చూచుచుండగా జూడరాదు. ఈ యుద్దేశ్యము గల నాయకుఁడు సాక్షాత్తుగా నామెను చూచుటకు జంకి తన నాయికా స్వచ్ఛకపోల మండల ప్రతిబింబిత నామెను సాదరముగా తనివి తీర చూడ నుత్సుకుఁ డయినాఁడు. నాయికాముఖావ లోకన మిషమున జూచి చూపరి యయినాడు. ఆ సుందరి కొంత కాల ముండి వెడలి పోయినది. కపోల ప్రతిబింబనము లేదు. నాయకుఁ డిఁక మామూలే కదా! యని నిరీక్షణ నివృత్తుఁ డయినాఁడు. ఈ దృష్టి వికార మును చతురనాయిక గుర్తించినది. రహస్యము తెలిసి కొనినది. చురుక్కు మన్నది. ఇట్లనుచున్నది. "అపుడు నా గండస్థల నిమగ్న మయిన దృష్టిని నీవు మరల్చలేదు. ఇప్పుడు ఆ నేనే, ఆ కపోలములే! ఆ దృష్టి లేదే!" ఇది వాచ్యార్థము. ఆ నీ హృదయనిహిత సౌందర్యముద్ర ఆమె వచ్చి నా సన్ని

ధిలో నున్నపుడు నా కపోలము నందు నీ దృష్టి సద్భావస్నేహభక్తిము కలదిగా నిర్నిమేషముగా ఆత్తే నిలబడెనే! ఎల్లును మరల్పలైతివే! ఇపు డామె వెళ్లిపోగా నా దృష్టి దాక్షిణ్యమున తొలుస్తున్నాలినదై పై రయినది. ఆ నేనే, ఆ కపోలములే, ఆ చూపేది? ఆమె యుండగా చూచితివా! ఆమె పోగానే మానితివా! అహో! హా! నీ ప్రచ్ఛన్న కాముకత్వ మేమయా? ఇంతటి యుబలాట ముండెనేమి! అని వ్యంగ్యము. అవిచిత్రమగు వాచ్యము సర్వవాక్యసాధారణము. వ్యంజనసహకారోచితమయిన వైచిత్ర్యమీ వ్యంగ్య మున గలదు.

వాక్యసమన్వయ మునకుఁ బ్రయోజక మయిన పదమును వాక్యమనుట యొక మర్యాద. ఇందు వాక్యసమన్వయమునకు "తదా ఇదానీం" "అపుడు ఇపుడు" అను పదద్వయము ప్రయోజక మగుట వాక్యము. ఈ పదము లుపనాయికా సాన్నిధ్యమును అసాన్నిధ్యమును వెంటనే తెలియఁజేయు గలవు. దీని ద్వారమున నాయకుని ప్రచ్ఛన్న కాముకత్వము గోచరించును.

★ ఉద్దేశోఽయం సరసకదలీ శ్రేణి శోభాతిశాయీ
కుంజోత్కర్షాంకురిత రమణీవిభ్రమో నర్మదాయాః
కించైతస్మిన్సురత సుహృద స్తన్వి! తే వాంతివాతాః
యేషామగ్రే సరతి కలితా కాండకోపో మనోభూః

అత్ర రతార్థం ప్రవిశ! ఇతి వ్యంగ్యం.

వాచ్యవైశిష్ట్యము

ఇది వాచ్యవైశిష్ట్యమున వాచ్యార్థము వ్యంజక మగుట కుదాహర ణము. ఇందలి వాచ్యార్థమె స్వస్పందసుందర మయిన వైలక్షణ్యము కల దగుట వలన వ్యంగ్యవ్యంజక మగును. సార్థకములు రమణీయము లయిన విశేషణము లుండుట యిచటి వైశిష్ట్యము. ఒక రమణార్థి కాముకుఁడు నాయిక నుద్దేశించి యిట్లు పలుకును. ఈ నర్మదా తీర భూప్రదేశము సర సము లయిన కదళీ పంక్తులచే శోభితమైయున్నది. ఇచటి కుంజరచనలు వీని యుత్కర్షలు స్త్రీలకు విభ్రమాపాదకములు. ఇంక నిచట సురత సౌహృదము లయిన వాతపోతములు వీచు చున్నవి. ఆ వాతములకు ముందు గా మన్మథుఁ డాకాలిక కోపము కలవాఁడై ప్రసరించు చున్నాడు. ఇది

సామాన్య మగు వాచ్యార్థము. ఇందలి విశేషణయోగము సాభిప్రాయము. ఓ తన్వీ! నీ యవయవము లన్నియు నాశాజనకములు. అనుభవయోగ్యములు అనుభావన యోగ్యములును, ఈ నర్మదోద్దేశ మూర్ధ్వప్రదేశము. సమతల వర్తులే మాత్రము చూడజాలరు. ఇది నిర్జనతాస్పదము. ఉద్దీపకము. ఇచటి స్నిగ్ధకదలీ భాగములు పంక్తులు పంక్తులై శోభాతిశయము కలిగి యున్నవి. శుష్కపత్రములు లేవు. కాని ముర్మ్మర మర్మ్మర ధ్వను లుండవు. ఎంతయో చూచుటకు రమ్యము కదా! ఇందు లతాగృహములు ప్రియుల విహారభూములు. అందు మంజుల మధుకర గుంజితములు కలవు. పుష్పముల సమృద్ధి కలదు. వీని జూడగనే రమణీమణుల కుత్పన్నము కాక పోయినను విభ్రమ ముత్పన్న మగును, స్మరోద్భేదము లేని వారలకు నది కలుగును. రతిపండిత వయిన నీ విప్పుడు కామవిముఖ వయితి వేని నేను వ్యసన ముత్తరింప గలనా? ఇంతియ కాదు. కామవైముఖ్యమున్న నింకను బాధ కలదు, శైత్యసౌగంధ్యములు కలిగి సురతశ్రమను పోగొట్ట జాలిన వాయువులు మందముగా మందముగా మందమందముగా వీచు చున్నవి. ఇంత నకాండకోపము వహించి కామదేవుఁడు సరించుచున్నాడు. ఇట్టి సంఘటనములో సురతవైముఖ్యమెయున్నచో కామస్వామి కుపితకుపితుఁడై యేమేమి చేయునో? కావున నీ విందు సురతార్థమై యవశ్యము ప్రవేశింపుము. నే నిప్పుడు మిక్కిలి రిరంసా వివశుఁడను.'' ఇందలి ప్రదేశాది వాచ్యము నిరుక్త విశేషణ వైశిష్ట్యము వలన కాముకాభిప్రాయము నభివ్యంగ్యము చేయుచున్నది. ఇట్టి వాచ్యవైశిష్ట్యము వ్యంజనోత్థాపకము.

★ సుదత్యనార్ద్రామనాః శ్వశ్రూర్మాం గృహభరే సకలే
క్షణమాత్రం యది సంధ్యాయాం భవతి న వా భవతి విశ్రామః

అత్ర సంధ్యా సంకేతకాల ఇతి తటస్థం ప్రతి కయాచిత్ ద్యోత్యతే.

## అ న్య స న్ని ధి వై శి ష్ట్య ము

అన్యసన్నిధి వైశిష్ట్యమున వాచ్యము వ్యంజక మగుట కుదాహరణము. వక్తృ బోద్ధవ్య భిన్న మయిన తటస్థ వ్యక్తి సన్నిధానము యొక్క వైలక్షణ్య మిందు వ్యంజకత్వమున నిదానము. ఒక పరకీయ నొకఁడు

కామించినాఁడు. వారి సమాగమమునకు సంకేతకాల మింకను లభ్యము కాలేదు. అతఁ డెప్పుడా? యెప్పుడా! యని సంకేతకాల మర్థించుచు తటస్థుని వలె నా ప్రక్కగా నున్నాఁడు. ఆ ప్రచ్ఛన్న కాముకునకు కాల విశేషమును సూచింప వలయునని యా కామిని సంకల్పము. ప్రక్కయింటి యామెను సంబోధించి తన యత్తగారి యొత్తిడి నుపాలంభముగాఁ జెప్పువానివలె నా తటస్థభావమున నున్న కాముకునకు సంకేతకాలము నిట్లు సూచించు చున్నది. అమాయముగా నా పనులు చేయు నన్ను నా యత్త యకారణ ముగా సకల మయిన యింటి పాకికి యంపు ప్రేషణము చేసి పెత్తనము చేయును. సాయంకాల సమయములో క్షణమాత్ర మయిన విశ్రామము కలుగునో? కలుగదో? ఏమి చేయుదునమ్మా! అని వాచ్యము. అసలే యత్త. అందు ననార్ద్రముగా నకరుణముగా నన్నాజ్ఞాపించును. అయాస ముగా నున్నదని, శ్రమగా నున్నదని వ్యాజ మవలంబించుట కత్త దగ్గర నవకాశ ముండునా? ఇంటిలో పనియంతయు నేన చేయవలయును. సర్వకాలము నేను వ్యగ్రముగా నుండక తప్పదు. క్షణమేని విశ్రామము కలిగిన సాయంకాలమే కలుగ వలయును. అప్పుడే యే మాత్రమేని యవకాశము లభించును. ఇతర సమయము లం దేమియు గలుగు నట్లు లేదు. మా యత్త శుష్కహృదయ. ఇంటి పనులలో నాకు విరతి నిచ్చునో? యీయదో? అని సందేహము. ఏమేని దైవవశమునఁ గలిగిన నది సంధ్యా కాలముననే. అప్పు డయిన క్షణమాత్రమే. అని సన్నిహితు నుద్దేశించి చలితచారిత్ర నిరూపించు వ్యంగ్యము.

★ శ్రూయతే సమాగమిష్యతి తవప్రియోఽద్యప్రహర మాత్రేణ
ఏవమేవ కిమితి తిష్ఠసి తత్సఖి! సజ్జయ! కరణీయం.

అత్ర ఉపపతిం ప్రత్యభిసర్తుం ప్రస్తుతా న యుక్తమితి కయా చిన్నివార్యతే.

## ప్రస్తావ వైశిష్ట్యము

ప్రస్తావ వైశిష్ట్యమున వాచ్యము వ్యంజకమగుట కిది యుదాహరణము. ఒక యువతి యనుభవ రసిక. ఇష్టప్రియు నభిసరించుటకై యతనము చేసినది. ఇంతలో నామె పతి వచ్చుచున్నట్లు తెలిసికొనిన యామె సఖి యప్పటి నా యువతి యభిసరణమును నివారించుట కిట్లు పలుకును. ఒక జాములో

నీ ప్రియుఁ డట! వచ్చునని వినవచ్చుచున్నది. నీ విట్లే యుండుట వేమి? చేయవలసిన పని సర్ది కొనవమ్మా! చెలి! ఇది జనసమక్షమునఁ గూడ చెప్పదగిన వాచ్యార్థము. నే నెప్పుడో వినుట కాదు. ఇప్పుడే వినుచున్నాను. ఒక జాములోననే యాతఁడు వచ్చునట,! రేపటెల్లుండ్లలో వచ్చునని కాదు. ఆ వచ్చునది నీ ప్రియుఁడట. ఏమి ప్రియుఁడో! ప్రియుఁ డని సోల్లుంఠనోక్తి అతఁడే ప్రియుఁడయిన నీ విట్లుద్యమింతువా? నిన్ననురాగింపఁ జేసికొన లేని యా మగవాఁ డెంతటి ప్రియుఁడు? ఆ వచ్చువాఁ డెంతటి యుబలాటము తోడనో వచ్చును. ఇప్పుడే అటువెళ్ళి ఇటు వత్తు ననుకొందు వేమో? అంత త్వరగా నెట్లు రాగలవు? వచ్చిన నా యుపభోగ చిహ్నము లెట్లు దాఁచెదవు? ఆతడు నీ భర్త. నీ యా చిహ్నలను గుర్తించినచో, ఏదో! నీ భర్త వచ్చుచున్నాడు. ఇంక నిట్లే యుందు వేమి? ఆతడెంత యాకలితో నున్నాడో? భోజన మాతనికి సరిగా గుదిరినదో? లేదో? పాపము! ఆతనికి నీవు చేయున దింతియే కదా! త్వరపడుము! కరణీయపాకము చేయుము. నీ విపు డభిసరించుట ప్రమాదము. ఈ యభిసారవేషము మాని యింటిలోఁ బనులు చేయుము! ఇప్పు డభిసరింప వలదు. అని వ్యంగ్యము. ఈ చెప్పు సఖి కా యువతి రహస్యము తెలియును. ఆమె యభిసార సముచిత వేషము ధరించు ప్రకరణమున భర్తప్రత్యాగమన వార్తను తెలియఁ జేసి యా యభిసరణము నిషేధించు చున్నదన్న ప్రస్తావము గుర్తించిన సహృదయులకు వ్యంగ్య మవభాసించును.

★ అన్యత్ర యూయం కుసుమాపచాయం
కురుధ్వమత్రాస్మి కరోమి సఖ్యః
నాహంహి దూరం భ్రమితుం సమర్థా
ప్రసీదతాయం రచితోఽంజలి ర్వః

అత్ర వివిక్తోయం దేశ ఇతి ప్రచ్ఛన్న కాముక స్త్వయాఽభి సార్యతాం ఇత్యాశ్వస్తాం ప్రతికయాచిన్ని వేద్యతే.

## దేశవైశిష్ట్యము

దేశవైశిష్ట్యమున వాచ్యము వ్యంజక మగుట కిది యుదాహరణము. ఒక చతుర సురతాసక్త నాయిక తన యుపపతి సన్నిధి నుండి వచ్చిన ప్రియసఖిని జూచి దగ్గరనున్న యితరసఖులను దూరము పంపఁ దలఁచినది,

తా నప్పు డున్న ప్రదేశమును వివిక్తముగాఁ జేయవలయు నని కాంక్ష పడి నది. ప్రియు నప్పటికి రప్పింప వలయునని కోరిక పడినది. సఖి అంగని సమక్షములో నిట్లనును. ఓ చెలియలారా! మీరు వేరొక స్థలమున బుష్పాప చయమును చేసికొను డమ్మా! నే నిచట నా పని చేయుదును. నేను మీర కూరక మా పనికై పరిభ్రమింపలేనే! మిమ్ములను బ్రతిమాలు కొందునే! మీకు నమస్కరింతునే! పొండు! ఈ స్థలము నాకై విడిచి మీరలు పొండు. ఇది వాచ్యార్థము. ఇతర సఖు లీ వాచ్యార్థమున విషయము. తనకు విశ్వాస పాత్ర మయిన సఖి వ్యంగ్య విషయ. ఓ విశ్వాస్యా! ఈ ప్రదేశము నిర్జనము. నా ప్రియు నెట్లేని యిచటకుఁ బంపుము. నీ వీ గుంపు నంతను ఏదేని వెంటబెట్టుకొని తీసికొని పొమ్ము! ఆ నా ప్రచ్ఛన్న కాముకు నేదేని సఖి వేషము వేసికొన్న విధమున నిటుఁ బంపుమా! అని వ్యజ్యమాన మగును. దీనిలో సఖీజన నిష్కాసనమాత్రమె వ్యంగ్యము కాదు. దేశవైశిష్ట్యమున నాశ్వస్త యయిన సఖి నుద్దేశించి యభిమతార్థ ప్రార్థనము వ్యంగ్య మగును. సహృదయప్రతీతి విశ్రాంతి యంతవరకుండును గదా. సఖీ వ్యావర్తనము మాత్రమె వ్యంగ్య మగునో యది యగూఢ మగుటవలన గుణీభూతవ్యంగ్య మగును. కావున నిభృత కాముకుని నీవు పంపవలసిన దని వ్యంగ్య మూహింప వలయును.

★ గురుజనపరవశ! ప్రియ! కిం భణామి! తవ మందభాగిన్యహం
అద్య ప్రవాసం వ్రజసి! వ్రజ! స్వయమేవ జానాసి కరణీయం.
అత్రాద్య మధుసమయే యది వ్రజసి? తదాహం తావన్న
భవామి, తవ తు న జానామి గతిమితి వ్యజ్యతే.

## కాలవైశిష్ట్యము

కాలవైశిష్ట్యమున వాచ్యము వ్యంజక మగుట కిది యుదాహరణము. దంపతుల శృంగార మిందు కలదు. నాయకుఁడు ప్రవాసమునకుఁ దలఁచుచున్నాఁడు. నాయిక యిట్లనును. గురుజనుల కత్తమామల కధీనుఁడ వయిన ప్రియుఁడా! నేనేమి పలుకఁగలను! నే నతిమందభాగ్యను. ఇప్పుడే సమయ ముందు ప్రవాసము పోదురా! పొండు! చేయవలసినది స్వయముగనె తెలిసి కొందురులే! ఇది వాచ్యార్థము. ప్రియా! మీ పెద్దలు తలిదండ్రులు మాననీయులె యగుదురు కాక. వారేమి విదగ్ధులు? అవిదగ్ధజనులకు నీ వశ్య

నుడ వయితివి. మన్మథోన్మాదక మయిన యీ వసంతమునఁ గూడ నిన్ను ప్రవాసార్థమై పంపుచున్నారే. మీవా రత్యంతము జడత కలవారు కదా! తరుణీతరుణుల కీ సమయమున వియోగము కలుగనీయ వచ్చునా? ప్రియుడా! నీ వీ సమయమున నా వియోగమును సహింప లేవని నాకుఁ దెలియును. ఇట్టి నేను నీ వియోగ మిప్పు డెట్లు సహింప గలనోయీ? నీవు వారి కధీనుడ వయితివి. నామాట విందువా? నా నీ నీ నా బాధలు పరికింతువా? నిన్ను నే నేమన గలను? ఏమన్న నేమి ప్రయోజనము? నేనేమి పలికినను నిరర్థకమే. కావున నే నేను మందభాగ్యనయితిని. ఇప్పటి యీ వసంతములో ప్రవాసు లును ప్రియాచింతనము తగిలిరగిలి యింటికి వత్తురుకదా! నీ విప్పుడు ప్రవా సము పోవుదువా? పోవుదువా? పో! పొమ్ము! నే చేయునదేమి? నాకు మర ణమే గతి. నీవటు పోగనే నాజీవ మిటు పోవును. ఈ మధుసమయములో నీవు ప్రయాణింప నేను నే నగుదునా? నీ గతి-విధాన మేమగునో? నేనేమి తెలియగలను? ఇది వ్యంగ్యము. అనురక్తనాయిక వక్త్రి. ప్రవాసము పోదలచిన నాయకుఁడు ప్రతిపాద్యుడు. ఇది విశిష్టసమయ మని "అద్య" పదమున భాసించును. ఈ సమయములో నన్ను నీవు వీడి పోయినచో నాకు మరణము ధ్రువము. నీ దశ యేమో? అను నర్థము భావనాసుందరమై భావు కుల కవభాసించును.

★ ఆదిగ్రహణాచ్చేష్టాదేః తత్ర చేష్టాయా యథా ;
ద్వారోపాంతనిరంతరే మయి తయా సౌందర్యసారశ్రియా
ప్రోల్లాస్యోరుయుగం పరస్పరసమాసక్తం సమాసాదితం
ఆనీతం పురతః శిరోఽంశుకమధః క్షిప్తే చలే లోచనే
వాచస్తత్ర నివారితం ప్రసరణం సంకోచితే దోర్లతే

అత్ర చేష్టయా ప్రచ్ఛన్నకాంతవిషయ ఆకూతవిశేషో ధ్వన్యతే నిరాకాంక్షప్రతిపత్తయే ప్రాప్తావసరతయా చ పునః పునరుదా హ్రియతే.

## చేష్టా వైశిష్ట్యము

వైశిష్ట్యముల సంఖ్యానించు కారికలో నాది పదము గలదు. దాన చేష్టాదుల గ్రహింప వలయు నని సూచితము. చేష్టావైశిష్ట్యమున వాచ్యము వ్యంజక మగుట కిది యుదాహరణము. తనను జూచి తన యభీష్ట ప్రియ

నానాచేష్టలు సాభిప్రాయముగా ప్రవర్తించినది. వానిని సామోదముగా నొక నాయకుడు తన మిత్రుని సమీపమునం దిట్లు వర్ణించుచున్నాడు. నేను ద్వారోపాంతమున నుండగా సౌందర్యసార శోభాయుయయా నా ప్రియరమణి యూరువులను ప్రోల్లసింప జేసినది. ఒకటి నొకటి కలుసుకొను నట్లు కూర్చినది. అవకుంఠన వస్త్రమును ముందునకు లాగి కొనినది. చంచల నేత్రములను క్రింది ప్రదేశమునకు ప్రసరింప జేసినది. మాటల సందడి నాపి వేసినది. బాహువులను సంకుచితము చేసినది. ఇది సామాన్యవాచ్యార్థము. ఇందలి చేష్టల వైలక్షణ్యము గుర్తించిన వారు మాత్రమె యా చేష్టానిహిత మయిన యింగితము గుర్తింప గలరు. ఆమె సాభిప్రాయముగా చేష్టించినది. చేష్టాభావము లా నాయకునకు సుపరిచితములు. ఆ భావము లందలి వ్యంగ్యములు. ఊరుయుగప్రోల్లాసము పరస్పర సమాసంజనము నను క్రియాద్వయమున "నిన్నూరుమధ్యము లందు గ్రహింతును. తన్మధ్యమున నిన్ను పీడింతు నని స్వయముగా విపరీత (వ్యానతము స్త్రీ కర్తకము) సురత ప్రదానము చేయుదు"నని వ్యంగ్యము. మేలి ముసుగు నాకర్షించుటను "నీవు నిభృతముగా సమాచ్ఛన్న శరీరుడవై యితరులకు దెలియకుండ రావలయు నని వ్యజ్యమాన మగును. చూపులను క్రిందికి దింపుటచే లోచనములు కమల సదృశము లగుట కమలములు మీలనము పొందిన పిమ్మట ననగా సంధ్యాకాలమున జీకటిలో నీవు రావలయునని గమ్య మగును. సఖుల మాట లాపుటచే (ముఖముద్రణమున నివారించుటచే) కోలాహల రహిత కాలమున రావలయు నని వ్యంగ్యము. భుజాసంకోచమున పారితోషిక ముగా నాలింగన మిత్తునని ధ్వన్యమాన మగును. ఇందు కామశాస్త్రీయము లయిన బాహ్యాభ్యంతర సురత విశేషముల సూచన మున్నదని నాయకుండు గుర్తించి యందులకై యుబలాటపడి స్నిగ్ధునితో నిట్లు చెప్పుకొన్నాడు.

## ద్వికాది భేదములు

ఇప్పటి కింతవర కుదాహరించిన పద్యములలో నొక్కొక దానియం దితర భేదాంతరములును గలవు. ఇతరభేదములకు నదియే యుదాహరణము కావచ్చును. అయినను వేరు వేరుగా నుదాహరణములు నిరూపితములు. అద్వైతులకు నిస్సందేహ మయిన వ్యుత్పత్తి కలుగవలయునని వాని వానిని వేరు వేరుగా నిరూపింప నవసరము కలిగినందు వలనను అట్లుదాహరించుట

యుపపన్నము. వక్తృబోద్ధవ్యాదులు ప్రత్యేకముగా వ్యంజకములు కావలయు నన్న నియమము లేదు. అవి యొక టొకటి మిలితములై వ్యంజకములు కావచ్చును. ఈ యంశ ముదాహరణములందు విశదము. వక్తృబోద్ధవ్యాది వైశిష్ట్యమున వాచ్యమే వ్యంజక మగుట కాక, లక్ష్యార్థమును వ్యంజక మగును. వ్యంగ్యార్థమును వ్యంజక మగును. రెండు మూడు వైశిష్ట్యములు సంబంధించిన స్థలము లందును వాచ్యమువలె లక్ష్యవ్యంగ్యములును వ్యంజకము లగును. వక్త్రాది వైశిష్ట్యమున వాచ్యము వ్యంజకమగుటకు బది యుదాహరణము లిచట నిరూపితములు. ఇట్లే లక్ష్యము వ్యంజక మగుటకు యుదాహరణములు, వ్యంగ్యము వ్యంజక మగుటకు బది యుదాహరణము లీయవచ్చును. ఇంకను ద్వికాదిభేదమున ననేక భేదములు కలుగును. వానిని వ్యుత్పన్నమతులు స్వయముగా నూహించి గుర్తించుట సముచిత మని మమ్మటు లుదాహరింపలేదు. ద్వికభేదమున వక్తృబోద్ధవ్యయోగమును మాత్ర మిట్లిపుడు గుర్తింప వచ్చును.

★ వక్త్రాదీనాం మిథః సంయోగే ద్వికాదిభేదేనానేన క్రమేణ లక్ష్యవ్యంగ్యయోశ్చ వ్యంజకత్వముదాహార్యం ద్వికభేదే వక్తృబోద్ధవ్యయోగే యథా;

శ్వశ్రూ రత్ర నిమజ్జతి అత్రాహం దివసకే ప్రలోకయ!
మా పథిక రాత్ర్యంధ! శయ్యాయామావయోర్నిమజ్ఞ్యసి!

వక్తృబోద్ధవ్య వైశిష్ట్యము

వక్తృవైశిష్ట్యము బోద్ధవ్యవైశిష్ట్యము రెండును వాచ్యమునకు వ్యంజకత్వమును సంపాదించుట కిది యుదాహరణము. ఒక సుందర పథికుడు మార్గవశమున నొక గ్రామమునకు వచ్చినాడు. అచట నొక యింటిలో నొక రమణీయరమణి యున్నది. ఆమె చలితచరిత్ర. ఎవరెవరు తన భావమును రసీకరింతురో యామె యన్వేషించును. ఆ యింటి కాతడు వచ్చి యా రాత్రి యచట నుండుట కభిలాషపడి యవకాశ మిమ్మనినాడు. ఆమె యతని నటు నిటు వాలుగా వీలుగా జూచినది. ఆమె కోరికలు రేగినవి. ఆతడు నువ్విళ్ళూరినాడు. ఆమె హృదయము వికసనోన్ముఖ మయినది. ఆతని నా నా డచట నుంచుకొన వలయును. ఈ వార్త యాతనికి రహోవిధిని జెప్ప దూతిక లేదు. తానే దూతికయై యిట్లు పలుకు చున్నది. ఈ

స్థలములో మా యత్త పడుకొని శయనించును. నే నిచట. పగటియందే చూచుకొనుము. ఓయీ! పథికా! నీవు రేజీకటి వాడవు. మా శయ్యాపై పడకుమా! ఇది వాచ్యార్థము. దీని నెవరు తెలిసికొన్న నిబ్బంది లేదు. ఆమె యత్త తెలిసికొన్నను నా కోడ లెంత మంచిది! "ఎంతయోగ్యురాలు! ఎంత చక్కగా మర్యాదగా నీతిగా జెప్పినది." యని తలచును. వక్త్రి యయిన యా మధురభావ భావమును భావించి నప్పుడు బోద్ధవ్యు డయిన యా పథికుని యంతర్భావ మాలోచించినప్పుడు రెండిటి వైశిష్ట్యము హేతువుగా వాచ్యార్థము వేరొక ఘ్రాత కలదై వ్యంజక మగును. ఆమె యేదో చెప్పదలచి యిది చెప్పినది. ఆతడిది గుర్తించుచు నేదియో గ్రహించును. "మా యత్త ముసిలిది రాత్రి సమయము లందు జడుకొనెనా! యిక లేవదు. పుస్తకము వలె శయనించును. నిస్సందేహముగా నిద్రించును. ఆమెవలన నునకెట్టి యడ్డంకి లేదు. మన మెల్లును శంకింప నవసరము లేదు. నే నింత కన్న వేరయిన ఆ ఆ స్థలమున నుందును. నే నచట నుండుట మాత్రమె, నిద్రింపను. సోత్కంఠనై నిన్నే నిరీక్షింతును. ఈ యింట నిక నెవరు లేరు. మే మిద్దరమె. శయ్యల యునికిని సూచింపగలిగితిని గదా! పథిక! నీవు పథికుడ వగుట నీ ప్రియారతి కలవాడవు కావు. కాలవ్యవధానమున నీకు నీ కూటమి యవసర మవశ్య మపేక్షితమును. రేజీకటి వాడనుట రహస్యగోపనము. పథికుండగుట శ్రమవశమున స్థానము మరచుట సంభవింపవచ్చును. రేజీకటి వాడగుట నట్లు శయ్యాపై పడుట సంభవింపవచ్చును. ఆ రాత్రి యేదేని పొరపాటున సంభ్రమపాటున నత్తనే లేపినను నామెయే లేచినను తన దోష మేమియు లేదని చాట వచ్చును. మా ప్రక్కలపై పడకుమా! యనుట నా శయనమునకే నిభృత నిభృతముగా వచ్చి యనుభవింపు మని యనుభవ మీయ వలయు నని ద్యోత్యము. నీవు నిశ్శంకముగా యథేష్టముగా విహరింపు మని వ్యంగ్యము.

★ "శబ్దప్రమాణవేద్యోఽర్థో వ్యనక్త్యర్థాంతరం యతః
అర్థస్య వ్యంజకత్వే తచ్ఛబ్దస్య సహకారితా."
శబ్దేతి న హి ప్రమాణాంతరవేద్యోఽర్థో వ్యంజకః.

ఇతి కావ్యప్రకాశేఽర్థవ్యంజకతానిర్ణయో నామ
తృతీయోల్లాసః

అర్థవ్యంజకత చెప్పుదు మని యర్థమునకు మాత్రము వ్యంజకత ప్రతిజ్ఞాత మయినచో శబ్దార్థోభయరూప మయిన కావ్యము వ్యంజక మగుట ఘటింప నేరదు. శబ్ద మర్థము కావ్యశరీర మయినపుడు ఏ యొకటియో వ్యంజక మనుట న్యాయము కాదు కదా! ఈ యంశమున సమాధానించుట కీ కారిక సమర్థము.

శబ్దసహకారము

శబ్దప్రమాణమున వేద్య మయిన యర్థము వాచ్యము కాని లక్ష్యము కాని వ్యంగ్యము కాని వ్యంగ్య మయిన యర్థాంతరమును ద్యోతనము చేయును. అపు డర్థము వ్యంజకము కాఁగా శబ్దమునకు సహకారిత్వ ముండును. అర్థము వ్యంజకమయిన స్థలమునందు శబ్దము పరివృత్తిసహ మగును. ఉన్న శబ్దమును మార్చి శబ్దాంతరము నచట కూర్చ వచ్చును. అర్థము మాత్ర మచట ప్రధానము. అందుచే నర్థమునకు ప్రాధాన్య ముండును. శబ్ద మప్రధాన మగుట సహకారిగా నుండును. శబ్దవ్యంజకత యున్న స్థలమున శబ్దము ప్రధాన మగును. అర్థ మప్రధాన మగును. ఈ యంశము పూర్వము నిరూపిత మయినది. ఇచట నర్థ ప్రధానత గుర్తించునది. మొత్తమున కర్థశక్తిమూలకమున గాని శబ్దశక్తిమూలకమున గాని శబ్దార్థములు రెండును పరస్పర సహకారము కలవై వ్యంజకము లగునని గ్రహింపవచ్చును. అందుచే శబ్దార్థోభయమయ కావ్యము వ్యంజక మగుట యనుపపన్నము కాదు. ఈ తృతీయోల్లాసమున నర్థవ్యంజకత ముఖ్యముగా నిరూపితము కదా! శబ్దప్రమాణవేద్య మయిన యర్థమే యర్థాంతర వ్యంజకము కావలయును గాని ప్రమాణాంతరవేద్య మయిన యర్థము వ్యంజక మగుట సమ్మతము కాదు. ప్రమాణాంతర వేద్యార్థము వ్యంజకమును కాఁజాలదు. కావుననే శబ్దమును వ్యంజకత్వమున నిమిత్తమగును.

లోకోత్తరాః కేచన లోచనేన సిద్ధాంజనం వ్యంజన మాదదానాః
అదృష్టపూర్వం రమణీయమర్థాత్ అర్థాంతరం ద్రష్టుముపక్రమంతే.

లోకోత్తరు లయిన సహృదయులు కొందఱు సిద్ధాంజనమయిన వ్యంజనమును లోచనమున స్వీకరించి, ప్రథమార్థము కన్న నతిరమణీయ మదృష్టపూర్వము నయిన యర్థాంతరమును గుర్తించుట కుపక్రమింతురు. కన్నులకు సిద్ధాంజన మున్న నదృష్టార్థ దర్శనము కలుగును. సచేతసుల కాలోచనమున వ్యంజనమున్న నచుంబిత రమణీయార్థ ప్రతిభాసము కలుగును.

# తృతీయోల్లాసము

## ధ్వని ప్రస్తారము

ధ్వని లక్షణామూల మభిధామూల మని రెండువిధములు. లక్షణామూలమున కవివక్షిత వాచ్యమని యభిధామూలమునకు వివక్షితాన్యపర వాచ్యమని సంకేతము. లక్షణామూలక మయిన యవివక్షితవాచ్యధ్వని యర్థాంతరసంక్రమిత మని యత్యంతతిరస్కృత మని రెండు విధములు. అభిధామూల మయిన వివక్షితాన్యపరవాచ్యధ్వని యసంలక్ష్యక్రమధ్వని యని సంలక్ష్య క్రమధ్వని యని రెండువిధములు. సంలక్ష్యక్రమధ్వనికే రసాదిధ్వని యని పేరు. సంలక్ష్యక్రమమున కనురణనధ్వని యని పేరు. సంలక్ష్యక్రమధ్వని శబ్దశక్త్యుద్భవ మని యర్థశక్త్యుద్భవ మని రెండు విధములు. సంలక్ష్యక్రమధ్వని విశేషము లర్థము నాధారము చేసికొని స్వరూప లాభము పొందును.

ద్వితీయోల్లాసములో లక్షణలోని ప్రయోజనమునకు వ్యంగ్యత్వమే యున్నదని సమర్థిత మయినది. అవివక్షిత వాచ్యధ్వని రెండు విధములు కదా అందు శబ్దము మొదట వ్యంజక మగుట ప్రతిపాదిత మయినది. పిమ్మట వివక్షితాన్యపరవాచ్యధ్వని లోని సంలక్ష్యక్రమధ్వని ప్రభేదము నందు శబ్ద శక్తిమూలము నవలంబించి శబ్దము వ్యంజక మగుటయు ప్రదర్శిత మయినది.

పిమ్మట తృతీయోల్లాసము నందు సంలక్ష్యక్రమధ్వని ప్రభేదము నందర్థశక్తిమూలము నవలంబించి యర్థము వ్యంజక మగుట యింతదనుక నిరూపితము. వ్యంజకత్వనిర్ణయ మిట్లుండుటనే గ్రంథకారులు మమ్మటులు నిరూపించినారు. వివక్షితాన్యపరవాచ్యము యొక్క సంలక్ష్యక్రమవ్యంగ్య ప్రభేదములో విభావాదిరూప మయిన యర్థమును వ్యంజక మగుట కలదు. అది యిందు నిరూపితము కా నందున వ్యంజకత్వనిర్ణయము కొంత న్యూనముగా దోచును. కావున "విభావాదుల వలన నీ యభివ్యక్తి యర్థసమాత్రమైయుండు నన్న యంశము నిచట ననుసంధానము చేసికొన వలయునని కొందరు వ్యాఖ్యాతలు సూచించినారు. ఈ విషయమున నివేదనీయమును ముందు ప్రతిపాదించెదము.

"అభినవ బోధాదిత్య ద్యుతి వికసిత హృత్సరోజాన్మే
రసయత! సరసాః! పరిమళ మసార సంసార వాసనా శాంత్యై"

హం హో! దేవి! పరేశి! మాం ప్రతి సదా సార్థతాధీనతా
మాయాతాప్యధునా ప్రసీద! భగవత్యేకం వచః శ్రూయతాం!
సద్యః కంచన తజ్ఞమేకమపి తం కుర్యా! కృతిం మామకీ
మేతాం యః ప్రమదోదితాశ్రు నిభృతశ్రోత్రం క్షణం శ్రోష్యతి."

న గ్రంథకార పదమాప్తుమథాస్మ్యపూర్వం
వాక్కౌశలం చ న నిదర్శయితుం ప్రవృత్తః
కింత్వేతదర్థ పరిశీలనతో వికల్పాః
సంస్కారవాంశ్చ సమియాదితి వాంఛితం నః,

# ప్రస్తుతి

సంస్కృతసాహిత్య మతిగహనము మనోరంజకము. అయినను సుశ్లిష్టము క్లిష్టము నగుటచే సాధారణు లయిన సారస్వతేయులకు అలసులయిన నిరుత్సాహులకు సుగ్రహము కాదు. యథాతథముగ నవబోధింపగల సాహిత్యవ్రతులు నేటికి నున్నారు. శ్రీవాగ్దేవతాపరావతారుడయిన శ్రీ మమ్మటపాదుడు కావ్యప్రకాశ గ్రంథమునకు రచయిత. మమ్మటుడు కశ్మీర నివాసి. జైయటు, కైయటు, వజ్రటు, ఉవ్వటు, ఉద్భటు, రుద్రటు, ధమ్మటు, అల్లటు, కల్లటు, భల్లటు, లోల్లటు, మొదలగు వారందరు కశ్మీరవాసులు. వ్యాకరణశాస్త్రమునందు మమ్మటున కసాధారణ పాండిత్యము కలదు. కావ్యప్రకాశ మెరుగని సంస్కృత సాహిత్య రసికుడు భారతజనతలో నుండడు.

మమ్మటుడు కావ్యప్రకాశ రచనమున నానాగ్రంథముల శోధించినాడు. ప్రాచీనతమాలంకారగ్రంథ రచయితల ననేకుల నుల్లేఖించినాడు. భట్టలోల్లట, శ్రీశంకుక, భట్టనాయక, వామన, ఆనందవర్ధన, అభినవగుప్తపాద, రుద్రట, ఉద్భట, మహిమభట్ట, భరత, భామహ, భోజదేవాదులను, జైమిని, కాత్యాయన, పతంజలి, భర్తృహరి, కుమారిల, అమరసింహాదులను స్మరించినాడు. గాథాసప్తశతి, మహావీరచరితము, మాలతీమాధవము, రఘువంశము, కుమారసంభవము, మేఘదూతము, శాకుంతలము, విక్రమోర్వశీయము, బాలరామాయణము, విద్ధసాలభంజిక, కర్పూరమంజరి, కుట్టనీమతము, మహాభారతము, విష్ణుపురాణము, కిరాతార్జునీయము, వేణీసంహారము, కావ్యాదర్శము, భర్తృహరి శతకత్రయము, హయగ్రీవవధ, రత్నావళి, నాగానందము. అమరు శతకము, శిశుపాల వధ, పంచతంత్రము, సూర్యశతకము, హర్ష చరితము, భట్టికావ్యము, మాలినీ విజయవార్త్తికములనుండి పద్యముల నుదహరించినాడు. ఈ గ్రంథముల మమ్మటుడు చక్కగా ననుశీలనము చేసెను. భవభూతి యుత్తరరామచరితము నీత డేలనో స్మరింపలేదు. అది మమ్మటుని దృష్టిలో నిర్దోషమా? లక్షింపలేదా? ఇతరములందువలె నిందును గుణదోషవిమర్శ చేయుట కవకాశము లేక పోలేదు. ఇట్లే మాళవికాగ్నిమిత్రము, బాలభారతము, వ్యాసుని పురాణములు, దశకుమార చరితము, ప్రియదర్శిక, కాదంబరి మమ్మట పరామృష్టములు కాలేదు. కారణము దురూహము. శీలాభట్టారిక విజ్జకాపద్యముల్లేఖించిన మమ్మటుడుదారుడు. భాసునికృతులనుండి మమ్మటు డేమియు నుదాహరింపలేదు.

మమ్మటుడు జైయటుని జ్యేష్ఠపుత్రుడు. కైయటు డువ్వటుడు మమ్మటుని తమ్ములు కైయటుడు పతంజలి మహాభాష్యమునకు వ్యాఖ్యాత. ఉవ్వటుడు వాజసనేయ సంహితకు భాష్యము రచించెను. తన తండ్రివజ్రటుడనెను. జైయటున కది నామాంతరమా? కాశ్మీరికపండితు లందరు శైవాద్వైత (ప్రత్యభిజ్ఞా) సంప్రదాయమునకు సంబంధించిన వారనుట వారి గ్రంథముల విశదము

కావ్యపి్రకాశగ్రంథము కారికా-వృత్తి-ఉదాహరణరూపమున త్రివిధముగా నున్నది. ఉదాహరణము లన్నియు నితరులవి. కొన్ని ఎవరివో? యెచటివో తెలియుట లేదు. కొన్నిటిని తానే రచించి యుండునా? మమ్మటుడు వృత్తి స్వయముగా రచించెను. అది క్లిష్టము సంక్షిప్తము పాండిత్య పరిపూర్ణము. అతని విద్వత్త వృత్తిలో పరాకాష్ఠపొంది కన్పడును. ఇతరులు రచించిన కొన్ని వాక్యములను కారికలలో కుదించుకొని తాను కారికల రచించెను.

కావ్యప్రకాశగ్రంథమున కనేకవ్యాఖ్యానము లున్నవి. కొన్ని మాత్రము ముద్రితములు. కొన్ని నామశేషములు. కొన్ని తాళపత్రములందున్నవి. కొన్ని స్వతంత్ర గ్రంథములుగా రాణించినవి. నే నముది్రత వ్యాఖ్యల చూడ నోచ లేదు. నా యీ విమర్శని రచనకు ముది్రతముల కొన్నిటి సహకార మందుకొంటిని.

౧. మాణిక్య — చంద్ర — సంకేతటీక
౨. మహేశ్వరభట్టు — ఆదర్శము
౩. శ్రీవిద్యాచక్రవర్తి సంప్రదాయప్రకాశిని
౪. భట్టగోపాల — సాహిత్యచూడామణి
౫. గోవిందఠక్కుర — కావ్యప్రదీపము
౬. నాగేశభట్టు — ఉద్యోత — టీక
౭. వైద్యనాథ — చంద్రిక
౮. భీమసేన దీక్షిత సుధాసాగర — టీక
౯. రాజచూడామణిదీక్షిత కావ్యదర్పణము
౧౦. భట్టవామన — బాలబోధిని
౧౧. మల్లాది లక్ష్మణశాస్త్రి బుధమనోరంజని
౧౨. హరదత్తశర్మ కావ్యప్రకాశ—విస్తారిణి

౧౩. హరిశంకరశర్మ — నాగేశ్వరీ - టీక
౧౪. గిరిధరలాల — పద్యమయ - వ్యాఖ్య
౧౫. హరిమంగళమిశ్ర — పరివర్తనము
౧౬. శ్రీ విద్యాభూషణ సాహిత్యకౌముది
౧౭. హేమచంద్ర కావ్యానుశాసనవివేకము
౧౮. సీతారామశాస్త్రి సాహిత్యోద్దేశము

అనునవి నా విమర్శనికి పుష్టిని నాకు తుష్టిని సంపాదించినవి. వీని నిట్లుపయోగించుకొనగలుగుటలో నిత్యస్మరణీయులు శ్రీరాయడుశాస్త్రి గురుపాదులు సర్వనిదానము.

నాబాల్యమున పితామహుడు రామయ్య కావ్యప్రకాశశ్లోకములను నోటి తీపిదనమునకై నాకు నేర్పెను. మా నాయన సుబ్రహ్మణ్యశాస్త్రి (శ్రీవైరాగ్యానంద భారతీస్వామిపాదులు) అర్థార్థముగా నర్థము చెప్పెను. విజయనగర సంస్కృత కళాశాలలో జదువుకొనునపుడు శ్రీ నాదూరి వేంకటశాస్త్రి చరణులు కావ్యప్రకాశమధ్యాపనము చేసిరి. రాయడు శాస్త్రి దేవులు హృదయగూఢము చేసిరి. నేనధ్యాపకుడనై తెనాలి సంస్కృత కళాశాలాచార్యుడనై తదధ్యక్షుడనై పరీక్షార్థులకు ప్రకాశార్థులకు కావ్యప్రకాశము పాఠము చెప్పితిని. కొంతకాలము నెల్లూరు సంస్కృత కలాశాలాఛాత్రుల కట్లె చెప్పితిని. ఇట్టి రచనాసంకల్ప మెప్పటిదో యగుటచే నాకుగా నే నధ్యాపనము చేసితిని. ఇప్పటికి నా పని యిట్టిది. నిత్యప్రస్పందితమగు నీప్రకాశనీతి నియతి యీ రచన యయినది. నా నవ రసగంగాధరమును జదివి నన్నభినందించుట కేతెంచిన సుహృదయులు సహృదయులు నే నటు చూచునపుడు ఈ విమర్శిని జూచి యేమేమో యెంతెంతయో వ్రాసిరి.

“ ఈ రచనలో శ్రీ ప్రత్యభిజ్ఞా సంప్రదాయస్వరూపములు, సాహిత్యసముచిత మయిన సారతర కావ్యభాష, భావసూచన సమర్థమయిన భంగీభణితి కలవు ఇది తెనుగుసేత, ఆంధ్రవ్యాఖ్యానము. సంస్కృత వ్యాఖ్యలలోని సర్వవిషయము లిందున్నవి. అందలి జటిలత, పారిభాషికత యిందు లేదు. ధ్వనిగంభీర ప్రసన్న పదలాలిత్యమిందున్నది. ఇంకను; ఈ వ్యాఖ్యానములో సమయానుకూలములు శాస్త్రీయము లయిన యుపమానములు దృష్టాంతములు కలవు. రచన యంతయు నేదేని వ్యాఖ్యాన

ములో నున్నదియె కావున ప్రామాణికము. ఇది చూచిన ప్రామాణిక వ్యాఖ్యల నన్నిటి చూచినట్లు ఆ యా వ్యాఖ్యల విప్రకీర్ణవిషయముల నొకచో పొందికగా కూర్చుట యిందు కాననగును. ఒక్కొక కారికా వ్యాఖ్యాన మిందొక్కొకవిశిష్ట మయిన వ్యాసము. తగిన యుపన్యాసము" ఇది వారి వ్రాయిడి సారము. బుధమనోరంజని వ్యాఖ్యాకర్త మా పితా మహునకు విద్యాగురువు. ఆ వ్యాఖ్య రాజచూడామణి దీక్షిత కావ్యదర్ప ణమునకు రూపాంతరము. దర్పణములో భట్టగోపాల సాహిత్యచూడా మణి ప్రతిబింబించినది. ప్రకాశస్వభావము విమర్శతనువులో నుండుటకై విమర్శిని సంప్రదాయప్రకాశిని యగు గావుత మని భావించి యిట్లు చేసితిని. సచేతసుల కిది యామోద మిచ్చునా?

అగ్రహిశమయిన సాహిత్యసంప్రదాయము మాకు గలదు. అది మా రాయడు భిక్ష. అది విమర్శిని యయినది. ఇంత కాలముగా వాసిత మయిన హృదయసంస్కారము విమర్శినికి మార్గ మిచ్చినది. కలిగిన సంస్కృతి హేతువు నిట్లు ప్రస్తుతింతును. ఇది సాహితీభావుకుల కాలోచన మిచ్చును.

నాట్యశాస్త్రము, అభినవభారతి, శారదాతనయ భావప్రకాశనము, వాత్స్యాయన కామసూత్రము, శ్రీతంత్రాలోకము జయరథప్రకాశసహితము శివసూత్రవిమర్శిని, భాస్కర వార్తికము, మాలినీవార్తికము ఈశ్వరప్రత్య భిజ్ఞ, అభినవగుప్త విమర్శిని, పరాత్రింశిక, స్వచ్ఛంద తంత్రము, క్షేమ రాజోద్యోత వివరణము, ప్రత్యభిజ్ఞాహృదయము, విజ్ఞానభైరవము, స్పంద సందోహము, స్పంద కారిక, పరమార్థసారము, శివసూత్రవార్తికము మహార్థ మంజరి మొదలగు ప్రత్యభిజ్ఞాదర్శన సంప్రదాయ గ్రంథముల భావరేఖలు పట్టుపడక పోయినచో నీ రచన యిట్లు విమర్శిని యయ్యెడిది కాదు. భామహ కావ్యాలంకారము, దండి కావ్యాదర్శము, వామన సూత్రవృత్తి, రుద్రట కావ్యాలంకారము, కావ్యాలంకారసారసంగ్రహము, సలోచన ధ్వన్యాలోకము, వక్రోక్తిజీవితము, వ్యక్తివివేకము, అలంకారసర్వస్వము, సాహిత్య మీమాంస, సాహిత్యదర్పణము, సాహిత్యరత్నాకరము, రసార్ణవ సుధాకరము, విద్యాథరైకావళి, రసగంగాధరము, కువలయానందము, చిత్రమీమాంస, అలంకార కౌస్తుభము, అలంకార మణిహారము, అభిధా వృత్తి మాతృక, శబ్దవ్యాపార విచారము, అలంకారరత్నాకరము, అలం కార మహోదధి, సాహిత్యసారము, సరస్వతీ కంఠాభరణము, దశరూప

కము, అలంకారసంగ్రహము, రసమీమాంస. రసతరంగిణి, రసరత్నహారము, రసప్రదీపము, రసచంద్రిక, కావ్యవిలాసము, కావ్యడాకిని, త్రివేణిక, వృత్తివార్త్తికము, వాగ్భట కావ్యాను శాసనము, అలంకార శేఖరము, కర్ణభూషణము, కావ్యమీమాంస, వృత్తిమీమాంస, ఉజ్జ్వల నీలమణి, చంద్రాలోకము, అలంకారముక్తావళి, అప్పారాయ యశశ్చంద్రోదయము, నంజరాజ యశోభూషణము, ప్రతాపరుద్రీయము, శృంగార ప్రకాశము, దూతీకర్మప్రకాశము, ఔచిత్య విచారచర్చ, కవికంఠాభరణము, కవీంద్ర కంఠాభరణము, భక్తిరసామృత సింధువు, శృంగార తిలకముల కతిపయ భిన్నభిన్న వ్యాఖ్యావిశేషముల యనుశీలన పరిశీలనముల వలని విశేషము లన్నియు నిందిముడవు. తద్భావభావన మిట్లు చేయించినది. ఇట్టివన్నియు నాంధ్రమున వెలువడుటను నేను చూడవలయు నని వినవలయునని సహృదయభావుకులు సంభావింతురు.

కావ్యప్రకాశమునందు ౧౪౨ కారిక లున్నవి. అవి గాఢముగా గూఢముగా సూత్రముల వలె సందృబ్ధములు. వాని యర్థము వ్రాసి సందర్భము తెలిపి విస్తరణము నిరూపించితిని. పరికరావధికముగా మమ్మటుడు వ్రాసెనని అల్లటు డనంతరము పూరించెనని కొందరందురు. వృత్తిరచన గద్యరూపము. మితాక్షరము, సారగర్భము, దురూహము, తదర్థవిశదిమకు నా కుపకరించిన వ్యాఖ్యలలో నచ్చటచ్చట ద్వైధ మున్నది. అదియు సంగతార్థము రమణీయమును. తత్సమీక్ష సహృదయులకును సంతోష మిచ్చుననియె యిందు చేర్చితిని. గ్రంథము మొత్తము ౬౦౩ పద్యముల నుదాహరించినది. వాని తాత్పర్యము సమన్వయము చమత్కారము నా విష్కరించుటకై యధ్యాపన సమసమయ రీతి ననుసరించితిని. నాకు పునరుక్తభీతి లేదు. కాని యొకచో నిదర్శిత పథమంతట ననుసరింపవచ్చునని భావించితిని.

సాహిత్యాస్వాదనమునకు గాని సాహిత్యసర్జనమునకు గాని సాహిత్యశాస్త్ర గణనీయ మయిన కావ్యప్రకాశకృతి యందరకు హృదయధార్యము. ౧. కావ్యఫలము, కావ్యకారణము, కావ్యస్వరూపము, ఉత్తమమధ్యమాధమ కావ్యభేదములు, ౨ శబ్దార్థముల విభాగములు, అభిధాలక్షణావ్యాపారములు, తన్మూలక వ్యంజకతాసిద్ధి, ౩. అర్థవ్యంజకత, ౪. ఉత్తమకావ్యభేదములు, ౧౦౪౫౫ ధ్వనిభేదములు, ౫. గుణీభూత ౪౫౧౫౨౪ కావ్యభేదములు, వ్యంజనాస్థాపనము, ౬. చిత్రకావ్యభేదములు, ౭. డెబ్బది

దోషములు, ౮. మూడు గుణములు, ప్రాచీన గుణవాదము, ౯ మూడు రీతులు, శబ్దాలంకారములు, శ్లేషాలంకారచర్చ, ౧౦. అరువది యొకటి అర్థాలంకారములు కావ్యప్రకాశ గ్రంథమున నిరూపితము లయినవి.

సాహిత్యశాస్త్రగణనీయమయిన యీ గ్రంథమున కాంధ్రవ్యాఖ్యానము రచించుటకై వలయు కతిపయాలంకార శాస్త్రీయ గ్రంథముల శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు బహూకరించిరి. విశిష్టశోభకల యొక సంస్కృత వ్యాఖ్యానము కూడ విమర్శినితో ముద్రితమగుట పాఠకసహృదయుల యాశయములకు శయములకు రమ్యత నాపాదించునది కావచ్చును. కాని నేను నేనయి యిట్లు ముద్రింప వలసి వచ్చినది. ఇది కవి సహృదయ విమర్శకుల కుపకరించునది కావలయునని నా సంకల్పము. కావ్యలోకము లోని కావ్యాలోకము వలసిన లోక సహృదయు లీ లో నంతయు లీలగా నాలోకించిరి. పర్యాప్తముగా దోహద మిచ్చిరి. అనంతపురము, విజయనగరము, వాల్తేరు, విశాఖపట్టణము, బందరు విద్యాశాలలలో సాహిత్యోపన్యాసముల కేగినపుడు మార్గవ్యయముగా నచటివారిచ్చినది మిగిలిన నీ ముద్రణమున కుపయోగించితిని. సహాధ్యాపకుడు శ్రీ మోడేకుర్తి సత్యనారాయణ మిత్రుడు నా ముద్రణవ్యయభారము తగ్గించెను. గుంటూరు ఏ. సి. కళాశాల హిందూ కళాశాల విద్యార్థి విజ్ఞాన సమితియు నాస్థచూపెను. మూడుల్లాసములు ముద్రించ గలిగితిని. ఇట్లే పరిసరము చూచుకొని మిగులు భాగముల కావ్యప్రకాశుల యౌదార్యమునకు నివేదింతును. ఇదివరలో నవరసగంగాధరము ప్రథమాననమె ముద్రితము. అదియు మిగులునదియు కలిపి ముద్రింపవలసి యున్నది. వలసినది నేను చేయకుండుటెట్లు? చేయగలుగుట యపేక్షితము. అస్తు.

శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిగారు విజయనగర సంస్కృత కళాశాలాధ్యక్షులై నా కిరువదియారు సంవత్సరముల నుండి సర్వవిధాభ్యుదయహేతువు లయిన గురుపాదులు. వారి యాశీస్సు లత్మరక్ష. వారు నా కృతి నభినందించుట నా భాగ్యము. నా శక్త్యుత్సాహములకు వారు పునాది. వారు చూపిన శిష్యవాత్సల్యము సర్వదోహదము. నేను విద్యాభ్యాస మొనరించిన విద్యాశాలాచార్యుల దృష్టిలో నే నిట్టివాడనుగ నుండగలుగుట నా యదృష్టము.

విజయ చైత్రపూర్ణిమ

మాధవరామశర్మ